# అంకితము

వేంకటరాజమంత్రికిల వెంకటరత్నము పత్నియయ్యెఁ ద
చ్ఛంకర పార్వతీ సదృసజంపతులిద్దరకేఁ గుమారుఁడన్
బంకజవైరికిన్ జనులు భక్తి నొసంగెడు నూలుపోఁగుగా
నంకితముం బొనర్చితిని దామరలోకనివాసి తండ్రికిన్

సూర్యనారాయణమూర్తి

# విషయసూచిక

## ప్రథమ భాగము

### ప్రథమఖండము


| | | | |
|---|---|---|---|
| 1 | సంజ్ఞాధ్యాయము | ... | 1 |
| 2 | గ్రహబలాధ్యాయము | ... | 25 |
| 3 | బాలారిష్టాధ్యాయము | ... | 37 |
| 4 | ఆయుర్దాయాధ్యాయము | ... | 41 |
| 5 | రాహుకేతుగ్రహబలాధ్యాయము | .. | 68 |
| 6 | కళత్ర భావాధ్యాయము | ... | 72 |
| 7 | పుత్రభావాధ్యాయము | ... | 82 |
| 8 | మాతృభావాధ్యాయము | ... | 103 |
| 9 | పితృభావాధ్యాయము | ... | 106 |
| 10 | భ్రాతృభావాధ్యాయము | ... | 108 |
| 11 | షష్ఠభావాధ్యాయము | ... | 111 |
| 12 | కర్మ జీవాధ్యాయము | ... | 115 |
| 13 | రాజయోగాధ్యాయము | ... | 116 |
| 14 | మోక్షభావాధ్యాయము | ... | 130 |
| 15 | నైరాణికాధ్యాయము | ... | 132 |
| 16 | స్త్రీజాతకాధ్యాయము | ... | 138 |
| 17 | ప్రత్యేకయోగాధ్యాయము | ... | 141 |


### ద్వితీయ ఖండము


| | | | |
|---|---|---|---|
| 18 | శ్రీ జైమినీజాతక ఫలాధ్యాయము | ... | 150 |

అనుబంధము

# గ్రంథప్రశంస

---

(బ్రహ్మశ్రీ కోన రాఘవయ్యగారు. పెంటపాడు)

శా॥ శ్రీమన్మౌద్గల్యసగోత్ర శీతకర! వాగ్దేవు ప్రభాభాస్కరా!
సోమామాత్య నిజాభిజాత్యనయ! నిస్తుల్య ప్రభావోదయా!
రామస్వామి సుధీంద్ర పౌత్రసుచరిత్ర వ్యక్తధీరవ్రతా!
ధీమద్వేంకటరాజపుణ్యసుత! జ్యోతిశ్శాస్త్ర పారంగతా!

క. జ్యోతిశ్శాస్త్రాబ్ధికి మీ
రేతంబెత్తి రచియింప నిలువరుసై మీ
తాతలతండ్రుల కృషియై
జాతకనారాయణీయ సత్కృతి పొడలెన్

శా॥ ఏవో లెక్కలువేసి రాసి గతులో యేతారలో గాములో
భావాభావవిభేదముల్ తెలియు కే వాదంబులో సేయు నే
లా? విద్వాంసులుమెత్తురే? భళిర! నీవ్రాతల్ జగద్గీతలౌ
లే! వాగ్దేవు పవిత్రవంశ గుణపూర్ణా! సూర్యనారాయణా!

మ॥ అసమాన ప్రతిభాదురంధరుఁడు తానై మెత్తుపై నెత్తు నే
ర్చు సమర్థుండయి ముందువెన్కలను నల్పోప్పుల్ గను
గొంచు నే
దెస నేడెటు లానో రాసులను బండ్రింటన్ గ్రహంబుల్, నవై
క సమిాతున్ జదరంగమాడవలె దత్కాలజ్ఞు డత్యంతమున్.

మ॥ అవినాభావ వివేకమూని యటులన్యో యర్థసామగ్రి సూ
త్మ్రవిధానంబున దేల్చి శాస్త్రవిధికిన్ మర్యాదపోకుండమా
ర్గవమై పండిత పామరాది జనవేద్యంబై త్రికాలాన లో
క విశేషంబులు వన్నె గాంచుగద! నీ గ్రంథంబు
సామాన్యమే!



కృతిభర్తలు కీ॥ శే॥ వాడ్రేవు వెంకటరాజుగారు
గ్రంథకర్తగారి తండ్రిగారు



శ్రీమతి వాడ్రేవు వెంకటరత్నమ్మగారు
గ్రంథకర్తగారి తల్లిగారు



"JYOTISHA VIDYA BHUSHANA"

SRI VADREVU SURYANARAYANAMURTY, B. A.,

*Author of Jataka Narayaneeyam, Yogavali Khandham, Life of Saint Tyagarajaswamy, Muhurta Sindhu, etc.*

# పరిచయ వాక్యము

జాతకనారాయణీయమును రచించిన విద్వాన్ శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తి గారు ఆంధ్రలోకమునకు చిరపరిచితులు. వీరిని, వీరి జ్యోతిష విద్యా ప్రావీణ్యమును మెచ్చి, చవిచూచి, ఫలము అందుకొన్నవారు ఆంధ్రులలో వేలకువేలున్నారు. వీరు సుప్రసిద్ధ జ్యోతిష శాస్త్రవేత్తలు. వీరిని "జ్యోతిర్విద్యాభూషణ" యని ప్రశంసించుట ఎంతయు సమంజసము.

వీరికి జ్యోతిషము వంశపారంపర్యమైనది. ఆ విద్యాప్రావీణ్యము తాత ముత్తాతల నాటినుండి పైతృకదాయమై సంక్రమించి యున్నది. అట్టి పైతృకదాయమును శ్రీ సూర్యనారాయణమూర్తి గారు తమ యనుభవ సారముతో మేళవించి నిరుపమానమైనది, అపారమైనది అగు పాండిత్యమును గడించుకొన్నారు. ఈ శ్రేణిని యీనాడు వీరిని బోలిన దైవజ్ఞులు లేరనుట యతిశయోక్తి కాదు.

శ్రీ సూర్యనారాయణమూర్తి గారు జ్యోతిషమును అభిమాన విద్యగా స్వీకరించినారు. ఈ విద్యను ధన సంపాదనకై వీరు అభ్యసించలేదు. వీరు తండ్రి తాతల సంప్రదాయమును గ్రహించి, అలవరచుకొని, జ్యోతిషమును వలచి, వలపించుకొన్నారు. వీరు చూచిన జాతకముల సంఖ్య కొన్ని లక్షలుండును. ఒక జాతకమును బోలిన జాతకములు పెక్కులుండవచ్చును. ఒకే రీతిగా స్థూలదృష్టికి కాన్పించు జాతకములను విమర్శించి, పరిశీలించి, పరిశోధించి, ఫలములను నిరపేక్షతో తెలుపుట వీరి నిజమైన ఉత్తమ గుణము. లక్షల కొలది జాతకములను చూచుటవలన వీరికి కలిగిన యనుభవము నందలి సారమును, దీని ప్రాచీన గ్రంథములను పరిశీలించి, తమ యనుభవ సారముతో, మహర్షుల సూత్రములకు వ్యాఖ్యానము చేసి యీ జాతక నారాయణీయమును రచించిరి. ఈ గ్రంథము సాధారణముగా జ్యోతిషమందు అభిమానముగల పామరులకేగాక పండితులైన వారికి గూడ సహాయకారిగా నుండగలదు.

రాజమండ్రి　　భావరాజు వేంకటకృష్ణారావు, యం. ఎ. బిఎల్.
15-6-1957　　అడ్వొకేట్,

# జ్యోతిష ప్రశంస

జ్యోతిశ్శాస్త్రము వేదాంగములలో నొకటిగా జెప్పబడినది.

శ్లో॥ సిద్ధాంత సంహితాహోరా, రూపం స్కంధత్రయాత్మకం ।
వేదస్య నిర్మలంచక్షు జ్యోతిశ్శాస్త్ర మనుత్తమం॥

శ్లో॥ అస్యశాస్త్రస్య సంబంధో వేదాంగ మితిగచ్ఛతే ।
అభిధేయంచ జగతః శుభాశుభ నిరూపణం॥

శ్లో॥ బ్రహ్మాచార్యో వశిష్ఠాత్రిమనుః పౌలస్త్యలోమశౌ ।
మరీచిరంగిరో వ్యాసోనారద శ్శౌనకోభృగుః ।
చ్యవనో యవనోగర్గః కశ్యపశ్చ పరాశరః ।
అష్టాదశైతే గంభీర జ్యోతిశ్శాస్త్ర ప్రవర్తకాః॥

ఈ శాస్త్రమున కింతటి మహోన్నత గౌరవము నిచ్చుటకు కారణము లనేకములు గలవు. ఈ శాస్త్రము మానవ జీవితమున కత్యంత సంబంధము కలదై ప్రకృత జీవిత ఫలితములనేగాక పూర్వ ప్రజ్ఞానుగతమైన పూర్వాపరజన్మముల నన్నింటినిగూడ నిర్ణయించును. ఈ శాస్త్రము మానవ జీవితమున కెంత ముఖ్యమయినదో, వేదాంత విషయములో గూడ అంత ప్రధానమైనది.

జీవితము ద్వివిధము. మొదటిది పరమాత్మ రూపము, రెండవది ప్రకృత రూపము. ప్రతి జీవుడు ఒక శరీరమును విడచి ఇంకొక శరీరమును ధరించు నప్పుడు "తంవిద్యాకర్మణి సమారభేతి పూర్వ ప్రజ్ఞాచ" అను ప్రమాణ ప్రకారము, తిర్గి అష్టవసువులతో కూడిన రెండవ శరీర మారంభ మగుచున్నది. అష్టవసువులనగా అవిద్య, కామము, కర్మ, పంచభూతములును. జీవుడు అవిద్యావశమున

తన నిజరూపమైన పరమాత్మను మరచి సంకల్పరూపుడై బాహ్య దృష్టితో సర్వ ప్రపంచము తనదే యను దృష్టితో జూచునప్పుడు అతనికి సమస్త ప్రపంచము తానే యనునట్లు తోచును. సమస్త ప్రపంచమును తనకు తాను సృజించుకొని సర్వకర్మలను చేయుచుండును. ధర్మము వలన సుఖమును, అధర్మమువలన దుఃఖమును యీ మిశ్ర కర్మానుబంధమున నానావిధ యోనులయందున పుట్టుచు, గిట్టుచు సంసారమను మహా ప్రవాహమున కొట్టుకొని పోవుచుండును. ఈ బంధములను వదల్చుకొనుటయే మోక్షము.

అయినచో యీ సర్వప్రపంచక సృష్టి దేనియందు జరుగుచున్నదని సందేహము కలుగవచ్చును. ఈ సృష్టి కాలవశమున జరుగుచున్నదని అందరకు తెలిసిన విషయమే. సామాన్యముగా నాటుకలో గూడ కాలకర్మలు గూడినగాని యేదియు కాదని జెప్పబడుచున్నది ఇచ్చట జీవుడు చేయు ప్రతిపనియును కర్మయగుచున్నది. కర్మకు ఆధారము వృత్తి అనగా కోరిక. కోరిక కాధారము మనస్సు అనగా ప్రతి కోరికయును వృత్తిరూపమున మహాతరంగమువలె మనస్సులో బయలుదేరి మానవునిచే సమస్త క్రియలను చేయించుచున్నది. ఇట్లు ప్రేరేపింపబడిన కర్మలకు పరమాత్మ కాలరూపుడై ప్రాప్తకాలము వచ్చునప్పటికి "దైవాదేవేతి నిశ్చయీ" అని చెప్పబడినట్లు శుభాశుభ ఫలితములుగ పరిణమింప జేయును. కాబట్టి సర్వసృష్టికిని ఆధారము కాలము అగుచున్నది. సృష్టిస్థితి లయ కారణభూతమగు నీ కాలము ఎట్టిదని నిర్ణయించవలసి యున్నది. కాలనిర్ణయము గూర్చి శ్రుతి, స్మృతులయందు అనేక విషయములు చెప్పబడి యున్నవి. "నభీమయాం మ్యహాంకిం త్వేక స్త్వవ కాలస్య వ్యాపార భేదైద్వైవిధ్యం" అని చెప్పబడినది.

ఈశ్వర రూపమైన కాలము వ్యవహారభేదముచే రెండుగా విభజింప బడినది. "ఉత్పత్తి స్థితి వినాశకానాం కర్తృత్వాని, సకేవలః కాలః" అనగా సమస్త లోకముల యొక్క సృష్టి, స్థితి, లయములు చేసిచే నిర్వహింపబడుచున్నదో దానిని కేవలకాలమందురు. ఈ కాలము జగన్నిర్మాణ కారణమై, జ్ఞానస్వరూపమై, నైజముగ నిర్గుణమైనదియు జీవుని సంసారబంధ మోక్షములకు కారణమగు చున్నది. షడ్గుణైశ్వర్య సంపన్నమగు నీ కాలము సర్వోత్కృష్ట మైనది ఆద్యంతరహితమయినది అగుచున్నది. బ్రహ్మ, రుద్ర, నారాయణులును, ఇంద్రాదులును సృజించు కాలస్వరూపుడగు నీశ్వరుడు మాత్రము ఒక్కడే యగును.

శ్లో॥ అనాది రేష భగవాన్కాలో నంతోక్షరః పరః ।
సర్వగత్వా స్వతంత్రత్వాత్సర్వాత్మత్వా మహేశ్వరః ।
బ్రహ్మాణోబహవో రుద్రా అన్యేనారాయణా దయః ।
ఏకోహి భగవానీశః కాలః కలిరి తిస్మృతః ।
బ్రహ్మనారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌలయః ।
ప్రోచ్యతే కాలయోగేన పునరేవచ సంభవః ।
పరబ్రహ్మంచభూతాని వాసుదేవోపి శంకరః ।
కాలానైవచ సృజ్యంతేన ఏవగ్రసతే పునః ।
తస్మాత్కాలాత్మకం విశ్వంసఏవ పరమేశ్వరః॥

పైని చెప్పబడిన విధమున కాలము నిత్యము అనిత్యమని రెండు రకములుగ వ్యవహరింప బడుచున్నది.

శ్లో॥ కాలం కాల విభక్తించ నక్షత్రాణి గ్రహాస్తదా ।
ససర్జచైవేమాం స్రష్టుమిచ్ఛన్నిమాః ప్రజాః॥

అని చెప్పబడుటచేత ఈ వ్యవహారిక కాలము సూర్యాది గ్రహ
సంచారముచే పరిమిత మగుచున్నది. ఈ కాలము ప్రధాన
యగు సంవత్సరము నాశ్రయించి యున్నది. అనగా లిప్త వె
అయనము వరకుగల భేదములు సంవత్సరముతో పోల్చిన
లగును. యుగము మొదలు పరార్థమువరకు గల కాలవిశేష
సంవత్సరముకంటెగొప్పవి. ఈకాలము కర్మకు ఆశ్రయమగుచ
"నచ కాలస్య కర్మాంగత్వే వేదితవ్యం" ఈ కాలమున నీపని
వలెననుమొదలగు మాటలలో నీ భావము కలదు. కాబట్టి
వారము,నక్షత్రము, మొదలగునవి కర్మకు తాము గుణ
పుణ్యాపాపములకు కారణ మగుచున్నవని మహర్షుల మతము.
కాని ఆతిథ్యాదులు స్వతంత్రముగ పుణ్యాపాపములు గల్గిం
గావు, గల్గించు సమర్థములును గావు.

ఈ విషయమై గర్గి మహర్షి యిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ తిథి నక్షత్ర వారాది సాధనం పుణ్య పాపయోః ।
ప్రధాన గుణభావేనన స్వాతంత్రేణ తేక్షమాః॥

కాబట్టి సమస్త శుభాశుభ, పుణ్య పాప కర్మలకు,తత్ఫలిత
సుఖ దుఃఖములకు ఆధారమైన కాలమును గూర్చి చెప్పినా

కర్మ జీవుని జన్మకాధారము. అందువలన 'తేషుక్షేత్రప్రః
జాతవ్యః పుణ్యసంగ్రహాః॥ అని చెప్పినాను. జీవుడు తాను
కర్మఫలితముగ సుఖదుఃఖములను అనుభవించుటకు కా
నిర్ణయించుకొని పుట్టుచున్నాడు. కాబట్టి గ్రహస్థితిగతులనను
రేమి సుఖ దుఃఖముల ననుభవించునో వాటిని జ్యోతిషము తె
ఈ విషయములను గురించి "కర్మార్జితం పూర్వభవే సదాది'
తాను పూర్వజన్మములలో చేసిన కర్మఫలితములను యెట్లు

వించునో యీ శాస్త్రములో చెప్పుచున్నానని చెప్పినాడు. వ్యవహారములో మానవుడు కర్మలు చేయునప్పుడు కాలసంబంధము నిర్ణయించుకొను చుండును. అనగా కాలములేని కర్మలేదని స్పష్టమగుచున్నది. జ్యోతిషము (1) కాలనిర్ణయము చేయును. 2) కర్మ అనగా నెట్టిదో తెలుపును. (3) కాలకర్మలకుగల అవినాభావ సంబంధమును వివరించును. (4) కాలకర్మల వలన గల్గు నుత్పత్తి స్థితి లయములను నిర్ణయించును. కాలమును రెండు రకములుగా అనగా పరమాత్మ రూపమగు కేవల కాలముగను, సూర్యచంద్రాత్మకమగు ఖండకాలముగను విభజించును.

ఈ వ్యవహార కాలము భూత, భవిష్యద్వర్తమాన కాలములుగ విభజింపబడి బ్రహ్మ, విష్ణు, శివాత్మక మగుచున్నది. ఇదియే త్రిశూల సంజ్ఞ. పరమాత్మ సృష్టికర్తయై భూత కాలమునకు బ్రహ్మగను, వర్తమానమునకు విష్ణువుగను, భవిష్యత్తుకు రుద్రుడుగనూ త్రిమూర్త్యాత్మకమై చేతనమూర్తి యగుచున్నాడు. ఇదియే త్రిశూల సంజ్ఞ కంతరార్థము. ఇది విష్ణువునకు తిరునామమైనది. కాబట్టి వేదమే ఆయువుపట్టుగా కల్గినది గావున జ్యోతిషము వేదాంగముగా మహర్షులచే జెప్పబడినది. ఈ జ్యోతిషము యింతకు ముందు చెప్పబడినట్లు స్కంధత్రయముగా వివరించబడిననూ, (గణితము, జాతకము, ముహూర్తము) యితర ఉపాంగములుగూడ కల్గియున్నది. అవి వాస్తు ధర్మశాస్త్రములు. గణితభాగము సూర్యాది గ్రహ సంచారమును బట్టి కాలనిర్ణయము చేయుచున్నది. కాలకర్మల సమ్మేళమున గల్గు ఉత్పత్తి, స్థితి, లయములను నిర్ణయించి వాటి ఫలితములను జెప్పునది ఫలితభాగము. సమస్త కర్మల ఆచరణకు అనుకూలమైన ఫలితమును బడయుటకు ముహూర్త భాగము కాలనిర్ణయము చేయును.

ఇంతవరకును కాలమును గురించి వివరించినాను. ఇక ఫలభాగమగు జ్యోతిషము గురించి తెల్పెదను. ఈ భాగములో మహర్షులు అనేక మతములను వివరించినారు. అందులో ముఖ్యముగా మన ప్రాంతమునందు వాడుకలో నున్నవి. పారాశర్యము, జైమిని శ్రీపతిభట్టుమతములు. ఫలిత భాగమును (1) ఆయుర్దాయమని, (2) యోగమని రెండుగా విభజించినారు. ఈ రెండు భాగములను తిర్గి 12 భావములుగా విభజించినారు. జాతకుని జన్మకు పూర్వము తల్లి, తండ్రి, జ్యేష్ఠ సోదరులు, పరము భార్య, సంతానము, కనిష్ఠులు, వర్తమానము, ఆయువు, ధనము, వృత్తి, ఋణము, ఆరోగ్యము, లాభవ్యయములు. ఈ విధముగా ద్వాదశ భావములను నిర్ణయించినారు. దీనిలో అంతర్భాగము లనేకము లున్నవి. ఈ విధముగా చక్కగా భావనిర్ణయము చేసి ఏ గ్రహాబలమువలన నే భావ మెట్టి ఫలితము నిచ్చునో యీ భాగములో చెప్పబడినది. ఈ భాగము కేవలము మానవ జీవితమునకు సంబంధించిన దగుట చేతను అతి క్లిష్టమైనది. దీనికి నేర్పు, అనుభవము, శాస్త్రజ్ఞానము, జాతకము నందలి శుభాశుభములను చక్రము చూచుటతోడనే విడదీయు ప్రజ్ఞ, చాల అవసరము. జాతకఫలములను గ్రుడ్డిగా చెప్పకూడదు. విమర్శనాశక్తి చాల అవసరము. ఏ యోగము నెట్లు యే సందర్భమున నే విధముగా అన్వయించవలెనో తెలిసి కొనవలెను. కాబట్టి అనేక జాతకములు యీ ముప్పది సంవత్సరములలో పరిశీలించిన తరువాత నా అనుభవములో పొడగట్టిన విషయమిది. దీనికి ఆధారము సాంప్రదాయానుగతమునై సూత్రప్రాయముగా నిల్చిపోయిన అనుభవసారము. ఈ విషయమై అనేక సంగతులు, జాతక నారాయణీయము, యోగావళి ఖండములందు తెల్పియున్నాను.

ముహూర్త భాగము ముఖ్యమైనదిగా మన దేశమున వాడబడు చున్నది. పిన్నవారు మొదలు పెద్దవారు వరకును పామరులు మొదలు పండితుల వరకును సర్వ కర్మలయందును నిత్యము యిది వాడుకలో నున్నది. షోడశకర్మలును చంద్రుని షోడశ కళలను బట్టి నిర్ణయింపబడినవి. సూర్యుడు జీవరూపమును, చంద్రుడు మనో రూపమును బొందుచున్నారు. అట్లై సూర్యుడు పరమాత్మ రూప మగు కాలరూపము, చంద్రుడు శక్తి రూపములు పొందుచున్నారు. అనగా ప్రవర్తనారూపకమగు కర్మకు కారకులగుచున్నారు. కాబట్టి చంద్రుడు మనోరూపమై, మనము చేయు సర్వ శుభాశుభ కర్మలకు తన కళలయొక్క వృద్ధి క్షయముల ననుసరించి మార్పులకు కారణ భూతుడగుచున్నాడు. ఈ కారణము వలన వేదవిహిత కర్మలకు చాంద్రమాన మాధార మగుచున్నది. ఈ ముహూర్త భాగమున ఆయా ముహూర్తముల కాపాగా విధులను మహర్షులు నిర్ణయించి యున్నారు. వారు చెప్పిన విధులను ప్రజ్ఞతో ముహూర్తములను నిర్ణయించి నపుడు, అనేక ముహూర్తములలో సత్ఫలితములు కలుగుచుండుట నా అనుభవము. తలపెట్టిన కార్యములను బట్టి ముహూర్తము నిర్ణయించవలెను.

జ్యోతిషమునకు ఉపాంగములగు, వాస్తు శిల్పము, ధర్మశాస్త్రము, శాంతి విషయముల గురించి కొంత చెప్పవలసి యున్నది. కాని యిది సమయమును, స్థలమును కాదు. కావున నీ జ్యోతిశ్శాస్త్ర ప్రశంసను యింతటితో విరమించుచున్నాను.

ఇట్లు

7-7-57 వాడ్రేవు సూర్యనారాయణమూర్తి



"ఆశ్రితకల్పద్రుమ"

శ్రీ జిల్లాసుబ్బారావు శ్రేష్టిగారు

రాజమండ్రి పురపాలక సంఘ సభ్యులు

ఉ. శ్రీసఖుఁ డాత్మభక్తుని వి, శిష్టగుణాన్వితు దాత్ముశేఖరున్
వాసినిఁగన్న జిల్లకులవార్ధి నిశాకరు సుబ్బరాయు, నే
యేసమయంబులందు సిరి నిచ్చుచు నాయువు పుత్రపౌత్రులన్
బాసలఁగూర్చి ప్రోచుత శభాసనుభంగిని లోకులెల్లరున్ ॥

శ్రీ లక్ష్మీహయగ్రీవాయనమః

రాజమహేంద్రవర పురపాలక సంఘ సభ్యులు
మహారాజశ్రీ జిల్లా సుబ్బారాయశ్రేష్ఠిగారి

# ప్రశంసా పద్యములు

(ముక్కవల్లి అన్నప్పదీక్షితులు)

సీ. సుబ్బరాయుని దానమబ్బని దీనుండు
ప్రజలలో లేఁడను వార్తసాక్షి
సుబ్బరాయుని విత్తశోభకు స్థిరమగు
గ్రంథసంఘంబులు కలవుసాక్షి
సుబ్బరాయుని మనసుబ్బును భక్తిచే
ననుటకు దేవార్చ యగునుసాక్షి
సుబ్బరాయు వినయశోభకుఁ బండిత
వృద్ధులే యగుదురు పెద్దసాక్షి
తే. గీ. సూర్యచంద్రులు కలకాల మార్యజాతి
కెల్ల నుపమానభూతుని జిల్లవంశ
సుబ్బరాయుని సద్గుణశుద్ధశీలు
నెల్లభంగుల గాచుత మీశ్వరుండు.

సీ. ధనము వృద్ధినిఁగన్న వినయుంబు తగ్గదు,
వేల్పుల పూజలు వీడకుండు
సిన యీకార్యంబు నెఱవేర్చవలెనన్న,
సాహసంబున వానిఁ జక్కఁబఱచు
సభ్యుఁడై పురపాల సంఘంబులోపల,
గర్వమావంతేనిఁ గాంచకుండు
పురపాలనంబులోఁ బొరపాట్లు గల్గిన,
మది నేవగించుచు మాన్పుచుండు.
ఆ. వె. ఇట్టి సుగుణపేటి సెట్టికులోత్తరుఁ
బోలు జనులు పుడమిఁ బుట్టబోరు
వీని సుబ్బరాయు వెన్నుఁడు కరుణతోఁ

స్తిశ్రీ చాంద్రమాన హేమళంబ నామ సంవత్సర ఆషాఢ
ఏకాదశి ఆదివారం ది 7-7-1957 శ్రీ విస్సా అప్పారావు
ధ్యక్షత క్రింద జరిగిన పౌరసన్మానసభ యందు సమర్పింపబడిన

# అభినందన సన్మాన పత్రము



శ్రీ రాజశ్రీ వాడ్రేవు సూర్యనారాయణ మూర్తి బి. ఏ. గారికి
రాజమహేంద్రవరం

శయా,

ఁ అసమాన జ్యోతిష విద్యాజ్ఞాన పాటవముచే అనేకమంది
ని ఆనందపరచి, తృప్తిపరచి ఆపత్సమయంబున చేయూత
వారి కృతజ్ఞతను అప్రయత్న పూర్వకముగా అందుకున్న
త్రులు మీరు. ఈ భాగ్యము అనన్యము. అసాధారణము.
మానము. మీ జ్యోతిష విద్యావైభవము, మీ వంశాను
న వైదుష్యము, మీచే సముపార్జితమైన, అపారమైన
వజ్ఞానముతో మేళవింపబడి మీ జ్యోతిషవిద్య నిరపేక్షా
పొంది లోకమున కెంతో మేలు చేసినది. ఇది మా అనుభవ
హృదయాంతరాళము నుండి ప్రతిధ్వని నిచ్చుచున్నది.

రు జ్యోతిష విద్యాప్రవీణులు. వాస్తు, శిల్పశాస్త్ర పారం
. సామాన్యులకు దుర్లభమైన ఆధ్యాత్మిక చింతనము మీకు
నది. పూర్వపుణ్యవశమున బ్రహ్మజ్ఞాన నిధానములు మీరు.

మీరు చేసిన లోకోపకారమును గుర్తించి ఆంధ్రలోకము నేడు రాజమహేంద్రపుర వాస్తవ్యులు, పురప్రముఖుల యెదుట మీ వైదుష్యమును, మీ విశాల హృదయమును, జనోపకార చింత యును మొదలైన మీ సుగుణములను ఉగ్గడించుటకు మాకీ అవ కాశము కలిగినందుకు మేము ధన్యులమని భావించుచున్నాము. మీవలె జ్యోతిషవిద్యార్ణవము మథించి అమృతప్రాయమైన అనుభవ సారమును గడించిన విద్వాంసులు దేశమందు మిక్కిలి అరుదుగా నున్నారు. అట్టిచో మీవలన అపారమైన ఉపకారము పొందినవార మగుచు మా కృతజ్ఞత తెలుపుకొనుటకు మిమ్ముల నాహ్వానించి మీకు అంబరముల నొసగి భవద్రచితములైన గ్రంథముల నచ్చొత్తించి, ప్రకటించి తనివితీరక యీ మహోత్సవ సమయమున మా కృతజ్ఞతా సూచకముగను, మీ విద్యాప్రభావము వెల్లడి యగుటకు మీకు "జ్యోతిష విద్యాభూషణ" అను బిరుదమును సమర్పింపమని అధ్యక్షులను ప్రార్థించుచున్నాము. సద్భావముతో మేము సమర్పించిన మన్నన సత్కారములను హృదయ పూర్వక ముగా స్వీకరించి మమ్ముల నానందింపజేయ గోరుచున్నాము.

ఇట్లు

సన్మాన సంఘము

అధ్యక్షులు

శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు
యం. ఎ. బి. ఎల్, అడ్వొకేటు

శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్య
అడ్వొకేటు

శ్రీ బులుసు పాపయ్యశాస్త్రి
సహాయ కార్యదర్శి

## సభ్యులు

1. శ్రీ వాడ్రేవు వెంకప్పారావు, జమీందారు
2. ,, జిల్లా సుబ్బారావు, మునిసిపల్ కౌన్సిలర్
3. ,, జి. వరదారావు
4. ,, ఇన్నమూరి చెంచయ్య, మునిసిపల్ కౌన్సిలర్
5. ,, బచ్చు సత్యానందం బి. ఏ, మునిసిపల్ కౌన్సిలర్
6. ,, కోణగళ్ళ వెంకటేశ్వరరావు
7. ,, ఉండవిల్లి శంకరకోటేశ్వరరావు, ప్రశిడెంటు, భారత సేవక సమాజ్
8. ,, మన్యం వెంకటకృష్ణ పాపారావు
9. ,, పి. ఘనశ్యామదాసు, బ్యాంకర్
10. ,, సలుమూరు పోతురాజు
11. ,, దొంతంశెట్టి తాతాచార్యులు
12. ,, తమ్మినీడి సుబ్బారావు, భారత్ మోటారు వర్క్సు
13. ,, గోవిందరాజుల అబ్బన్న, ఇటికాయులపల్లి
14. ,, దేవరపల్లి సూర్యారావు, ఆంధ్రా జనరల్ ఫైనాన్సు కార్పొరేషన్
15. ,, అరవ వెంకటస్వామి
16. ,, కొండూరి గంగరాజు
17. ,, దండమూరి వెంకటకృష్ణారావు
18. ,, చిట్టూరి వెంకట దుర్గాప్రసాదరావు
19. ,, కాండ్రేగుల శ్రీనివాస జగన్నాధరావు బహద్దర్
20. ,, పూసపాల పుల్లయ్య
21. ,, నిడమర్తి నరసింహం
22. ,, జయంతి లక్ష్మీనృసింహశాస్త్రి

అధ్యక్షా, రాజమహేంద్ర పురప్రముఖులారా!

మీరు నాయందు అత్యంత ఆదరాభిమానములు కలిగి, నా జ్యోతిష శాస్త్ర ప్రావీణ్యమును వాస్తు శిల్పశాస్త్ర జ్ఞానమును మీ మీ శ్రేయోభివృద్ధుల కొరకు నిష్కామ చింతతో ఉపయోగించి మీకు తోడ్పడినానని, సద్భావముతో మీరు చేసిన యీ సన్మాన సత్కారములకు నేను మిక్కిలి సంతోషము పొందుచున్నాను. మరియు యీ సన్మాన సత్కారములు వ్యక్తిగతముగా నాకు చేసిన వని గాక జ్యోతిషశ్శాస్త్రవిద్యకు, తదుపాంగమైన వాస్తు శిల్ప శాస్త్రముకు చేసిన ఘన సత్కారమని నేను భావించుచున్నాను. నే నెరిగినంతవరకు యిట్టి సన్మానము జ్యోతిశ్శాస్త్రవేత్తకు, దైవ జ్ఞునకు జరిగియుండ లేదు. నేను, తమకు చేసిన స్వల్పసేవకు మీరింత గా సన్మానించుట, బహూకరించుట, బిరుదు పట్టము నొసంగుట నా మహాభాగ్యమని తలచుచున్నాను. మీరిచ్చిన సన్మానపత్రమున తెలిపినటుల, నా జ్యోతిష శాస్త్ర ప్రావీణ్యము, అనుశ్రుతమును, సంప్రదాయ సిద్ధమును, అనుభవసారమును అయివున్నది.

నే నెప్పుడును యీశ్వరార్పిత చిత్తవృత్తితో నుండుటకు నిరంతరము కృషి జేయుచున్నాను. ఈ విషయము మీరు ఘన ముగా వర్ణించినారు. ఇది భగవత్కృపా విశేషము. మీరు ప్రశం సించిన నా పాండిత్యవిశేషము, మహామేధావులును, ఏకసంత గ్రాహులును, అపార జ్యోతిష పాండిత్య మహిమగలవారును నాకు గురువులు అగు మా తండ్రిగారి వలన నాకు సంప్రాప్తమయినది. కావున నీ సత్కారము వారికి గూడ చెందినట్లుగా నేను భావించుచున్నాను.

కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ,

కళాప్రపూర్ణేత్యాద్యనేక బిరుదాంకితులు

ఆంధ్ర ప్రభుత్వాస్థాన కవీశ్వరులునగు

# బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

# బ్రహ్మశ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తి బి. ఏ. గారికి

ది 7–7–57 తేదీన జ్యోతిషవిద్యాభూషణ బిరుదప్రదాన
సన్మాన సభలో చదివిన ప్రశంసా పద్యములు.

ఉ. గాయక భక్తలోకమును గావగనుండిన వేదమాతసం
ధాయకుఁడై యభిజ్ఞజనతావినుతాత్మకు నర్చిరాది మా
ర్గాయితమూర్తియై భువనరక్షకుఁడై వెలుఁగొందు సూర్యనా
రాయణమూర్తి నైజమగు నాఖ్య నెసంగెడు మూర్తిఁ బ్రోచుతన్.

సీ. విద్వజ్జనుల గాంచి విపుల దారిద్ర్యస్న
తోదధిదాటించు నోడరేవు
అనదలౌ వారల నాపదంభోనిధి
నొయ్యనదాటించు నోడరేవు
పరుల కసాధ్యమై పరగెడు రాజకీ
యోదధి దాటించు నోడరేవు
సకలకష్టములకు సదనమౌ సంసార
కోగ్రాబ్ధిదాటించు నోడరేవు
అట్టియోడరేవు నన్వయాదిం జేర్చు
కొనఁగ గలుగునట్టి కులమునందు
సూరివర్యుఁడగుచు సూర్యనారాయణ
మూర్తికీర్తనీయ కీర్తిఁబొలుచు.

ఉ. పాయక రాణ్మహేంద్రపుర పండితవర్యులు ఏపు బూర్ణకుం
భాయిత గౌరవం బొసగి ప్రస్తుతిసేయుచు జ్యోతిషంబునన్
శ్రీయుత భూషణంబనుచు జెప్పుచునుండిరి నేడు సూర్యనా
రాయణమూర్తి నీగరిమ భాగ్యవిశేషము నా దలంచెదన్.

శా. జ్యోతిశ్శాస్త్ర మపారసాగరము సంస్తోత్రాతిపాత్రంబు వి
ఖ్యాతాత్యద్భుత ; తత్త్వదర్శనము దివ్యప్రాభవోపేత మా
జ్యోతిర్విజ్ఞుని దేవతాంశభవుడంచుం జెప్పగా నొప్పనో
జ్యోతిర్భూషణ! వాడ్రేవుకులబంధూ! సూర్యనారాయణా!

ఉ. సూర్యుని సత్ప్రకాశమున సూరెలనుండు గ్రహంబు లొప్పుచున్
పర్యటనంబొనర్చు సురవర్త్మమునందు దదర్థభావ సం
పర్యుదయంబె జ్యోతిషసమంచిత నామమునొందె నీవు నా
సూర్యుని పేరివాడవలసూక్తము నీదియనంగ నొప్పదే.

కం. జ్యోతిష విద్యాభూషణ!
జాతక సిద్ధాంతములను జాలితి మూర్తం
బేతన్మాత్రము నీ కో
జ్యోతిర్మూర్తీ! బుధేంద్ర! శుభమగు నీకున్.

శ్లో॥ స్వస్త్యస్తు వాడ్రేవు కులప్రదీప!
శ్రీసూర్యనారాయణనామధేయ
జ్యోతిర్విదాం భూషణ! తేజసోఽస్తు
దీర్ఘాయురారోగ్యపరంపరాస్తు

స్వస్తి సమస్త మంగళానిభవంతు.

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

శ్రీ సత్యవోలు శేషగిరిరావు బ్రహ్మశ్రీ శ్రీవాద్రేవు సూర్యనారాయణమూర్తిగారికి ది 7-7-57 తేదీని "జ్యోతిష విద్యాభూషణ" బిరుద ప్రదాన సన్మానసందర్భమున నొసగిన పద్యరత్నములు.

శ్రీవాసించుకు శేశయప్రతతికిం బ్రీతిం బ్రసాదించు నే
దేవాధీశుడు కల్పజేనికి ఒసత్తేజం బెపం డిచ్చు నా
దేవుం డోముత సర్వసంపదలతో దీర్ఘాయువుం గూర్చుచున్
శ్రీవాద్రేవుకులార్ణవామృతకరున్ శ్రీసూర్యనారాయణున్.

"జ్యోతిష విద్యాభూషణ!"
ఖ్యాతింగొన్నావు సద్గుణావాలా! యీ
రీతి నిను సత్కరించుట
ప్రీతిని శాస్త్రమును సత్కరించుట కాదే!

చదివిరిగాక శాస్త్రమును సాంతముగా మహనీయులెందరో
చదువులలోని మర్మములు చర్చయొనర్చి సమన్వయించి యి
య్యదనున నీగతిన్ ఫలములబ్బు నటంచు వచించు ప్రజ్ఞ నీ
యది యని పండితోత్తములు నాకుట నీ సుకృతంబు జాటదే.

మరియు నింక నొక్కమాట వచించెద
నీవు నొడువుఫలము నిక్కమాట
పలువు రాడుకొనరె వాక్సుద్ధి కలవాడ
వనుచు నాంధ్రదేశమందు నెల్ల.

వాంఛితార్థమొసగి వాద్రేవు వంశాబ్ధి
చంద్రనిభుని జ్యోతిషప్రవీణు
సుగుణరత్నరాశి సూర్యనారాయణు
రక్షసేయుగాత గ్రహగణంబు.

రాణ్మందిరం
7-7-57

ఇట్లు
సః శేషగిరిరావు

శ్రీలక్ష్మీ హయగ్రీవాయనమః

మహారాజశ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారికి,
"జ్యోతిష విద్యాభూషణ" బిరుద ప్రదాన సమయమున
ఆశీర్వదించిన పద్యములు

శ్రీయుత వాడరేవుకుల శేఖరుఁడైన ప్రధాని సూర్యనా
రాయణమూర్తినిన్ బటు నిరామయముల్ సుత పుత్త్రి కాకళ
త్రాయువులన్ మహాధనము దైవము భక్తినిఁ గీర్తినిచ్చి యా
శ్రీయుతమూర్తియైన హయశీర్షుఁడు బ్రోచుత మెల్లకాలమున్॥

గ్రహముల శాసనాన రవి గౌరవమందె ఖగోళమందునన్
గ్రహముల శాసనంబునను గౌరవమందెను సూర్యనామకుం
డిహమున, నామధేయము వహించియుఁ దద్విధినేర్చెగావునన్
గ్రహపతి గాచుఁగాత చిరకాలము సూర్యుని విశ్వరీతులన్॥

నీతికి నిల్చి లౌకికము నేరిచి విత్తముఁ గోరకుండఁగా
జాతివిచక్షణం బిడక సర్వజనంబుల నొక్కతీరుగా
జాతకభాగమందుగల శక్తినిఁజూపి ఫలంబుఁ జెప్పు నా
చేతము వాక్కు శుద్ధిగల జెట్టిని సూర్యుని విష్ణుఁడోముతన్॥

ముక్కవిల్లి అన్నప్పదీక్షితులు
తెలుఁగు పండితుడు
రాజమహేంద్రవర పురపాలక
సంఘోన్నత పాఠశాల

రాజమండ్రి
7-7-57

## శ్రీసూర్యనారాయణమూర్తిగారికి పురప్రజల ఘనస్వాగతము

జూలై 7 : నేటిరాత్రి 7 గంటలకు విక్రమహాలులో జ్యోతిష విద్యాప్రవీణులు వాస్తు శిల్పశాస్త్రపారంగతులైన శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తి బి. ఎ. గారికి పూర్ణకుంభంతో జ్యోతిష విద్యాప్రవీణ బిరుదుప్రదానంతో దుశ్శాలువలతో పురప్రజలు

ఘనసన్మానం చేశారు. ఆస్థాన కవివరేణ్యులు ఆప్యాయంగా ఆశీస్సుల నొసగారు.

శ్రీ సూర్యనారాయణమూర్తిగారు రాజవీధిగుండా వూరేగుతూ విక్రమహాలు సింహద్వారంవద్దకు రాగానే వారికి ఆహ్వాన సంఘం తరఫున శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారిచే పూర్ణకుంభము, సన్మాన సభలో పురప్రజల తరఫున అధ్యక్ష పీఠము నలంకరించిన ప్రొఫెసర్ శ్రీ విస్సా అప్పారావుగారిచే "జ్యోతిష విద్యాభూషణ" బిరుదు ప్రదానం, సన్మాన సంఘం తరఫున శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్యగారిచే అభినందన సమ్మానపత్రం, శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారిచే దుశ్శాలువలు, నూతన వస్త్రములు సమర్పింపబడగా, శ్రీ సూర్యనారాయణమూర్తిగారు తమచే రచింపబడిన గ్రంథాలను కార్యకర్తలకు బహూకరించారు. పుర ప్రముఖులు, అధికారులు, వర్తక శ్రేష్ఠులేకాక బెజవాడనుండి వచ్చిన డా॥ తోలేటి కనకరాజుగారుకూడ పాల్గొన్న యీ సన్మానసభ కుమారి అల్లు సత్యవతి అండ్ పార్టీవారి గానకచ్చేరితోను బ్రహ్మశ్రీ పోతుకూచి రామమూర్తిశాస్త్రి మొదలగు పండితుల వేదాశీస్సులతోను విజయవంతంగా ముగిసింది.

నేటి సా॥ 5 గం॥లకు నాళంవారి సత్రంవద్ద సన్మానసంఘ సమావేశమై మోటారు శకటంపై శ్రీసూర్యనారాయణమూర్తిగారిని మంగళవాయిద్యాలతో రాజవీధిగుండా విక్రమహాలుకు తీసికొని వచ్చారు. మోటారు శకటంలో శ్రీ మూర్తిగారికి ఇరువైపులా శ్రీభావరాజు వెంకటకృష్ణారావు, మద్దూరి శివరామకృష్ణయ్య గార్లు ఆసీనులుకాగా, ముందుభాగంలో శ్రీ పూసరాల పుల్లయ్య గారు ఆసీనులైనారు. శకటమునకు ముందు శ్రీయుతులు జి. వరద రావు, యిన్నమూరి చెంచయ్య, నలుమూరి పోతరాజు, జిల్లా సుబ్బారావు, గొట్టెల అప్పలస్వామి, చేబ్రోలు నారాయణ ప్రభృతులు నడిచారు.

ఆహ్వానసంఘంవారి తరఫున శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు

గారు, ప్రొఫెసర్ శ్రీ విస్సా అప్పారావుగారిని అధ్యక్ష స్థానానికి ఆహ్వానించారు.

శ్రీ విస్సా అప్పారావుగారు, శ్రీ వాడ్రేవు సూర్యనారాయణ మూర్తిగారికి తమకుగల పూర్వపరిచయాన్ని తెలియజేసి శ్రీ మూర్తిగారు అనుశ్రుతంగా, సాంప్రదాయసిద్ధంగా తయారైన గొప్పజ్యోతిషవిద్వాంసులని ప్రశంసించారు.

పూర్వపుణ్యం, సంస్కారబలంచేత లభ్యమయ్యే యిటువంటి శాస్త్రపరిజ్ఞానాన్ని లోకుల ప్రయోజనార్థం ఆధ్యాత్మిక దృష్టితో ఉపయోగించే వారి శక్తిసామర్థ్యాలను కీర్తించారు. వారి రచనలైన జాతకనారాయణీయం, జాతకచంద్రికలనుగూడ ప్రస్తుతించారు.

శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్యగారు, శ్రీయుతులు యస్. కృష్ణయ్యచెట్టి (స్పెషల్ ఆఫీసరు, గుంటూరు) అర్. వి. సీతారామారావు (అడిషనల్ జిల్లాజడ్జి) మొదలగు ప్రముఖులనుండి వచ్చిన సందేశాలను, సన్మానసంఘంతరఫున అభినందన సన్మాన పత్రాన్ని చదివి వారికి సమర్పించారు.

కవికుమార్ సత్యవోలు శేషగిరిరావుగారు పద్యాలుచదివారు. శ్రీయుతులు వేమరాజు వెంకటేశ్వర్లు, నల్లాన్ చక్రవర్తుల రంగాచారి వారిప్రతిభావిశేషములను తెలియజేశారు.

ఆంధ్ర ఆస్థానకవి బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తమఅస్వస్థతను లెక్కజేయక శ్రీమూర్తిగారికి ఆశీస్సులనొసగుచు పద్యములు చదివారు. శ్రీ చేబ్రోలు నారాయణ, మన్యం వెంకట కృష్ణపాపారావుగార్లచే ఒసంగబడిన శాలువలు, నూతన వస్త్రములు శ్రీమూర్తి గారికి శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారిచేబహూకరింపబడినవి.

పిదప అల్లు సత్యవతి అండ్ పార్టీవారి గానకచ్చేరీ పండితుల వేదాశీస్సులతో సమావేశం ముగిసింది. సమావేశానికి శ్రీమునిరెడ్డి (హాస్టల్ సూపరింటెండెంటు) శ్రీ విశ్వనాథరెడ్డి (మ్యునిసిపల్ కమిషనర్) గార్లు తదితర హాస్టల్ ఉద్యోగులుకూడ హాజరైనారు.

— రాజమండ్రి సమాచారము

# జ్యోతిషపండితునికి ఘన సమ్మానము

రాజమహేంద్రవరంలో

(శ్రీ) వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారికి

రాజమహేంద్రవరం జులై 8 : — 25 సంవత్సరాలకు పైగా జ్యోతిష, వాస్తు, శిల్ప, శాస్త్రాల పరిశోధనలో కృషిచేసిన (శ్రీ) వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారికి 7 తారీఖు సాయంకాలం రాజమహేంద్రవరంలోని విక్రమ హాలులో ఏర్పాటు చెయ్యబడిన సన్మానసభలో సభకు అధ్యక్షత వహించిన ప్రొఫెసర్ (శ్రీ) విస్సా అప్పారావుగారు పురప్రజల తరఫున "జ్యోతిష విద్యా భూషణ" బిరుదు ప్రదానం చేసారు.

పట్టాభిషేకసమయంలో రాజాధిరాజులకు గౌరవప్రదంగా సమర్పించు పూర్ణకుంభాన్ని ఆజ్యోతిషశాస్త్ర పారంగతునికి ఆహ్వాన సంఘంతరఫున శ్రీభావరాజు వెంకటకృష్ణారావుగారు సమర్పించారు. (శ్రీ) మద్దూరి శివరామకృష్ణయ్యగారు అభినందన సన్మానపత్రాన్ని, (శ్రీ) బులుసు పాపయ్యశాస్త్రిగారు దుశ్శాలువలు బహూకరించారు.

(శ్రీ) సూర్యనారాయణమూర్తిగారిని నాళంవారి సత్రంనుంచి ఆ సాయంకాలం మంగళవాయిద్యాలతో ఊరేగింపుగా విక్రమ హాలుకు తీసికొని వచ్చారు.

(శ్రీ) విస్సా అప్పారావుగారు తన అధ్యక్షోపన్యాసంలో వాడ్రేవు సూర్యనారాయణమూర్తిగారితో 25 సంవత్సరాలనుండి తనకున్న పరిచయాన్ని తెలియజేసి 25 సంవత్సరాలుగా ఆయనజ్యోతిశాస్త్ర పరిశోధనలో అమోఘమైన కృషిచేసి 'జాతక నారాయణ', 'ముహూర్త సింధు', 'షడ్వర్గబలం' అనే గ్రంథాలను రచించారని చెప్పారు.

కొంతకాలం క్రిందట విద్యాధికులైన మన భారతీయులే మన పూర్వశాస్త్రాలను అందులో ముఖ్యంగా జ్యోతిశాస్త్రాన్ని నిందిం

చుట పరిపాటైపోయిందని, కాని నేడు మన శాస్త్రిలలో విలువను నిజానిజాన్ని గుర్తించి తమ పూర్వవైఖరిని మార్చుకొన్నారని ఆయన అన్నారు. పుస్తకములద్వారా ఆర్జించిన పరిజ్ఞానమును అది యెంత ముఖ్యమైనదైనా జ్యోతిషములో చాలదనీ, రాబోవు విషయాలను ముందుగా సక్రమంగా సూచించుటకు అంతర్దృష్టి వుండాలని, అదే ఒక ప్రజ్ఞ అని అందులో ముఖ్యంగా స్వలాభాపేక్షయం కొరకు ఆశించకూడదని యీగుణగణాలు సూర్యనారాయణ మూర్తిగారియందు మూర్తీభవించి వున్నాయని అప్పారావుగారు పేర్కొన్నారు.

జ్యోతిశ్శాస్త్రంలో ఆరితేరిన దిట్టయని ప్రఖ్యాతిగాంచిన తన తండ్రిగారివద్ద సూర్యనారాయణమూర్తిగారు ఆ శాస్త్రములోని సూత్రాలను నేర్చుకొన్నారని, తరువాత ఆయనకృషివల్ల జ్యోతిశ్శాస్త్రానికి ఆయన చేయుచున్న సేవవల్ల యింత ప్రజ్ఞా దురంధరుడయ్యాడని ఆయన ప్రస్తుతించారు.

శ్రీ సూర్యనారాయణమూర్తిగారు జ్యోతిశ్శాస్త్రానికి చేసిన సేవను ప్రస్తుతిస్తూ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు తామురచించిన పద్యాలు చదివారు. సత్యవోలు శేషగిరిరావుగారుకూడా పద్యాలు చదివారు. శ్రీయుతులు వేమరాజు వెంకటేశ్వర్లు, నల్లాన్ చక్రవర్తుల రంగాచార్యులు సూర్యనారాయణమూర్తిగారి ప్రతిభను గూర్చి ప్రసంగించారు, తరువాత చేబ్రోలు నారాయణ, మన్యం వెంకటకృష్ణపాపారావుగార్లచే నొసంగబడిన శాలువలను, నూతన వస్త్రాలను బులుసు పాపయ్యశాస్త్రిగారిచే బహూకరింపబడినవి.

శ్రీ మద్దూరి శివరామ కృష్ణయ్యగారి వందనసమర్పణ తర్వాత సభ ముగిసింది.

— ఆంధ్రప్రభ

# జ్యోతిషశాస్త్రంలో పాండిత్యానికి ప్రశంసలు

రాజమండ్రి, జులై 8 : జ్యోతిశ్శాస్త్ర ప్రముఖులు శ్రీ వాడ్రేవు సూర్యనారాయణమూర్తికి నిన్న గొప్ప పౌర సన్మానం జరిగింది. శ్రీ విస్సా అప్పారావు అధ్యక్షత వహించారు.

శ్రీ సూర్యనారాయణమూర్తిని పురవీధులలో వూరేగించి సభా స్థలానికి తీసుకువచ్చారు. శ్రీబులుసు పాపయ్యశాస్త్రి వారికి పూర్ణ కుంభము నిచ్చి స్వాగత మిచ్చారు. శ్రీ భావరాజు వెంకటకృష్ణా రావు ప్రసంగిస్తూ శ్రీసూర్యనారాయణమూర్తి జ్యోతిశ్శాస్త్ర ప్రతిభను ప్రశంసించారు.

అధ్యక్షులు మాట్లాడుతూ యీశాస్త్రంలో తమకు మొదట్లో నమ్మకం లేదని తరువాత చర్చలఫలితంగాను, శ్రీసూర్యనారాయణ మూర్తి తమ విషయంలో చెప్పిన విశేషాలవల్లను నమ్మకం కలిగిందని చెప్పారు.

శ్రీ మద్దూరి శివరామకృష్ణయ్య సన్మానపత్రం చదివారు. సన్మాన సంఘం తరఫున సభాధ్యక్షులు శ్రీ సూర్యనారాయణమూర్తికి "జ్యోతిష విద్యాభూషణ" బిరుదు నిచ్చారు. శ్రీమన్యం వెంకట కృష్ణపాపారావు, శ్రీ చేబ్రోలు నారాయణ చెరియొక శాల్మీరు శాలువ నిచ్చి సత్కరించారు. శ్రీ సూర్యనారాయణమూర్తి రచించిన రెండు గ్రంథాల ప్రచురణకు సన్మానసంఘం నిశ్చయించిందని శ్రీ వెంకటకృష్ణారావు ప్రకటించారు.

శ్రీ బులుసు పాపయ్యశాస్త్రి సన్మానసంఘం తరఫున, శ్రీ చేబ్రోలు నారాయణ విడిగా శ్రీ మూర్తికి పట్టు ధోవతులిచ్చారు. వారి భార్యకు పట్టుచీరెలు ఇచ్చి సత్కరించారు. శ్రీ సత్యవోలు శేషగిరిరావు పద్యరత్నాలు చదివారు. శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి ఆశీర్వచన పద్యాలు చదివారు.

కుమారి అల్లు సత్యవతి ఫిడేలు వాయించింది.

— ఆంధ్రపత్రిక

## ASTROLOGER HONOURED

Rajahmundry, July 3 : Mr. Vadrevu Suryanarayanamurthy, a well-known astrologer was honoured at a function held in the Vikrama Hall last evening by a Citizens' Committee, headed by Mr. B. V. Krishna Rao, founder of the Andhra Historical Research Society.

Presiding on the occasion, Prof. Vissa Appa Rao said that for some time past it had been a fashion among educated Indians to decry our ancient sciences, particularly astrology. But to-day they had come to realise that, after all, there was something worthy and enduring in our Sastras. Continuing he said Mr. Suryanarayana Murthy had put in nearly 35 years patient research in our ancient texts on astrology and published monumental works like *Jataka Narayaneeyam, Muhurtha Sindhu and Shadvargabalam* etc. They embodied a synthetic understanding of Parasara, Jaimini, Sripathi and Varahamihira, coupled with practical application of the Sutras after a systematic comparison of lakhs of horoscopes.

Prof. Apparao said mere text-book knowledge in astrology, however important, was not enough for predicting accurately coming events. One should possess something of an inner vision and, what was more, one should not always hanker after pecuniary gain. Mr. Suryanarayanamurthy had these qualities in abundance, Prof. Apparao said.

Earlier, Mr. Suryanarayanamurthy was taken in a procession along the Main Road from the Nalam's Choultry to the Vikrama Hall, where he was presented with *Poorna Kumbham.* Mr. M. Sivaramakrishnayya presented an address to him on behalf of the Citizens' Committee. Sri Sripada Krishnamurty Sastri, Poet-Laureate of Andhra Pradesh, read poems in praise of Mr. Suryanarayanamurty's contribution to astrology.

Shawls and silk sarees were presented to Mr. and Mrs. Suryanarayanamurty.

Prof. Apparao conferred the title of "Jyotisha Vidyabhushan" on Mr. Suryanarayanamurty, with the approval of the people gathered on the occasion.

Mr. M. Sivaramakrishnayya proposed a vote of thanks. The function ended after a music performance. — The Hindu

Rajahmundry, July 12: Sri Vadrevu Suryanarayana murthi, well-known astrologer of Andhra, was honoured with the title of " Jyothisha Vidyabhushan " at a function held in the Vikrama hall on July 7 by a Citizens Committee headed by Dr. B. V. Krishna Rao, founder of the Andhra Historical Research Society. Prof. Vissa Apparao who presided said after 35 years of laborious research, Mr. Suryanarayanamurthi had published valuable works like " Jathaka Narayaneeyam ", " Muhurtha Sindhu " and " Shadvargabalam " Purnakumbham and an address on behalf of the Citizens' Committee were also presented to Mr. Suryanarayana murthy. Sri Sripada Krishnamurthy Sastry, Andhra Poet-laureate read poems in praise of Mr. Suryanarayanamurthi's contribution to astrology. Shawls and silk clothes were presented to the author by Messrs. M. V. K. Paparao, D. V. Ramana, and Mr. and Mrs. C. Narayana. — Indian Express

## ASTROLOGER HONOURED

Rajahmundry, July 8 : Mr. Vadrevu Suryanarayanamurthy, B. A., of the Posts and Telegraphs Department, who is a well-known astrologer, was honoured at a public meeting held in the Vikrama Hall under the presidentship of Professor Vissa Appa Rao Pantulu, retired Principal of the University College. Mr. B. V. Krishna Rao, M.A., B.L., Chairman of the Reception Committee announced that the committee had undertaken the printing of Mr. Murthy's works on astrology

'Jataka Narayaneeyam' and 'Yogavali Khandam'. Mr. Madduri Sivaramakrishnayya, Government Pleader, read and presented the reception committee's address and also read messages from Mr. R. V. Sitharama Rao, District Judge, Nellore, etc. Telugu Poet-Laureate. Mr. S. Krishnamurthy Sastry. blessed Mr. Murthy. Messrs. M. V. K. Papa Rao, C Narayana, and B. Papayya Sastry, presented Kashmir shawls, silk clothes, etc. Mr. Murthy was honoured by the confirmation of the title of 'Jyothisha Vidya Bhushan' by the President of the meeting at the request of the Reception Committee. Mr. Murthy thanked all for the honour done to him.

— Deccan Herald

## ASTROLOGER HONOURED

### Rajahmundry Function

Rajahmundry, 16 July : Mr. Vadrevu Suryanarayana Murthi, Astrologer was honoured by the public of Rajahmundry on Sunday at a public meeting held in Vikrama Hall. Prof. Vissa Apparao presided.

Those present included Mr. T. Muni Reddi, Superintendent of Post Offices, Mr. D. Viswanadha Reddi, Municipal Commissioner. Prof. Damerla Venkata Rao,. Mr. T. S. R. Narasimha Rao, Mr. A. V. Raghava Rao and Mr. Vadrevu Bapiraju.

Mr. Madduri Sivaramakrishniah, Government Pleader, presented an address to Mr. Suryanarayana Murthi and read the messages received. Kavi Sarvabhowma, Sripada Krishnamurthi Sastri, Andhra Poet-Laureate, pronounced the benediction. Messrs M. V. K. Papa Rao, C. Narayana and Bulusu Papayya Sastri presented Kashmir shawls and silk clothes to Mr. and Mrs. Suryanarayana Murthi.

The meeting conferred the title of "Jothisha Vidya Bhushan" on Mr Suryanarayana Murthi. Mr. Suryanarayana Murthi thanked the public for the honour done to him.

- The Mail

# పీఠిక

నేను యీ జ్యోతిష గ్రంథమును చాలకాలము క్రిందటనే అనగా సుమారు 7 సంవత్సరముల క్రిందట రచియించిన వాడనయ్యును గొన్ని గృహాభిప్రాయములచే నట్టు ప్రచురించుటకు వీలులేక శాస్త్ర ప్రచారమునకుం బ్రస్తుత స్థితిగతు లనుకూలముగ నుండుటచేతను, ఆంధ్ర దేశమున నన్నెఱిగినంతవరకు బెక్కండ్రు సిద్ధాంతులును, విద్యాధికులును, బ్రోత్సహించుటచే నిద్దానిని బ్రచురించి యీయాంధ్ర ప్రపంచమున జ్యోతిష శాస్త్రజ్ఞుల కరము నలంకరించు భాగ్యము లభించినది. ఇది తొలుదొలుత 1925 వ సంవత్సరమున ప్రారంభించినాను. గాని యప్పుడు వ్రాసినదానిలో సాంప్రదాయములు తక్కువగానుండుటచే తిరిగి 1928 వ సంవత్సరమున ప్రస్తుత రూపమున ననేకవందల సాంప్రదాయముల నిందు బొందుపరచితిని. ఈగ్రంథము కేవల మితర గ్రంథములవలెగాక యాంధ్రదేశము నందున్న యనేక వందల పురాతన తాటియాకుల గ్రంథములజూచి చెన్నపట్టణమున దాటియాకు పుస్తకముల భాండాగారమునందలి జ్యోతిష గ్రంథములను గొన్నిసంవత్సరము లామూలాగ్రముగం బరిశీలించి, సుమారు 14-15 సంవత్సరములుపైగా నేబది యిరువది వేల జాతకములుచూచి యేకారికలమీద జ్యోతిష శాస్త్రము వ్రాయబడినదో, యెట్లు గ్రహములకును, రాసులకును సంబంధము కలదో భావముల నెట్లు కల్పనజేసిరో, భావములందు గ్రహములకు స్థితివలన గలుగు బలాబలములును, అందువలన గలుగు ఫలములును, మొదలగు ననేక ఋషుల యభిప్రాయములు సాంప్రదాయయుక్తముగ సులభశైలి నిందు వ్రాసినాడను.

ఇదిగాక యీశాస్త్రమునకు సాంప్రదాయములు ముఖ్యములు. పూర్వము ఋషులు సాంప్రదాయములు ముఖాముఖిని శిష్యులకుఁ జెప్పి, తరువాత శాస్త్రమును బ్రారంభించిరి. మన దురదృష్టవశమున ఋషులతోఁ బాలు సాంప్రదాయములుగూడ నశించి శాస్త్రముమాత్రము మిగిలినది. ఈ సాంప్రదాయము లచ్చటచ్చట కొన్ని కుటుంబములలో మాత్రము మిగిలినవి. ఈ సాంప్రదాయములు దెలియక జ్యోతిషగ్రంథము లెన్ని జదివినను, శాస్త్రపరిజ్ఞానము కలుగదనుటకు సందేహము లేదు. ఈ కారణమువలన గొప్ప పాండిత్యము గల సిద్ధాంతులు నయితము నే యోగమునైనను శాస్త్రమున ఋషులు వ్రాసినప్పు డది యెందుకు వ్రాసిరో చెప్పలేకున్నారు! సరిగదా యెవరికి దోఁచినట్లువారు, అనుభవమునకు సరిపోవకపోయినను నపార్థముల జేయుచున్నారు.

ఇదిగాక జ్యోతిష శాస్త్ర మపారమగుటను, సంస్కృతాంధ్ర భాషలందు నింతవరకు బ్రచురించిన గ్రంథములంత ప్రాధాన్యములైనవి లేకపోవుటను సిద్ధాంతభాగమందు శ్రద్ధ, జ్యోతిషశాస్త్రము నందు బ్రస్తుతకాలమున మనవారు వహించకపోవుటను నీ శాస్త్రమునకుఁ గొంత ప్రోత్సాహముతగ్గి పరిపూర్ణయౌన్నత్యము కలుగలేదు. శాస్త్రమున మూఁడు మతములు గలవు. అవి యెవియనగా పరాశర్య, జైమిని, శ్రీపతిభట్టు మతములై యున్నవి. ఈ మూఁడు మతములను బూర్తిగా చదివినగాని యీ శాస్త్రముయొక్క గొప్పదనము తెలియదు. ఈశాస్త్రమునకు వృద్ధపరాశరి భిక్ష పెట్టినాఁడు. తరువాత నాయన పుత్రుఁడగు బాదరాయణుఁ డనేక సంగతులు, బాదరాయణ వచనములుగా జెప్పినాఁడు. ఇదిగాక పూర్వపారాశరిలో అనేక సంగతులు చెప్పినారు. తరువాత గౌతముఁడు, నారదుఁడు, భృగు, శౌనకుఁడు, భారద్వాజుఁడు మొదలగు ననేక ఋషు

లీమతమునసే సంహితలుగా వ్రాసిరి. తరువాత జైమినిమహర్షి బయలుదేరి పారాశర్యాది ఋషుల మతము నాధారముజేసికొని తన బుద్ధివిశేషము నుపయోగించి ప్రత్యేకముగ దనసాంప్రదాయములతో వేరుగ శాస్త్రమును వ్రాసినాఁడు. సంస్కృత గ్రంథములను శోధింపగ గొంత కాలమువరకు జైమినిమహర్షి పారాశర్యాది మతమును వంచనచేసి తన ప్రావీణ్యము జూపుటకు నీ శాస్త్రము వ్రాసినాఁడను దురభిప్రాయము ప్రబలి యుండినట్లు కనిపించుచున్నది. ఈ యభిప్రాయము పోగొట్టుటకు బృహస్పతి బయలువెడలి బార్హస్పత్య సంగ్రహము గ్రంథమును వ్రాసి, యందులో నీ రెండుమతములలోను భేదము లేదనియును ననుభవమునకు రెండును సరిగా సరిపోవుననియును, జైమిని మతమున గొన్ని విశేషాంశములు కలవనియును, జెప్పి యీ రెండుమతములను సంపుటిచేసి యీ దురభిప్రాయమును దొలగించినాఁడు.

వృద్ధపరాశర్యమున దొమ్మిది గ్రహములే వ్రాసి వాటిమీద ఫలితములను జెప్పినారు. గాని యీ మతములోనివాఁడే యగు గౌతముఁడు, గౌతమ సంహితయందు పరాశర్యములో జెప్పిన తొమ్మిది గ్రహములేకాక మరి మూఁడు గ్రహములు మాంది యనియును, గుళికుఁడనియును, ధూమ్రకుఁడనియును, వ్రాసి వాటి మీఁదగూడ ఫలితములను జెప్పినారు. ఏ కారణముచేతనో, జైమిని మొదలగు ఋషులును, తరువాతివారును, ధూమ్రకునిమాత్రము వదలి, తక్కిన పదకొండు గ్రహములమీదను ఫలితములను జెప్పిరి. తరువాత శ్రీపతి, సత్యాచార్య, వరాహమిహిరులు ఏడు గ్రహములనుమాత్రము తీసికొని ఛాయాగ్రహములను వదలివేసినారు. కాని వీరెందుచేతనో జైమినీ సాంప్రదాయముల నొక్కటైనను బృహజ్జాతకాది తమ గ్రంథములయందు సూచించి యుండలేదు. వీరు

అధ్యాయముల నేర్పరచుటలోగూడ పరాశర్యాది మతప్రకారము తన్వాది ద్వాదశభావములను గ్రమముగా జెప్పియుండలేదు. తరువాత బయలుదేఱిన కాళిదాసాదులు వారికాలమువరకును దేశమునందు బ్రఖ్యాతిగానున్న శ్రీపతి, వరహామిహిరాదుల మతము ననుసరించక తమ కేరళ ఉత్తరకాలామృతము మొదలగు గ్రంథముల యందు పరాశర్యాది ఋషుల మతమును దిరిగి యనుసరించినారు. కాళిదాసుకూడ మాందీ, గుళికులను దీసికొని ధూమ్రమకుని వదలి వేసినాడు. ఏ కారణముచేతనో ఈయనగూడ జైమినీ సాంప్రదాయముల నెత్తుకొనలేదు.

తరువాత ఫలరత్నమాల, జాతకరాజీయాది గ్రంథకర్త లనేకులు పరాశర్య, జైమినీ మతములను రెంటిని తమ గ్రంథముల యందు మిళితముజేసి వ్రాసినారు. వేములవాడ భీమకవి మాత్రము తన జ్యోతిషామృతసారమున బారాశర్యాది మతము ననుసరించియే జన్మలగ్న భాగములనుబట్టి ఫలములను వ్రాసినాడు. ఈ గ్రంథకర్త లెవ్వరును శ్రీపతి, వరాహామిహిరాదుల మత సాంప్రదాయముల నెచ్చటను వీరి గ్రంథములలో బేర్కొని యుండలేదు.

ఈ కారణమువలన నేను సుమారు 14, 15 వత్సరములుపైగా నహర్నిశములు ప్రయాసపడి పరాశర్యాది ఋషుల మతమునను, జైమినీమహర్షి మతమునను, శ్రీపతి వరాహామిహిర సత్యాచార్య, యవనాది యాచార్యుల మతమునను, వారివారి సంస్కృతాంధ్ర గ్రంథరాజముల నాంధ్ర తమిళ దేశంబులలో దొరికినంతవరకు సంపాదించి, ఉత్తర హిందూస్థానమున నింతవరకు బ్రచురమైన గ్రంథములనుసంపాదించి తాటియాకుల పుస్తకముల భాండాగారములోని బూర్వపు తాటియాకు గ్రంథములను విమర్శించి యనేక వేల జాతకములతో ననుభవమున సరిచూచి యీ మూడు మత

మతములయందలి లోపాలోపములు నిందు సంగ్రహముగ వివ
రించుకొనుచున్నాను.

ఈ మూడు మతములను జాగ్రత్తగా పరిశీలించి చూచిన
యెడల పరాశర్యము అగ్రగణ్యముగా గనుపించుచున్నది. ఆలో
చించి చూడగా ప్రతి జీవితమును ముఖ్యముగా రెండు భాగము
లుగా విడదీసినారు. అందు మొదటిది ఆయుర్దాయము, రెండవది
యోగము. ప్రతి జీవునకును ఆయుర్దాయము ముఖ్యము. అందు
వలన ప్రతి జాతకమునకు నిది యొక ప్రత్యేక భాగముగ ప్రిమత
ములవారును జెప్పుకొనినారు. ఇది యుండినగాని రెండవదగు యోగ
భాగము విని యోగము లేదు. అందువలననే లగ్నాధిపతికి పరాశర్య
మున నాయుస్థానాధిపత్యము ముఖ్యమయినదనిగ జెప్పినారు ఈ
లగ్నాధిపతికి ద్వాదశ భావాధిపత్యము కలిగియున్నను, ఆయుస్థా
నాధిపత్యము వీరికి ముఖ్యమైయినది. ఆయుస్థానాధిపత్యమునుబట్టిన
గ్రహమునకు సూర్యాద్యాధిపత్యము పట్టునవి వేరుగ జెప్పనక్కర
లేదు. అందువలననే శ్లో॥ అష్టమం ఆయుషస్థానం, అష్టమాద్వ్యష్ట
మం చతతు॥ అని చెప్పి, శ్లో॥ అష్టమం నిధనం రంధ్రం॥ అని చెప్పి
నారు. అనగా అష్టమాధిపతికి ఆయుస్థానాధిపత్యము నిచ్చినవాడే
'నిధనాయ' అనగా మరణముకొరకు నగుచున్నాడని చెప్పినారు.
ఈ మతమును జైమినీమహర్షి పూర్తిగా నొప్పుకొని యున్నాడు.
కారణమేమనగా సూ: ఆయుఃపితృదినేశాభ్యామ్॥ అని చెప్పినాడు.
దీని యర్థమేమనగా పితృశబ్దమునకు లగ్నమని యర్థము. అనగా
లగ్నాధిపతినిబట్టియును, కారకుడైన శనినిబట్టియును, ఆయుర్దా
యము నిర్ణయించినాడు. తరువాత అష్టమాధిపతిని బట్టికూడ చెప్పి
నాడు. దీని యర్థమేమనగా ఈ రెండు మతములయందునుకూడ
లగ్నాధిపతికి లేని భావాధిపత్యములు ద్వాదశభావములందును,

లేవనియును, ఈ యాధిపత్యములను పన్నెండు భావములుగా గల్పించి యొక్కొక్క భావమున కొక్కొక్కని నధిపతిగాఁ జేసి యాభావ సంబంధమయిన యాధిపత్యములకు వానిని యధిపతిగాఁ జేసినారు. ఇందువలన సాధారణముగా నాభావసంబంధమైన శుభా శుభములను వాఁడే స్వతంత్రముగా జేయుచుండును. ఇట్లే కార కుఁడును జేయును. కాని యే భావాధిపతిగాని, కారకుఁడుగాని, వారికి జెప్పబడిన శుభాశుభములను జేయలేనపుడు లగ్నాధిపతి యాపని జేయుచుండును. అందువలననే జాతకములో నొకప్పుడు లగ్నాధిపతి మారకము చేయును. ఒకప్పుడు సంతతినిచ్చును. ఒకప్పుడు కళత్రము నిచ్చును. అట్లే ద్వాదశభావాధిపత్యములను జేయుచుండును. ఈ లగ్నాధిపతికి దోషము పట్టినపుడు పయిన జెప్పిన ద్వాదశ భావములకును శుభములకు బదులు అశుభములను జేయును. ఈ సాంప్రదాయము మనసులోఁ బెట్టుకొని ఋషులును రెండు మతములయందును నేభావము చెప్పినను లగ్నాధిపతినిబట్టి యును, ఆభావాధిపతినిబట్టియును గలిసి చేర్చినారు. ఉదాహరణము: కుటుంబమునుగురించి చెప్పినపుడు లగ్న ధనాధిపతులను గలిపి చెప్పినారు. అట్లే భ్రాతృభావమునకు లగ్న తృతీయాధిపతులను బట్టి చెప్పినారు. అట్లే కళత్రభావమునకు లగ్న సప్తమాధిపతులను బట్టి చెప్పినారు.

ఇంతవరకును, పరాశర్యమునకును, నితర మతములకును భేద ములేదు. గాని ఆయుష్కారకత్వము నిరూపించుటలో మాత్రము పరాశర్యమతమును జైమినీ మహర్షియును వరాహ మిహిరాదు లనుగూడ యొప్పుకొనలేదు. పరాశర్య మతస్థులగు ఋషులంద రును శని నాయుష్కారకుఁడుగా జెప్పినారు. జైమినీమహర్షి యీ యభిప్రాయము నంగీకరింపక రవికి యాయుష్కారకత్వము నిరూ

పించెను, వరాహమిహిరాదులు, ఉచ్ఛ నీచలనుబట్టియును, వక్ర, ఋజు, అతిచారగతులనుబట్టియును, దివ్యాది సప్తగ్రహములకును, కారకత్వము నిరూపించినారు. అనుభవమునుబట్టిచూడగా జైమిని మత ప్రకారము ఆయుష్కారకత్వము రవి కిచ్చుటయే సమంజస ముగానున్నది. ఈ రవి భాగ్య, లాభములయందున్నను, లగ్నాష్ట మాధిపతియైనను, తులా, వృశ్చిక లగ్నములకు రాజ్యలాభాధిపతి యగును. గనుక రాజ్యమందున్నను, లాభమందున్నను, మంచి దీర్ఘాయుర్దాయము నిచ్చుచున్నాడు. కాని జైమిని చరస్థిరద్విభావ రాసులయందున్న ఆయుస్థానాధిప కారకులనుబట్టి యల్ప మధ్య పూర్ణాయువులను జెప్పినారు. ఇది యనుభవములో గొన్ని వందల జాతకములను సరిచూడగా పూర్ణాయుర్దాయములుగలిగి మృతి బొందిన వారికి నల్పాయుర్దాయములు ఈ మతప్రకారము గనుపించుచున్నవి. జైమినీమహర్షి సహితము తాను వ్రాసిన యా యుర్భావసంబంధమయిన సూత్రములయొక్క యుపయోగమును సందేహించినట్లు గనుపించుచున్నది. దీనికి ప్రామాణ్య మేమనగా సూ : సంవాదాత్ప్రామాణ్యం॥ అని చెప్పికొనియున్నాడు. ఈ కారణమువలన నీ గ్రంథమున జైమినీ యాయుర్భాగమును నేను వదలివేసి యోగభాగమునుమాత్రమే వ్రాసినాను.

—♦ యోగ భాగము ♦—

2. ఈ భాగమున జాతకుని శుభాశుభములే గాక జాతకుని పూర్వాపరములు చెప్పబడినవి. ఈ భాగముక్రింద ఆయుర్దాయము తప్ప తక్కిన భావములన్నియును వచ్చును. ఈ విషయమై పరా శర్యమున ననేక సంగతులు చెప్పబడినవి. ఈ భాగమున జాతకుని యొక్క రాజయోగమును, తద్భంగములును, జెప్పి, తరువాత సంసారమూలమయిన కళత్రమునుజెప్పి, యటుపైని పూర్వాపర

ములను జెప్పినాను. ఈ విషయమై మూఁడు మతములవారును వేఱు వే రభిప్రాయములను గలిగియున్నారు. పరాశర్యమున జన్మ లగ్నము మొదలు ద్వాదశ భావములను వరుసను జెప్పికొనియున్నారు. ఈ మతమున నొక లగ్నాధిపతికిదప్ప యితర భావములకు సమానమయిన ప్రాధిక్యత నిచ్చినారు. అందువలన నధ్యాయము లనుగూడ భావములవలెనే జెప్పికొని యున్నారు. జైమిని మహర్షి యోగావళి ఘట్టములను వేరుగాను, ఆయుర్దాయఘట్టములను వేరుగాను, జెప్పినాడు. వరాహమిహిరాదులును నీ సాంప్రదాయమునే యనుసరించిరి. వరాహమిహిరుఁడు బృహజ్జాతకమున జన్మకాల లక్షణాధ్యాయమైన తర్వాత బాలారిష్ట ఆయుర్దాయాధ్యాయము లను వ్రాసి, యాయుర్దాయభాగమును ముగించి తరువాత ప్రత్యేక ముగ యోగభాగమును ప్రారంభించి కర్మజీవాధ్యాయము, రాజ యోగాధ్యాయము మొదలగు నధ్యాయములను నీ భాగమున వ్రాసెను. ఇందులో నీతఁడు జాతకుని పూర్వాపరముల నవగా మాతృ, పితృ, భ్రాతృ, కళత్ర, పుత్రభావములను ప్రత్యేకముగ వ్రాయలేదు. కాని జైమినీమహర్షి మాత్రము కారకాంశలగ్న మును నారూఢలగ్నమునుబట్టి మాతృ, పితృ, భ్రాతృభావములను ఉపపదములనుబట్టి కళత్రపుత్రభావములను ప్రత్యేకముగ జెప్పికొని యున్నాడు. వరాహ మిహిరుఁడు నష్టమమునుబట్టి నైరాణికాధ్యాయమును ప్రత్యేకముగ జెప్పికొనియున్నాఁడు. కాని పరాశర్యాది ఋషులును, జైమినీ మహర్షియును దమమతములయందు ద్వాదశ మును మోక్షస్థానముగ నేర్పరచుకొని దానినిబట్టి మరణము నిర్ణ యించినారు. ఈ మతములను శోధింపఁగ బరాశర్య జైమినీ మత ముల నతిక్రమించి వరాహమిహిరుఁడు ప్రత్యేకముగ నష్టమమును బట్టి నైరాణికాధ్యాయము వ్రాయుటలో నొక ముఖ్యాభిప్రాయ మున్నటుల గాన్పించుచున్నది. అది యేమియనఁ బారాశర్యము

ఓం

# శ్రీ జాతక నారాయణీయము

## ప్రథమ ఖండము

## సంజ్ఞాధ్యాయము

ముందు నక్షత్రములను దెలుసుకొనవలెను. అవి యిరువ

1. అశ్వని, 2. భరణి, 3. కృత్తిక, 4. రోహిణి, 5. మృగ
6. ఆర్ద్ర, 7. పునర్వసు, 8. పుష్యమి, 9. ఆశ్లేష, 10.
11. పుబ్బ, 12. ఉత్తర, 13. హస్త, 14. చిత్త, 15. స
16. విశాఖ, 17. అనూరాధ, 18. జ్యేష్ట, 19. మ
20. పూర్వాషాఢ, 21. ఉత్తరాషాఢ. 22. శ్రవణం, 23. ధ
24. శతభిషం, 25. పూర్వాభాద్ర, 26. ఉత్తరాభాద్ర, 27.

ప్రతి నక్షత్రమునకు నాలుగు పాదములు. మొత్తము
పాదములు.

### రాసులు పండ్రెండు

1. మేషము, 2. వృషభము, 3. మిధునము, 4. కర్కాట
5. సింహము, 6. కన్య, 7. తుల, 8. వృశ్చికము, 9. ధ
10. మకరము, 11. కుంభము, 12. మీనము.

అశ్విని, భరణి, కృత్తికలో నొక పాదము, వెరశి ౯ పాదములు మేషరాశి; కృత్తిక 3 పాదములు, రోహిణి, మృగశిర ౨ పాదములు, వృషభము; మృగశిర ౨ పాదములు ఆర్ద్ర, పునర్వసు 3 పాదములు మిధునము; పునర్వసు ౧ పాదము, పుష్యమి, ఆశ్లేష, కర్కాటకము; మఖ, పుబ్బ, ఉత్తర ౧ పాదము సింహము; ఉత్తర 3 పాదములు, హస్త, చిత్త ౨ పాదములు కన్య; చిత్త ౨ పాదములు, స్వాతి, విశాఖ 3 పాదములు తుల; విశాఖ ౧ పాదము, అనూరాధ, జ్యేష్ట వృశ్చికము: మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ ౧ పాదము ధనస్సు; ఉత్తరాషాఢ 3 పాదములు, శ్రవణం, ధనిష్ట ౨ పాదములు మకరం; ధనిష్ట ౨ పాదములు, శతభిషము, పూర్వాభాద్ర 3 పాదములు కుంభము; పూర్వాభాద్ర ౧ పాదము, ఉత్తరాభాద్ర, రేవతి మీనము.

### రాసుల పరిమాణములు

| రాసులు | పరిమాణములు (ఘడియలు విఘడియలు) | రాసులు | పరిమాణములు (ఘడియలు విఘడియలు) |
|---|---|---|---|
| 1. మేషము | 4—20 | 7. తుల | 5—24 |
| 2. వృషభము | 4—56 | 8. వృశ్చికము | 5—33 |
| 3. మిధునము | 5—26 | 9. ధనస్సు | 5—19 |
| 4. కర్కాటకము | 5—31 | 10. మకరము | 4—43 |
| 5. సింహము | 5—20 | 11. కుంభము | 4—11 |
| 6. కన్య | 5—15 | 12. మీనము | 4— 2 |

సూర్యుడున్న రాశి సూర్యోదయరాశి, దాని కేడవరాశి సూర్యాస్తమయ రాశి. ఇది యే గోధూళిక రాశి. సూర్యుడు ప్రతిరాశి యందును నొక్కొక్క నెలవంతున నొక సంవత్సరములో పండ్రెండు రాసులు సంచరించును. ఆ రాశి ప్రవేశమునకే సంక్రమణమని పేరు.

౨

## గ్రహములు తొమ్మిది

1. రవి, 2. చంద్ర, 3. కుజ, 4. బుధ, 5. గురు, 6. శుక్ర, 7. శని, 8. రాహువు, 9. కేతువులు.

గ్రహములు పన్నెండు రాసులయందును దిరుగుచుందును.

రవి ఒక మాసము, చంద్రుడు రెండున్నర దినములు. అంగారకుడు (కుజుడు) ఒకటిన్నర మాసములు. బుధుడును, శుక్రుడును రమారమి ఒక మాసము, గురుడు ఒక సంవత్సరము, శని రెండు సంవత్సరములన్నర, రాహువు, కేతువు, పదునెనిమిది మాసములు. ఈ గ్రహములు ప్రతిరాశియందును పైనుదహరించిన కాలముల ప్రకార ముందురు. చంద్రుడు నెలనెలకు పన్నెండు రాసులు తిరిగి వచ్చును.

ఇట్లు తిరుగుటలో రవి చంద్రులిద్దరు మాసమున కొకమారు ఏకరాశి గతులగుచుందురు. అప్పుడే యమావాస్య యేరుపడును.

కుజ, బుధ, శుక్ర, శనులకు గమన మొకప్పుడు వేగముగాను, ఒకప్పుడు మందముగా నుండును. మందమునకు వక్రగతియనియు వేగమున కతిచారమనియు పేళ్ళు. కుజునకు మాత్రము ఒకరాశి యందారు మాసములు ఎనిమిది మాసములుగూడ విడువక యుండును. దీనికే కుజస్తంభన యని పేరు.

రాహుకేతువు లెల్లప్పుడొండొరులకు సప్తమ మందుందురు. వీరు గమన మపసవ్యముగా నడుచుచుందురు. అనగా మేషమునుండి మీనమునకు, మీనమునుండి కుంభమునకును,

## మాంది

ఈ తొమ్మిది గ్రహములు గాక మరి మూడు గ్రహములు జెప్పబడినవి. అవి యేవియనగా 1. మాంది. 2. గుళికుడు, 3. ధూమ్రకుడు, ప్రస్తుతము ధూమ్రకునిగురించి మనవారుబూర్తిగా వదలివేసినారు. దాక్షిణాత్యులును, మహారాష్ట్రులును, మాందీ గ్రహమును ముఖ్యముగ జూచుకొనుచున్నారు. ఉత్తరహిందూ స్థానమున, గుళికుని, ముఖ్యముగ జూచుకొనుచున్నారు. తెలుగు దేశమున మాందీ గుళికుల నిద్దరినిగూడ బూర్వము ముఖ్యముగ జూచుకొనుచుండెడివారు. కాబట్టి యిచ్చట మాందీ గుళికులనిద్దరిని యెట్లు చూచుకొనవలెనో వివరించుచున్నాను.

మాందీ గ్రహము ఆదివారమునాడు సూర్యోదయాది 26 గడియలమీద నుండును. అనగా సూర్యోదయము మొదలుకొని 26 వ గడియ ఏరాశియగునో యారాశియందు మాందీ గ్రహమును రాశి చక్రములో వేసికొనవలెను. ఈ ప్రకారముగానె :

### గడియలు

| | | | |
|---|---|---|---|
| సోమవారము | 22 | గురువారము | 10 |
| మంగళవారము | 18 | శుక్రవారము | 6 |
| బుధవారము | 14 | శనివారము | 2 |

ఇది పగటి ప్రమాణము ముప్పది గడియలైనపుడు పై ప్రకారము జూచుకొనవలెను. దిన ప్రమాణము 30 కంటె హెచ్చినపుడు పై గడియలు 7 చే భాగించి యెన్ని విఘడియలు వచ్చునో చూచుకొని యా గడియలు ఒక్కొక్క వారమునకు గలుపుకొనవలెను. ఉదా॥ దిన ప్రమాణము 32 గడియ లనుకొందము,

# సంజ్ఞాధ్యాయము

గురునకు :— బుధ, శుక్రులు, శత్రువులు. శని సముడు. తక్కిన యిరువురు మిత్రులు.

శుక్రునకు :— బుధ, శనులు మిత్రులు. కుజ, గురులు సములు. రవి, చంద్రులు శత్రువులు

శనికి :— శుక్ర, బుధులు మిత్రులు. రవి, చంద్ర కుజులు శత్రువులు గురుడు, సముడు.

## రాసులకు చరస్థిర ద్విస్వభావములు

| రాసులు | | రాసులు | |
|---|---|---|---|
| మేషము, కర్కాటకము, తుల, మకరము | చర రాసులు | వృషభము, సింహము, వృశ్చికము, కుంభము | స్థిర రాసులు |
| మిథునము, కన్య, ధనస్సు, మీనము | ద్విస్వభావ రాసులు | | |

## గ్రహముల దిక్బలము

బుధ, గురులు లగ్నమందున్నపుడు తూర్పు దిక్కునకు బలవంతులు.

రవి, కుజులు, దశమమందున్న దక్షిణదిక్కునకు బలవంతులు.

శని. సప్తమమందున్న పడమరదిక్కునకు బలవంతుడు.

శుక్ర, చంద్రులు, చతుర్థమందున్న నుత్తరమునకు బలవంతులు.

ఈ గ్రహములు ఆస్థానములందుండి సప్తమస్థానములకు పోవునప్పటికి క్రమముగా బలహీనులై సప్తమములందు చాలెప్పిన దిక్కు

లకు బూర్తిగా బలహీనులగుదురు. ఉదా॥ గురుబుధులు లగ్నము కంటె ద్వితీయమందు, అంతకంటె తృతీయమందు బలహీనులై తుదకు సప్తమమున నున్నయెడల దూర్పుదిక్కునకు బూర్తిగ బలహీనులై పోదురు.

గ్రహములకు దిక్బలము జాతకములందును. ప్రశ్నలందునుగూడ నుపయోగించును. జాతకములందు యానవివాహాదులలో భావాధిపతి, దశానాథు డేదిక్కునకు బలవంతుడో యాదిక్కునకు ప్రయాణ మాదిక్కు సంబంధము గలుగును.

## గ్రహముల స్వరూపములు

సూర్యుడు :- తేనెవలె పింగళవర్ణముగల కన్నులుగలవాడును జతురస్రాకారమైన ప్రసారిత భుజద్వయప్రమాణ సమాచ్ఛాదమైన శరీరము గలవాడు. స్వల్ప కేశములుగలవాడు. పిత్తాధికము గలవాడును.

చంద్రుడు :-చిక్కిన గుండ్రమైనట్టియు, పెల్లనైనట్టియు, నున్నతమైనట్టి శరీరము గలవాడు, మంచి నేత్రదృష్టి మంచిమేధాశక్తి, వాతశ్లేష్మముల తత్వము, తియ్యనిమాటలు చెప్పువాడు.

కుజుడు :- నిత్యయౌవనము, రక్త గౌరవర్ణము, మిక్కిలి యీవి గలవాడు, అధికార మందాసక్తి, సన్నని నడుము, చపల చిత్తము, పైత్యతత్వము గలవాడు.

బుధుడు :- మాటలయందు వణకు, హాస్యములాడుట, ఇతరుల నాక్షేపించుట, గరికపోచలవంటి వర్ణము, వాతపిత్తశ్లేష్మములు సమానముగా గలవాడు.

## సంజ్ఞాధ్యాయము.

మతమేమనగా లగ్నము చరరాశియైనపుడు లగ్న. పంచమ, నవమాధిపతులు వరుసగా [illegible], [illegible], [illegible] ద్రేక్కాణము లకు నధిపతులు.

స్థిరరాశియైనపుడు నవమ, లగ్న పంచమాధిపతులు.

ద్విస్వభావరాశియైనపుడు పంచమ, నవమ లగ్నాధిపతులు.

ఈ రెండవమతమే వాడుకలోనున్నది.

## హోరాలగ్నము కట్టువిధము

లగ్నప్రమాణమును రెండుభాగములుచేసి జన్మకాల గడియ లే భాగమునందున్నవో జూడవలెను. జన్మలగ్నము బేసిరాశియై జన్మకాలగడియలు మొదటిభాగములో బడినయెడల నాభాగము సూర్యహోరయగును. రెండవభాగములో పడిన నది చంద్రహోర యగును. జన్మలగ్నము సమరాశియై జన్మకాల గడియలు మొదటి భాగములో బడిన నది చంద్రహోరయు రెండవ భాగములో బడినది సూర్యహోరయు నగును.

## ఇందు లగ్నమును కట్టు విధము

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూర్యునకు | కళలు | 30 | గురునకు | కళలు | 10 |
| చంద్రునకు | ,, | 16 | శుక్రునకు | ,, | 12 |
| కుజునకు | ,, | 6 | శనికి | ,, | 1 |
| బుధునకు | ,, | 8 | | | |

లగ్నము మొదలు తొమ్మిదవయింటి యధిపతియొక్క కళలను గనుగొని చంద్రుడున్న రాశి మొదలు తొమ్మిదవయింటి యధిపతి యొక్క కళలుకూడ తెలిసికొని యీ రెండు మొత్తము చేసి వచ్చిన మొత్తమును పన్నెండుచేత భాగింపగా వచ్చిన శేష మెంతయుండునో చంద్రుడున్న రాశి మొదలన్నవయిల్లు ఇందు

లగ్నమగును. చంద్రుడు లగ్నమందున్నప్పుడు భాగ్యాధిపతి కళలు ఒక్కమారు మాత్రమే లెక్కచూడవలెను. దీని యుపయోగము ధనయోగములను దెలిసికొనుటకు బనికివచ్చును. ఇందు లగ్నము నందుచ్చ గ్రహముండుట మంచిది. ఆ గ్రహము నైసర్గిక శుభుడైనను నైసర్గిక పాపుడైనను సరియే. (2) నైసర్గిక పాపులతో గలియని నైసర్గిక శుభులు ఇందు లగ్నమందున్నయెడల మంచి ధనయోగము. ఈనైసర్గిక శుభులు ధనలాభాధిపతు లగుట మరింత మంచిది. పంచమభాగ్య రాజ్యాధిపతులగుటయు మంచిదే. (3) నైసర్గికపాపు లాధిపత్యముచేత పాపులుగాక ధనలాభాధిపత్యము గలిగికాని, పంచమభాగ్య రాజ్యాధిపత్యములు గలిగికాని యిందు లగ్నమందున్నయెడల ధనయోగము (4) నైసర్గిక పాపునకిందు లగ్నము స్వక్షేత్రమై యందున్నయెడల గొంతవరకు ధనయోగము. ఈయోగమునకు లాభాధిపతి పాపుడుగా నెంచగూడదు.

## దశానిరూపణము

గ్రహములవరుస :— సూర్యుడు, చంద్రుడు, అంగారకుడు, రాహువు, గురుడు, శని, బుధుడు, కేతువు, శుక్రుడు, ఈ వరుసగా గ్రహదశలు వచ్చును. జన్మనక్షత్రమునుబట్టి జననకాలదశ యేర్పడును.

| | | | | |
|---|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | రవిదశ | 6సం॥రములు. |
| రోహిణి | హస్త | శ్రవణము | చంద్రదశ | 10 సం॥ |
| మృగశీర్ష | చిత్త | ధనిష్ఠ | కుజదశ | 7 సం॥ |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషము | రాహుదశ | 18 సం॥ |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురుదశ | 16 సం॥ |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | శనిదశ | 19 సం॥ |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి | బుధదశ | 17 సం॥ |

# శ్రీ జాతక నారాయణీయము

## ప్రథమ ఖండము

## గ్రహబలాధ్యాయము

1. గురు, శుక్ర, పూర్ణచంద్రులు నైసర్గిక శుభులు, ప్రతి జాతకమునకు నీ మూడుగ్రహములును స్వభావముచేతను శుభ గ్రహములుగా నెంచవలెను. పూర్ణచంద్రుడనగా, శుద్ధవిదియ మొదలుకొని శుద్ధ పంచమివరకు బాలగ్రహము. శుద్ధ పంచమి మొదలు శుద్ధ దశమివరకు మధ్యమబలము గలవాడు. శుద్ధఏకాదశి మొదలు బహుళ పంచమివరకు పూర్ణచంద్రుడు. బహుళ షష్ఠి మొదలు ఏకాదశివరకు వృద్ధగ్రహము. బహుళ ద్వాదశి మొదలు చతుర్దశివరకు క్షీణుడు. అమావాస్య, ప్రతిపత్తులు అస్తంగతుడు. శుద్ధ పంచమి మొదలు బహుళ ఏకాదశివరకు చంద్రుని నైసర్గిక శుభునిగా భావింపవచ్చును. తక్కిన తిథులలో నైసర్గికపాపుడుగా నెంచవలెను.

నైసర్గికపాపులతో గలసిన బుధుడు అశుభుడు. గురుశుక్రులును ముందు వివరించిన ప్రకారము నైసర్గికశుభుడైన చంద్రుడును గలసినప్పుడు బుధుడు నైసర్గిక శుభుడు. బుధు డేగ్రహముతోను గలియక యుండినను నైసర్గికశుభుడే.

2. రవి, కుజ, శని, రాహువు, కేతువులు నైసర్గికపాపులు. వీరు స్వభావముచేతనే పాపఫలము నిచ్చెదరు. నైసర్గిక శుభుల

జాతకుని ప్రవర్తన లగ్నమునుబట్టి కొందరు నిరూపించెదరు, అదియును సమంజసముగాదు. లగ్న చతుర్థాధిపతుల నిద్దరిలో ముఖ్యముగ చతుర్థాధిపతిని బరిశీలించి ప్రవర్తన నిరూపించవలెను. అనుభవమున కీపద్ధతి సరియైనదని తేలుచున్నది.

ఇవిగాక సింహాసన గారకత్వములుగలవు.

శరీరతత్వము, ఔదార్యము, జీవనోపాధి, జ్ఞానము, నిద్ర, స్వభావము, మానము, కీర్తి.

ద్వితీయము:- ధనము, వాక్కు, కుటుంబము, నేత్రము, విద్య, భార్య, భోజనములందిష్టము, ఇతరులకు సహాయము చేయుట, కృత్రిమము, అసత్యము, జిహ్వ, ఆగ్రహము, కోపము, దాతృత్వము, మృదువచనము, సోమకత్వము, ముద్రితమైనవి.

తృతీయము :- భ్రాతృ, సాహసము, చెవులు, చిత్తభ్రమ, దాసదాస్యాదివర్గము, యాత్ర, స్వధర్మము, శక్తి, అహంభావము, కోపము, ఉపాయము, పౌరుషము.

చతుర్థము :- మాతృ, విద్య, గృహము, అభ్యంగనము, బంధుసౌఖ్యము, కృషి, క్షేత్రము, ఆరామము, తటాకము, కూపము, పీఠ ప్రతిష్ఠ, శీలము, సౌధము, శాస్త్రము, గోగణసంపద, వాహనము, వివాదము Litigation

పంచమము :-పుత్ర, ప్రజ్ఞ, మంత్రములు, మనస్సు, వివేకము, పితృ, విత్తము, స్త్రీధనము, అన్నప్రదానము, కావ్యరచన, మారచింత, గాంభీర్యము, ~~సామర్థ్యము~~, మృదువచనత్వము, స్నేహము, సాహసస్యము, క్రయవిక్రయములు, విఘ్న

షష్ఠము :-శత్రు, జ్ఞాతి, శస్త్రము, శాస్త్రపరిశోధన, తంత్రము, ఉగ్రకర్మ, మాత్సరములు.

రిపుసంతోషము, చిత్తక్లేశము, ఉన్మాదము, చోర, విపత్తు, కారాగృహము, సహోదరాది కలహము, రహస్యస్థలములలో, వ్యాధి, అతిశూలము, మూత్రవ్యాధి, మధుమూత్రము.

సప్తమము :-వివాహము, కళత్రము, భోగము, శృంగారము, అలంకారము, వాణిజ్యము, విజయస్థానము, గానవృత్యవిద్యలం దభిరుచి, దానము.

అష్టమము :-ఆయుష్యము, సౌఖ్యము, పరాభవము, మృతధనము, కలహము, ప్రతిబంధకము, విపత్తు, మేహము, భ్రాతృశత్రువులు, కళత్రపీడ, రాజదండన, ఋణము, ద్రవ్యక్షయము జీవవధ, శిరచ్ఛేదము, అకస్మాన్మరణము ఉగ్రదుఃఖము, కళత్రనష్టము, కష్టజీవనము.

నవమము :-పితృ, దాన, ధర్మ, తీర్థయాత్ర, పితృభక్తి, తపస్సు, ఉపాసన, దేవభక్తి, ఐశ్వర్యము, తురగాదివాహనము, పట్టాభిషేకము, వైదికము, బ్రహ్మజ్ఞానము, కర్షకము, మేనమామలు, మేనత్తలు.

దశమము :-కర్మ, వ్యాపారము, వీర్యము, ఆజ్ఞ, రాజకార్యము, మానము, జీవనోపాధి, వాణిజ్యము, కీర్తి, నిధి, నిక్షేపము, ప్రవర్తన (Character)

ఏకాదశమము :-లాభము, ఆయువు, దురాశ, జ్యేష్ఠభ్రాతు, ఉపాసన, ధనార్జన, ఆభరణప్రీతి, కళలయందిష్టము, వ్యవహారజ్ఞానము.

ద్వాదశి, కుజ, శని, రాహువు, వీరు స్వభావము చేతనే పాపఫలము నిచ్చె శత్రుభయము, మనోవ్యధ, దైన్యము నష్టము, క్షుద్రదేవతోపాసన,

4

## గ్రహకారకత్వములు

రవి :–ఆత్మ, శక్తి, ఉష్ణము, ప్రభావము, శైవోపాసన, ధైర్య్య రాజాశ్రయము, పశువులు, పిత, రుచి, జ్ఞానోదయము, ఉత్సాహము, సంచారము, వ్యవహారము, అలంకారప్రీతి, శిరోవ్యాధి, దీర్ఘకోపము, రక్తవ్యాధులు, శిరోరోగములు.

పగలు జనించినవానికి సూర్యుడు పితృకారకుడు. రాత్రిజనించిన వానికి శని పితృకారకుడు.

చంద్రుడు :–మనస్సు, బుద్ధి, మాత, ప్రసాదము, సౌఖ్యము, గానకళా విద్యలందు ప్రీతి, జలగండము, గి భక్తి, పరిహాసము, లావణ్యము, భోజనసౌఖ్యము, ఉష్ణాన్న ప్రీతి, రాజలాంఛనములు, రాజలక్షణము, పిచ్చి, ఉన్మాదము, మనోవ్యాధి.

పగలు జనించినవానికి శుక్రుడును. రాత్రి జనించినవానికి చంద్రుడును మాతృకారకులు.

కుజుడు :–అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, భూమి, భృత్యులు, పరాక్రమము, ఉదారబుద్ధి, ఆరామవాసప్రీతి, మూర్ఖత, కోపము, విదేశయానము, రాజసేవ, సుబ్రహ్మణ్యప్రీతి, పరదూషణ, శత్రుజయాభిలాష, గ్రామాధినాధప్రీతి, సేనాధిపత్యము, చిత్తచాంచల్యము, కలహ, మశూచికము, క్రిమిసంబంధముగల రోగములు, కుసుమవ్యాధులు, అతివేడిసంబంధమగు వ్యాధులు.

బుధుడు :–ప్రజ్ఞ, విజ్ఞానము, కర్మ, విద్య, గణితము, జ్యోతిషము, శిల్పము, తీర్థయాత్ర, వాణిజ్యము, మృదువచనము, మాతామహులు, హాస్యము, క్రయవిక్రయములు, విష్ణూపాసన, వ్యాకరణశాస్త్రము, శాస్త్రపరిశోధన, తంత్రము, స్ఫోటక సన్నిపాత జ్వరములు.

గురుడు :-బుద్ధి, దేహపుష్టి, పుత్రులు, ధనము, భూమి, సుకర్మ వాహనము, నిక్షేపము, మీమాంసశాస్త్రము, జ్యోతిషము, పౌత్రులు, మహిమము, అశ్వము, వేదాంతప్రీతి, పెద్దలపేరు, శాశ్వతమగు పనులుచేయుట, రాజసన్మానము, గృహము, యజ్ఞాదిక్రతువులు, శైవోపాసన, పితృభక్తి, గురుభక్తి, మంత్రోపాసన, దేవాలయప్రతిష్ఠ, దేవలోకప్రాప్తి, పరోపకారము, సన్నిపాత జ్వరములు, దంతవ్యాధులు.

శుక్రుడు :-కళత్రము, వివాహము, భాగ్యము, భోగము, నేత్రము, సత్యవాక్కు, వాహనము, ఛత్రచామరములు, కీర్తి, గర్వము, క్రయవిక్రయము, సౌందర్యము; గీతము, కళత్రసౌఖ్యము హాస్యము, భృత్యులు, గాంభీర్యము, రాజ్యము, సౌకుమార్యము, వీణ, స్వల్పాహారము, భూషణధారణము, కళానైపుణ్యము, నాటకాలంకారము, కవిత్వము, ఆంధ్రభాషకు ప్రబంధరచన, లక్ష్మీభక్తి, గోభక్తి, రాజకీయము, భరతశాస్త్రము, చాతుర్యము.

ఆయువ్యము, మరణము, జాడ్యము, చర్మము, ఏనుగులు, గుఱ్ఱములు, విరోధము, సభాజడత్వము, దుఃఖము, దానము, ఔదార్యము, సుకర్మము, గురుధిక్కారము, ప్రసిద్ధ జీవితము, క్రౌర్యము, కులవిద్యా సంగ్రహము, కృషిజీవనము, తామసము, భీతి, దీర్ఘవిచారము, కఠినచిత్తము, అజీర్ణము. శూలనొప్పులు, పక్షవాతము, కీళ్ళనొప్పులు, Infantile paralysis, Blood pressure, Intestinal T. B. nervous debility, Spermatorreah, Gastric troubles.

రాహువు :-పుత్రులు, మాతామహులు, తీర్థయాత్ర, నేత్రహాని, భ్రాతృనాశనము, తీక్ష్ణవాక్కు, అడవులలో సంచరించుట.

ప్రతాపము, మ్లేచ్ఛోపాసన, వైద్యవిద్య, గ్రహపీడ, తటాకము, ఆరామములు, శాలనిర్మాణము, క్షుద్రదేవతోపాసన.

కేతువు :-పితామహులు, మోక్షము, గంగాస్నానము, బహుదానము, మంత్రశాస్త్రము, బ్రహ్మవిద్య, వ్రణములు, స్ఫోటకాదులు, శత్రుపీడ, చపలత్వము, మితభాషిత్వము, మౌనవ్రతము, మోక్షము.

## గ్రహములవస్థలు

ప్రతిగ్రహమునకు :—ఉచ్చ — దీప్తావస్థ
స్వక్షేత్రము — స్వస్థావస్థ
అధిమిత్రస్థానము — ముదితావస్థ
మిత్రగృహము — శాంతావస్థ
సమగృహము — హీనావస్థ
శత్రుగృహము — దుఃఖావస్థ
పాపులతో గూడినపుడు — వికలావస్థ
యుద్ధపరాజితగ్రహము — ఖలావస్థ
సూర్యునితో గలసినపుడు — కోపావస్థ

గ్రహములకు :-దీప్తావస్థ, స్వస్థావస్థ, ముదితావస్థ, శాంతావస్థ ఇవి శుభమును జేయును. హీనావస్థ, కేవలమశుభముగాదు తక్కినయవస్థ లశుభమును జేయును. సమయముల చేష్టలు, విశేష ముఖ్యములు గావని యెంచి వాని వివరించ లేదు.

గ్రహములు సూర్యునితో గలసిన నస్తంగతము.

చంద్రునితో గలసిన, సమాగమము, అనగా బలవృద్ధి.

కుజునితో గలసిన గ్రహయుద్ధము, కుజునితో రవ్యేతర గ్రహము లెవ్వరు గలసినను కుజునకును, వారికిని యుద్ధముగలుగును. కుజుని కంటె నారాశిలో నెక్కువ భుక్తిగలైన గ్రహమునకు జయము. తక్కువభుక్తి పరాజయము. గ్రహములు స్థిరరాసులందున్నను గొంతయోగముగలదు. ద్విస్వభావములందు మిక్కిలియోగము.

గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర శ్రీ వాడ్రేవు వంశపయః పారావార రాకాసుధా
కర శ్రీ రామ స్వామీశ్వరార్య పౌత్ర వేంకటరాజా
మాత్యపుత్ర సుకవిజనవిధేయ సూర్యనా
రాయణమూర్త్యాభిధేయ ప్రణీతంబైన
వచనరూపంబగు జాతకనారాయణీ
యమను జ్యోతిషగ్రంథంబున
ప్రథమ ఖండంబునందు
సంజ్ఞాధ్యాయము
సంపూర్ణము

[illegible] జాతక చక్ర[illegible] 12 ఇళ్లు అని మేషాది రాసులు. లగ్నము ఏ రాశిలో వచ్చునో నిరూపించు కొనవలెను, [illegible] తెలిసిన గ్రహములు లేక నక్షత్రము జేపాదములందున్నవో చూడవలెను. ఇవిద పంచాంగము సహాయము చేత తెలిసికొనవచ్చును. ఆ నక్షత్రపాదము లేక రాసులగునో యా రాసులయందు చూచూ గ్రహములను గుర్తించవలెను. కొన్ని గ్రహములు ఆ రోజున ప్రవేశమగును. కొన్ని గడచిన రోజులలో ప్రవేశమగును. గనుక పంచాంగములో గ్రహముల ప్రవేశము నిష్పూర్వగా బోధపడ్డకొని చక్రమునందు ఆ రాసులలో వేయవలెను.

## భా వ ము లు

జాతకస్వరూపము, పంద్రెండు భాగములు. అవి లగ్నము మొదలు చూచుకొనవలెను.

మొదటిది, లగ్నము, తనుభావము.

జాతకునకు శరీరమెట్టిదో, లగ్నమట్టిది. గనుక నే తనుభావమని దానికిపేరు. లగ్నాధిపతికి ద్వాదశభావ లక్షణములును గలవు. ఏ భావమును విచారించినను లగ్నాధిపతినిగూడ నా భావాధి పతితో సమానమైన ప్రాముఖ్యతతో జూడవలెను.

సప్తమస్థానము, అస్తరాశి గనుక దానినిబట్టిగూడ కొందరు జూచెదరు. లగ్నమును, లగ్నాధిపతినిబట్టి యంగసౌష్టవము ఆయు ర్దాయము, తెలియును. రూపమునుగూడ దీనినిబట్టి తెలిసికొన వచ్చునని కొందరందురు. గాని చాలమంది నీ మతము నంగీకరించ లేదు. భట్టోత్పలయవనాదులు "లగ్నసవాంశ పతుల్యశరీరాః" అని వ్రాసిరి. నవాంశాధిపతులనుబట్టి చూచిన మొదల సరియైన ఫలములు వచ్చును. తప్పులురావని యనుభవము తెలుపుచున్నది.

## సంజ్ఞాధ్యాయము

| | | | | |
|---|---|---|---|---|
| మఖ | మూల | అశ్విని | కేతుదశ | 7 సం॥ |
| పుబ్బ | పూర్వాషాఢ | భరణి | శుక్రదశ | 20 సం॥ |
| | | | మొత్తము— | 120 |

### ఋక్షాద్యంతమును దెలిసికొనుట

ఋక్ష మనగా నక్షత్రము. అద్యంత మనగా నానక్షత్రమెప్పు డారంభమగునో యది మొదలు ఎప్పటివరకుండునో యంతవరకు నైన గడియల మొత్తము ఋక్షాద్యంతము. ఒకప్పుడు జనన కాలనక్షత్రము తొలినా డారంభమగును. మరునాటివరకు గూడ నుండును. దినమునకు 60 గడియలు లెక్క ఉదా॥ జనన కాలము నకు పుబ్బానక్షత్ర మనుకొనుడు. తొలిరోజున మఖనక్షత్రము 43 గడియ లనుకొనుడు అనగా దినప్రమాణము రాత్రి పగలు కలిసి 60 గడియలు. అందులో మఖ 43 గడియలు పోగా ఆరోజున పుబ్బానక్షత్రము 17 గడియలున్నది. జననమైనరోజున పుబ్బ 47 గడియ లనుకొనుడు. గనుక మొత్తము 17 + 47 = 64 గడియలు ఋక్షాద్యంతమైనది.

### దశాశేష మెట్లనగా

పుబ్బనక్షత్రము 64 గడియలలో జననకాలమువరకు 48 గడి యలు భుక్తియైనది. ఇకను 16 గడియలు శేషమున్నది అనుకొనుడు.

శుక్రదశా సంవత్సరములు 20. 64 గడియలకు 20 సం॥రములు. 48 గడియలకు 15 సం॥రములు. 16 గడియలకు 5 సం॥రములు. జననకాలమునకు దశాశేషము 5 సం॥రములు.

### జాతకచక్రము వేయు పద్ధతి

జననకాలమున కేలగ్నమో, అదియెట్లు తెలిసికొనవలెనో,

ద్వితీయాధిపతి లాభాధిపతితో గలిసి కేంద్రకోణములలో నెక్కడనున్నను యోగమునిచ్చును. కలిసినయెడల యోగమే గలుగును.

నైసర్గిక పాపులకు ద్వితీయాధిపత్యమున్న, కేంద్రాధిపత్యమున్న గలిగి కేంద్రమునందైనను, కోణమునందైనను నున్నయెడల యోగముగలుగును. ఈ కేంద్రకోణములు వారికి నుచ్చయయ్యేనేని యోగభంగము అవయోగము అగును. నైసర్గిక పాపులకు ద్వితీయాధిపత్యముపట్టినప్పుడు కేంద్రకోణస్థితి శుభము. కోణస్థితికంటె కేంద్రస్థితి మంచిది. కోణస్థితివలన సామాన్యయోగము. అవయోగము మాత్రము చేయదు. నైసర్గిక పాపులకు ద్వితీయ లాభాధిపత్యమును బట్టి కేంద్రకోణములందున్నప్పుడు యోగమునిచ్చెదరు. కేంద్రము కంటె కోణముమంచిది. ద్వితీయ తృతీయాధిపత్యములు పట్టిన నైసర్గిక పాపగ్రహము లాభమందున్న యోగము చేయును. నైసర్గిక పాపులకు ద్వితీయ తృతీయాధిపత్యములు గలిగి లగ్న పంచమ నవమములందున్నప్పుడు యోగమునిత్తురు. లగ్నము కంటె బంచమ నవమములు ప్రబలము.

మిశ్రరాశియయిన ద్వితీయమునకు నైసర్గిక పాపుడు అధిపతియై వానికింకొక యాధిపత్యముండెనేని ఆ రెండవ యాధిపత్యము దొక్క శుభమునుగాని యశుభమునుగాని మొదటి యాధిపత్యము ప్రబలము చేయును. నైసర్గిక పాపులకు కేంద్రాధిపత్యము పట్టి యశుభ రాసులలో (3, 6, 8, 11, 12) స్థానములలో నొకదానికి కూడ నాధిపత్యమును పట్టి కేంద్రకోణములలో నున్నయెడల యోగమునిత్తురు. ఆ స్థానములు ఆ నైసర్గిక పాపులకు నుచ్చస్థానములు కాకూడదు. ఉచ్చయయ్యేనేని యోగ [illegible]

నైసర్గిక పాపగ్రహములకు కోణాధిపత్య కేంద్రాధిపత్యము గలిగి యందు కోణాధిపత్యము ముందును, కేంద్రాధిపత్యము తరువాతను గలిగినప్పుడు శుభఫలమునే నిచ్చెదరు. నైసర్గిక పాపులకు కేంద్ర కోణాధిపత్యములు గలిగి పాపస్థానములగు 3, 6, 8, 11, 12 తృతీయషష్టాష్టమ లాభవ్యయములందుండు రేని మంచియోగమునిత్తురు. నీచపట్టినేని మరింత హెచ్చుయోగము నిచ్చెదరు. నైసర్గిక పాపులకు గేంద్రాధిపత్యము మాత్రము గలిగినప్పుడు శుభు లగుదురు. ఇట్టి శుభులకు గేంద్రస్థితివలన శుభత్వము హెచ్చును కోణస్థితిగూడ శుభమే. కేంద్ర మంత యోగము నియ్యదు. ఈ కేంద్రములు నైసర్గిక పాపుల క్షేత్రము లైనయెడల మరింత శుభము హెచ్చగును. ఇట్టిశుభులకు గేంద్రాధిపత్యము గలిగిన నైసర్గిక పాపుల సంబంధమున్నప్పుడు యోగములు మరింత ప్రబలమగును. ఆస్థానములు నీచమైనయెడల నింకను యోగమెక్కువ. నైసర్గిక పాపగ్రహములకు దృతీయ షష్టాష్టమ లాభవ్యయాధిపత్యములు పట్టి యాస్థానముల లోనే యున్నయెడల యోగమునీయజాలరు. అప్పు డుచ్చపట్టిన యెడల మరింత అవయోగము. తృతీయ షష్ట అష్టమ లాభవ్యయాధిపతులు కేంద్రమునందు, కోణమునం దున్నయెడల యోగము నచ్చెదరు. కేంద్రమునందుకంటె కోణమునందు హెచ్చుగా యోగము నిచ్చెదరు.

నైసర్గిక పాపులకు మిశ్రరాశియగు ద్వితీయమునకు నాధిపత్యము గలిగి ద్వితీయమందే యున్నయెడల సామాన్యయోగము.

ద్వితీయాధిపత్యము గల్గి కేంద్రములందు నునికి గలిగినయెడల శుభము ; కలుగును. లాభమందున్నను యోగము చేయును. లాభాధిపతితో గలిసి ద్వితీయలాభములలో నెక్కడనున్నను యోగమునిచ్చును.

స్వక్షేత్రమైనచో శుభత్వమునకు బలము. అష్టమాధిపతి పాప గ్రహములతో నుండినను, మిత్రక్షేత్రములలో నుండినను శుభుడగును. ఇది తులాలగ్నమునకు వర్తించును.

నైసర్గిక పాపులగు ముందుగా కోణాధిపత్యమును, పిదప కేంద్రాధిపత్యమును గలిగినచో శుభుడగును. వీనికి కేంద్ర కోణ స్థితివలన శుభము కలుగును. అవి స్వక్షేత్రము లైనచో మరింత శుభత్వము కలుగును. కోణస్థితికంటెను కేంద్రస్థితిబలము హెచ్చు. అనగా మంచియోగ మిచ్చును.

పూర్వము ఋషులు తమశిష్యులకు ముఖాముఖివి యీ శాస్త్రమునకు సాంప్రదాయములను జెప్పి తరువాత శాస్త్రమును ప్రారంభించెడివారు ఈ సాంప్రదాయముల ప్రత్యేకముగా నే గ్రంథము నందును జెప్పియుండలేదు. ఈ సాంప్రదాయములనుబట్టి యోగము లన్నియు వ్రాసినారు. కాబట్టి జ్యోతిష శాస్త్రములోని గ్రంథము లెన్ని జూచినను శాస్త్రసాంప్రదాయ పరిజ్ఞానము లేని యెడల దానిఫలితము లేదు. ఈ జ్యోతిష శాస్త్రమున శుభుడనగా నెవ్వరు? పాపియనగా నెవ్వరు? అను సందేహము ప్రతి జ్యోతిష్కునకు గలుగవలసినది. గాని జ్యోతిషము చదువువారుగాని, చెప్పువారుగాని, యిది తెలిసికొనక నైసర్గిక శుభులను శుభులు గాను, నైసర్గికపాపులను పాపులుగను, జూచికొని యీప్రకారము సరిగా జాతకములలో ఫలితము జెప్పుకొనుచుండుటను నొకప్పుడు చెప్పినది సరిగా నుండుటయు, నొకప్పుడు చెప్పినది సరిగా నుండక పోవుటయు గలుగుచున్నది. దీనికి కారణమేమి యనగా ఫలితభాగమున శుభుడన్నమాట ఋషులచే నెక్కడ నుపయోగించినను, అది యీ క్రిందివిధముగా జూచుకొనవలెను.

1. నైసర్గికశుభునకుగాని, పాపికిగాని, స్థితివలనను; 2. ఆధిపత్యమువలనను; 3. ఇతర గ్రహసంబంధమువలనను, శుభత్వము

గాని, అశుభత్వముగాని, చెప్పవలెను. అట్టివారు శుభులుగాగాని, అశుభులుగాగాని యెంచుకొని యాప్రకారము శుభ పాప ఫలములను జెప్పుకొనవలెను.

ప్రతిభావమునకు గారకులున్నటులే ప్రతిభావమునకు గ్రహములు కొన్ని శుభప్రతిపాదకములుగాను, కొన్ని యశుభత్వమును ప్రతిపాదించునవిగాను నుండును. కొన్ని సమత్వముగా నుండును. పాపగ్రహము లే భావమందుండునో యా భావమునకు నపకారము జరుగునని చెప్పుమాట సర్వదా వర్తింపదు. నైసర్గిక పాపులైనను గొన్నిభావములకు గొందరు శుభత్వ మిచ్చెదరు. అట్టివారు నైసర్గిక శుభులకంటెగూడ నా భావములందున్న యెడల శుభత్వ మిచ్చెదరు. ఎట్లనగా ఉ॥ రవి, రాహువులు పాపులైనను పుత్ర భావమందుండి రేని బహు పుత్రయోగ మిచ్చెదరు. మరియు నైసర్గిక శుభులైన శుక్రబుధులు పుత్రభావమునందుండిన సంతాన నష్టము గలుగును. ఆదేవిధముగా కళత్రవిషయమై రవి పాపిగాడు. శని యాయుర్దాయమునకు బాపికాడు. స్త్రీత్వవర్తనకు గేతువు మంచివాడు.

నైసర్గిక పాపులు కొన్నికొన్ని భావములయందున్న యెడల గొన్ని భావములకు ప్రత్యేకముగ నష్టముచేయుదురు. కొన్నిటికి సామాన్య నష్టము చేయుదురు. కొన్నిటికి పై చెప్పిన విధముగా వృద్ధిచేయుదురు. ఉ॥ రవిరాహువులుగాని, రవిశుక్రులుగాని, శుక్రరాహువులుగాని, వీరుముగ్గురుగాని, యిందులో నొక్కరుగాని లగ్నాత్తు ద్వితీయమందున్న యెడల నేత్రములకు హాని జరుగును. అటులే భ్రాతృస్థానమందుగాని, భాతృస్థానాత్తు భాతృస్థానమందుగాని కుజుడున్న యెడల భ్రాతృనష్టము, రాహువుకూడ భ్రాతృనాశకరుడు. కుజ రాహువు లిద్దరునుగలిసి తృతీయ, పంచమ, అష్టమముల

యందుండిన భ్రాతృకష్టము అష్టమమునందుండిన కుజుని విశేష దృష్టిచేత భ్రాతృస్థానమును జూచుటచేత నాభావమునకు నష్టము. కుజునకు సప్తమదృష్టికంటె చతుర్థదృష్టియు, చతుర్థదృష్టికంటె అష్టమదృష్టియును బలవత్తరములు, గురుశనులకుగూడ విశేష దృష్టులు బలవత్తరములు.

వ్యయమునందు శుభగ్రహముగాని పాపగ్రహముగాని యున్న యెడల ఆయుఃక్షీణము చేయును. అనగా ఆ గ్రహము ఇయ్యవలసిన నాయువు నీయజాలదని యర్థము.

జ్యోతిషఫలములు తెలిసికొనుటకు, గ్రహములు, రాసులు, లగ్నము - ఈ మూడును ఆధారములు. లగ్నము, చతుర్థము, సప్తమము, దశమము - ఇవి కేంద్రములు, (లగ్నము) పంచమము నవమము - ఇవి కోణములు, కేంద్రకోణములు శుభస్థానములు.

తృతీయ, షష్ట, అష్టమ, లాభ, వ్యయములు అనగా 3, 6, 8, 11 12 స్థానములు పాపస్థానములు. ద్వితీయము మిశ్రమస్థానము.

ఈ శాస్త్రమునందు లాభాధిపతి ధనభావమునందును ఆయుర్విషయములోను శుభుడుగా నెంచబడును. లాభాధిపతి స్వయముగా దన దశ, అంతర్దశ వచ్చినప్పుడు అంత యోగమీయడు. ఈ గ్రహము యోగకారకునితో గలిసినప్పుడు వారిని మరింత యోగవంతులను జేయును. గనుక నే ఋషులు లాభాధిపతిని పాపిగా జెప్పినను యోగమునిచ్చెడి గ్రహములలోగూడ చేర్చినారు.

నైసర్గికశుభగ్రహమునకు కేంద్రాధిపత్యమువలన గలిగిన అశుభత్వఫలము యెక్కువ కోణాధిపత్యమువలన గలిగిన అశుభత్వ ఫలము తక్కువ. వీడు కేంద్రములయందుండిన యోగము నివ్వడు. ద్వితీయమున, కోణమునందు సామాన్యము 3, 6, 8, 12 స్థానము లందు యోగమునిచ్చును.

నైసర్గిక పాపగ్రహములకు కేంద్రాధిపత్యము వలన నెక్కువ శుభఫలము గలుగును. కోణాధిపత్యమువలన గలిగినది తక్కువ ఫలము గలుగును.

నైసర్గిక పాపులకును, నైసర్గిక శుభులకును యోగవిషయమునందు వారి యాధిపత్యము చేతను, స్థితిచేతను, గ్రహసంయోగము చేతను శుభత్వాశుభత్వములు నిర్ణయింపవలెను.

అనగా నైసర్గికము చేత నే గ్రహములకు నిది శుభగ్రహమనియు, నిది పాపగ్రహమనియు నిర్ణయించుకొనగూడదు. నైసర్గికశుభులైన గురు, శుక్ర, చంద్ర, బుధులకు శుభస్థానములైన కేంద్రకోణములకు ముఖ్యముగా కేంద్రములకు నాధిపత్యము కలిగినప్పుడు పాపత్వము సిద్ధించి వారికి కేంద్ర కోణములు స్థితియును గలిగెనేని ప్రబలమైన పాపత్వము పట్టును. కేంద్రస్థితికన్న కోణస్థితివలన కొంత పాపము తక్కువ. వీరికి కేంద్రాధిపత్యమున్నను నైసర్గికశుభ సంయోగమము మంచి యుపయోగము చేయును. కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులకు పాపరాశి స్థితిగలిగెనేని శుభులుగా మారుదురు. 3, 6, 8, 11, 12,, స్థానములు పాపస్థానములు. ఇట్లు శుభులుగా మారిన గ్రహములకు 3, 6, 8, 11, 12, స్థానాధిపతుల సంబంధమున్న యెడల శుభత్వము నింక నధికమగును.

నైసర్గిక పాపగ్రహములకు కేంద్రాధిపత్యమువలన శుభత్వమును, కోణాధిపత్యములువలన పాపత్వమును సిద్ధించును. కేంద్రకోణాధిపత్యము లొకేమారుగా గలిగి కేంద్రమందైనను కోణమందైనను ఉనికి గలిగినప్పుడు కేంద్రము ముందు కోణము తరువాత నున్న యెడల కోణాధిపత్యమువలన గలిగిన పాపత్వమే మిగులును. ఈ గ్రహములకు కేంద్రములు, కోణములు, స్వక్షేత్రములై యెంత హెచ్చగునో నంత హెచ్చు పాపఫలమును గలుగును.

సామాన్యముగ ఎక్కువ యోగము నిచ్చెదరు. నైసర్గిక పాపులకు కేంద్రకోణములకు మాత్రమే ఆధిపత్యము పట్టినయెడల వారు కేంద్రమునందున్నను, కోణమునందున్నను ప్రబలయోగము నిచ్చెదరు. ఈ యోగము తులాలగ్నమునకు తప్ప తక్కిన లగ్నములకు జరుగదు. తులాలగ్నమునకు మాత్రము నైసర్గిక పాపులకు 3, 6, 8, 11, 12 తృతీయ షష్టాష్టమ యేకాదశ ద్వాదశములయందున్న యోగము. తులాలగ్నమునకు కుజుడు, కేంద్రాధిపతియైనను ద్వితీయాధిపత్యముకూడ పట్టును గనుక ద్వితీయాధిపత్యముతో గూడిన కేంద్రాధిపత్యము శుభము గనుక కేంద్రకోణములయందున్నయెడల మంచియోగము నిచ్చువాడగును. నైసర్గిక పాపులయిన రవి శనులు కేంద్రాధిపత్యముపట్టి యా కేంద్రములో రవి శనులు, కలిసినయెడల, మంచి రాజయోగ మిచ్చువారగుదురు. ఈ కేంద్రములు వారికి శత్రుక్షేత్రములగు కుంభ సింహ రాసులైనయెడల మరింత ప్రబలయోగము నిచ్చువారగుదురు. నైసర్గిక పాపగ్రహములకు (3, 6, 8, 11, 12) తృతీయషష్టాష్టమలాభ వ్యయస్థానములలో రెండింటికి నాధిపత్యము పట్టినప్పుడు వారి షష్టాష్టమలాభ వ్యయస్థానములయందుండకూడదు. అనగా యోగమునీయరు. కేంద్రకోణములలో నున్నయెడల సామాన్యముగా మంచియోగ మిచ్చెదరు. నైసర్గిక పాపులకు కేంద్రాధిపత్య శుభత్వము లగ్నకేంద్రముకంటె చతుర్థము దానికంటె సప్తమము. దానికంటె దశమము, (ఉత్తరోత్తరము) బలము యెక్కువ.

## నైసర్గిక శుభులు

1. నైసర్గిక శుభులకు నుభయ కేంద్రాధిపత్యము పట్టినపుడు కేంద్రస్థితిగలిగినేని యోగమునియ్యరు. కోణమునందుండినను అంత శుభత్వము చెప్పుటకు వీలులేదు. వీరు కేంద్రాధిపతులై తృతీయ

షష్ఠాష్టమలాభవ్యయములం దున్నప్పుడు మంచియోగ మిచ్చెదరు. ఈ పాపస్థానములు ఉచ్చస్థానము లైనయెడల మరింత యోగము చేయుదురు. ఇవి కుజక్షేత్రములైనను యోగముపట్టును.

2. వీరికి కేంద్రకోణాధిపత్యముపట్టి కేంద్రమందున్నప్పుడు మంచియోగము నియ్యరు. సామాన్యముగా జరుగును. కోణమందున్నయెడల కొంచెము మంచి కనబడును. కేంద్రస్థితికంటె కోణస్థితి కొంచెము శుభము. వీరు పాపస్థానములగు 3, 6, 3, 11, 12 తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయస్థానములందున్నప్పుడు మంచి యోగము నిచ్చెదరు. ఉచ్చ అయినయెడల మరింత యోగము, నీచ అయిన నశుభము కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికశుభులు. కేంద్రాధిపత్యము పట్టిన వేరు నైసర్గిక శుభులతో గలిసి కేంద్రమందున్నయెడల మరింత అవయోగము గలుగును. వీరు కేంద్రకోణములందుగాక, తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములం దుండిన మంచి యోగము నిచ్చెదరు.

నైసర్గిక శుభులకు ముందుగా కేంద్రాధిపత్యము గలిగి పిమ్మట తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములలో నొకదానికి నాధిపత్యము గలిగినప్పుడు వీరు కేంద్రకోణములం దుండిరేని మంచియోగము. మిశ్రరాశియగు ద్వితీయమందున్నయెడల సామాన్యయోగము 3, 6, 8, 11, 12 స్థానములం దున్నప్పుడు మంచియోగము నీయరు.

వీరికి ముందుగా పాపస్థానములకు నాధిపత్యము గలిగి పిమ్మట కేంద్రాధిపత్యము గలిగినయెడల వారు కేంద్రమం దుండుటవలన అంత మంచియోగమీయరు. కోణమం దుండుట మంచిది.

వీరికి ద్వితీయమగు మిశ్రరాశికి నాధిపత్యము గలిగి కోణాధిపత్యము గలిగినయెడల ఆ ద్వితీయమందే యుండుట కోణస్థితికంటె మంచి యోగమిచ్చును. ఆ ద్వితీయమందె లాభాధిపతితో గలిసి

యున్నయెడల మరింత యోగము. కోణస్థితివలన ప్రబలయోగము చెప్పుటకు వీలులేదు. వీరికి తృతీయ కోణాధిపత్యము గలిగి కేంద్రములందున్నయెడల సామాన్యయోగము.

వీరు తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములందున్నప్పుడు మంచియోగము నివ్వరు. ద్వితీయకోణాధిపత్యములు పట్టిన నైసర్గిక శుభులకు తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయాధిపతులతో గలిసి కేంద్రకోణముల యందున్నను కొంత యోగమిచ్చెదరు.

ద్వితీయ లాభాధిపత్యముపట్టి నైసర్గికశుభులు కేంద్రకోణముల యందున్నయెడల మంచియోగ మిచ్చెదరు. వీరు ధనమందున్న యెడల సామాన్య యోగము. తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయము లయందున్నయెడల యోగము నియ్యరు. ద్వితీయ లాభాధిపత్యము పట్టిన శుభులు కోణాధిపతులతో గలసి ద్వితీయమందున్నయెడల మంచియోగము. వీరు లాభమందున్నను ధనలాభాధిపతుల దశలకంటె వారితో గలిసియున్న కోణాధిపతుల దశలెక్కువ యోగమునిచ్చును.

నైసర్గిక శుభులకు తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములకు నాధిపత్యము గలిగి కేంద్రకోణముల యందున్నయెడల మంచి యోగము నిచ్చెదరు. నైసర్గికశుభులు తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయాధిపతులై యా స్థానములయందె యున్నయెడల నవయోగము నియ్యరు. ఈ నైసర్గిక శుభులకు రెండాధిపత్యములు గూడ తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములలోని వైరియాపాపస్థానములందె స్థితి గలిగినయెడల యోగము నియ్యరు. ఇది మకరలగ్నమునకు మాత్రము వర్తించదు. వీరు కేంద్రకోణముల యందున్నయెడల మంచియోగము నిచ్చెదరు.

నైసర్గిక శుభులకు కేంద్రకోణములును, ద్వితీయమునుగాక

వలన కేంద్రకోణాధిపత్యము పట్టిన నైసర్గిక శుభుల యొక్క పాపత్వ మునుగూడ కొంత తగ్గించెదరు. అట్లగా వారును కేవలము నవయోగము చేయరు.

కేంద్రకోణాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులు 3 6, 8, 11, 12 స్థానముల యాధిపత్యము గలిగిన నైసర్గిక శుభులతో కలిసి 3, 6, 8, 11, 12 స్థానములందున్నయెడల వారి దశాంతర్దశల యందు మంచియోగము నిచ్చెదరు. తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయాధిపత్యము పట్టిన నైసర్గికశుభులు యోగము చేయుదురు.

నైసర్గిక శుభులను గురుశుక్రులను నుభయ కేంద్రాధిపత్యము పట్టి తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములలో నొకటి వారి కుచ్చయై యుండినయెడల జాతకునకు గొప్ప యోగము పట్టును. నీచమయినను యోగమె.

నైసర్గికశుభులగు గురుశుక్రులకు కేంద్రాధిపత్యములును, తృతీయ షష్ఠాష్టమ లాభ వ్యయములలోనివే యైన వారికి కేంద్రస్థితి కలిగి యక్కడ నుచ్చ కలిగిన యెడల గొప్పయోగముపట్టును.

గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర శ్రీ వాడ్రేవు వంశపయః పారావార రాకాసుధా
కర శ్రీ రామ స్వామీశ్వరార్యపౌత్ర వేంకటరాజా
మాత్యాపుత్ర సుకవిజనవిధేయ సూర్యనా
రాయణామాత్యాభిధేయప్రణీతంబైన
వచనరూపంబగుజాతకనారాయణీ
యమను జ్యోతిషగ్రంథంబున
ప్రథమ ఖండంబునందు
గ్రహబలాధ్యాయము
సంపూర్ణము

# శ్రీ జాతక నారాయణీయము

## ప్రథమ ఖండము

## బాలారిష్టాధ్యాయము

లగ్నాష్టమాధిపతులు వ్యయమందుండి కేంద్రకోణముల యందుగాని, లాభమునందుగాని, గురు, బుధ, శుక్ర పూర్ణచంద్రులు లేనియెడల బాలారిష్టయోగము.

కేంద్రములయందు పాపగ్రహములుండి యేకాదశము తప్ప తృతీయ షష్ఠాష్టమవ్యయములందు నైసర్గిక శుభులున్నయెడల బాలారిష్టము. నైసర్గికశుభులకు నాధిపత్యసంబంధము చూడ నవసరము లేదు. (2) లగ్నమందు శని, (మకరము తప్ప) చతుర్థమందుగాని, సప్తమమందుగాని, రవి కుజులుండి నైసర్గిక శుభగ్రహములు తృతీయమందు షష్ఠమమునందు, అష్టమము నందు, వ్యయమునందున్నను, బాలారిష్టములు. (3) చంద్రుడు బలహీనుడై లగ్నమందున్నను, కేంద్రములో నెక్కడనున్నను, బాలారిష్టము. (4) నైసర్గికపాపులు తృతీయ షష్ఠాష్టమ వ్యయములందుండినను, లాభమందుగాని, కేంద్ర కోణము లందుగాని, నైసర్గిక శుభులలో నొక్కడైనను లేనియెడల బాలారిష్టము. (5) లగ్నమందు నైసర్గికపాపులుండి తక్కినగ్రహ ములు (రాహుకేతువులుతప్ప) వ్యయమందు బడినయెడల బాలా రిష్టము. (6) తృతీయ షష్ఠాష్టమములయందు తక్కినగ్రహము

లుండి లగ్నమందు నైసర్గిక పాపులున్న బాలారిష్టము. (7) లగ్న మందు నైసర్గిక పాపులలో నొక్కడైననుండి తక్కిన గ్రహములన్ని ద్వితీయమందున్న యెడల బాలారిష్టము. (8) నైసర్గిక పాపులు తృతీయాష్టమములందుండి ద్వితీయమందు నైసర్గికశుభు లందరున్న యెడల బాలారిష్టము. (9) తృతీయాష్టమములందు నైసర్గిక పాపులుండి షష్టమమునందుగాని, వ్యయమందుగాని, షష్టవ్యయములందు గాని నైసర్గికశుభు లందరును జేరినయెడల బాలారిష్టయోగము. (10) అష్టమమునందు శనియున్నను కేంద్ర కోణములందొక్క నైసర్గిక శుభుడైన లేనప్పుడు బాలారిష్టము. (11) కేంద్రముల యందు నైసర్గిక పాపులుండి ద్వితీయమందు నైసర్గికశుభులందరును గలిసినయెడల బాలారిష్టము. (12) ద్వితీయమందును షష్టమము నందును నైసర్గికశుభులుండి నైసర్గిక పాపులు నక్కడగాని మరి యే రాసులలోగాని యున్నను బాలారిష్టము. (13) నైసర్గిక శుభు లందరను జన్మలగ్నమునకును చంద్రలగ్నమునకునుగూడ తృతీయ షష్టమ వ్యయములందు బడినయెడల బాలారిష్టము. (14) నైసర్గిక శుభగ్రహములన్నియును నాయుస్థానములగు తృతీయాష్టమములందున్నను, కేంద్రములందు నైసర్గిక పాపులున్నయెడల బాలారిష్టము. (15) ఏ జాతకునకైనను లగ్నాష్టమ వ్యయాధిపతుల దశలు జనన కాలమునకు వచ్చినయెడల నట్టిదశ గడుచువరకు నాయుర్దాయము నిర్ణయింపరాదు. (16) పైన జెప్పిన బాలారిష్టములు పట్టినప్పుడు లగ్నాష్టమ వ్యయాధిపతులదశలు రాకపోయినను అరిష్టమే.

## రిష్టభంగములు

గురుశుక్రులును పాపులతో గలియని బుధుడును కేంద్రములందు గాని కోణములందుగాని యున్నయెడల రిష్టము చెప్పగూడదు.

నైసర్గికశుభులలో నొక్కడైనను కేంద్రమందుండెనేని రిష్ట

భంగము. ఈ నైసర్గికశుభులు పాపులతో గలిసి పాపక్షేత్రములం దున్నయెడల ఒకప్పుడు రిష్టభంగము చెప్పగూడదు. నైసర్గికశుభు లలో నొక్కడైనను కేంద్రమునందు లేకపోయినను, కోణమునందుండి చంద్రుడు కేంద్రమునందుండెనేని రిష్టభంగము.

గురుడు కోణమునందుండిన యెడల రిష్టభంగము నైసర్గిక శుభులు కేంద్రములందు గోణములందు లేకపోయినను, ఏకాదశమునందుండి చంద్రుడు కేంద్రమందైనను, కోణమందైన నున్నయెడల రిష్ట భంగ మగును.

చంద్రుడు కేంద్రమందుగాని, కోణమందుగాని యుండి యష్ట మాధిపతి లాభమందున్న యరిష్టభంగము, చంద్రుడు కేంద్రము లందుండి లగ్నాధిపతి లాభమందున్నను రిష్టభంగము. చంద్రుడు కేంద్రమందుండి యాయుఃకారకుడైన శని లాభమందుగాని, అష్టమ మందుగాని యున్నయెడల రిష్టభంగము. కోణమందు నైసర్గిక శుభులలో నొకడుండి నైసర్గికపాపగ్రహములు ఏకాదశమందున్న యెడల రిష్టభంగము నైసర్గికశుభులలో నొకడయినను కేంద్రమందు గాని కోణమందుగాని యుండి అష్టమాధిపతిగాని, లగ్నాధిపతిగాని లాభమందున్నయెడల రిష్టభంగము—చంద్రుడు కేంద్రకోణము లలో నుండి యష్టమ లాభాధిపతులకు పరివర్తన గలిగినయెడల రిష్టభంగము.

నైసర్గికశుభులలో నొక్కడయినను కోణమందుండి యష్టమ లాభాధిపతులకైనను, లగ్న లాభాధిపతులకైనను, పరివర్తనము గలిగినప్పుడు రిష్టభంగమగును. నైసర్గికశుభులలో నెవరికైనను లగ్నాధిపత్యము పట్టి లగ్నమందున్నయెడల రిష్టభంగము. అష్టమ మందు గురుడుండి, అష్టమాధిపతి లాభమందున్నయెడల రిష్ట భంగము. లాభాధిపతి లగ్నకేంద్రమందుండి లగ్నాధిపతి కేంద్ర

కోణములలో నున్న యెడల రిష్టభంగము చంద్రుడు లాభమందుండి కేంద్రమునందైనను కోణమునందైనను ఒక్క నైసర్గిక శుభ గ్రహమున్న యెడల రిష్టభంగము అష్టమాధిపతి భాగ్యమందుండి భాగ్యాధిపతి లాభమందుండిన రిష్టభంగము.

లగ్నాష్టమాధిపత్యములు గాని, లగ్నాధిపత్యము గాని, అష్టమాధిపత్యము గాని పట్టిన నైసర్గిక శుభులు భాగ్యమందుగాని లాభమందు గాని యున్న యెడల రిష్టభంగము. లగ్నమందు శనియున్నను గురునితో కలిసిన యెడల రిష్టభంగము.

## గద్య

ఇది శ్రీ పార్వతీ పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర శ్రీ వాడేర్వు వంశపయః పారావార రాకాసుధా
కర శ్రీ రామ స్వామీశ్వరాఖ్య పౌత్ర వేంకటరాజా
మాత్యపుత్ర సుకవిజనవిధేయ సూర్యనా
రాయణామాత్యాభిధేయ ప్రణీతంబైన
వచనరూపంబగు జాతకనారాయణీ
యమను జ్యోతిషగ్రంథంబున
ప్రథమ ఖండంబునందు
బాలారిష్టాధ్యాయము
సంపూర్ణము.

నీచగాగాని లగ్నమునకు ద్వితీయచతుర్థములందున్నయెడల భూస్వా సముగలవాడగును. కేంద్రములందు కేంద్రాధిపత్యము పట్టిన గురు శుక్ర బుధు లున్నయెడల వాహనయోగము. కోణములం దున్నను వాహనయోగము. గృహముకూడ గలవాడగును. వాహనస్థానమందు బృహస్పతి యున్నయెడల వాహనయోగము. ఈ స్థానము మేష వృశ్చికము లైనయెడల మరింత ప్రబలము. ఇట్లే కారకాంశలగ్నమునకు జూడవలెను.

వాహనస్థానాధిపతియును గారకుడును, సప్తమాధిపతియును తృతీయాష్టమవ్యయములలో నెక్కడనున్నను స్వంతగృహముండదు. గురు శుక్రులు కేంద్రకోణములందుండక సప్తమ వ్యయాధిపతులు చతుర్థమందున్నయెడల స్వగృహముండదు. చతుర్థాధిపతి కేంద్ర కోణములలో నెక్కడనున్నను విద్యాబుద్ధులుగలవాడగును. రవి బుధులు విద్యాస్థానమందున్నయెడల జన్మస్థ స్వప్నముగాని విఘ్న ములు గలుగును. లగ్న ద్వితీయ చతుర్థాధిపతులు కేంద్రకోణము లలో నెక్కడనున్నను మంచివిద్యాబుద్ధులు గలవాడగును, విద్యా స్థానమందుగాని, పంచమ స్థానమందుగాని గురుడుగాని, గురు చంద్రులుగాని యున్నయెడల విద్యగలవాడు, సుగుణములుగలవా డగును. శుక్రుడు లాభాధిపతియై చతుర్థమందున్నను విద్యగలవా డగును. శుక్రుడుగాని శుక్ర చంద్రులుగాని విద్యాస్థానమందును నితర కేంద్రములందు నున్నయెడల విద్యవచ్చును. గురునకు విద్యా స్థానాధిపత్యముపట్టి యాస్థానమందున్నయెడల విద్య యంత ప్రబ లముగా నీయదు. ద్వితీయమందు గురువుగాని, శనిగాని, కేతువు గాని యున్నయెడల జదువరి యగును. రాహువు విద్యాస్థానమం దున్న వైద్యసంబంధమైన విద్య సాధారణముగా వచ్చును. కుజుడు తర్కన్యాయసంబంధములగు విద్యలకు గారకుడు. బుధచంద్రులు

వ్యవహారములకును, గ్రంథ విక్రయములకును గారకులు. చంద్రు డును శుక్రుడును శిల్పచిత్రలేఖనములకు గానవిద్యకును. గారకులు. రవి చంద్రులు లోహశాస్త్రములకును. బుధుడు పదార్థ విజ్ఞానము నకును శని రాహువులు గణితమునకును, రవి గురులు సంస్కృత మునకును, గురుడు రాజవిద్యకును, రవిశుక్రులు రాజకార్యములకును శుక్రుడు తెలుగు భాషాజ్ఞానమునకును, తెలుగు కవిత్వమునకును, కేతువు ఆధ్యాత్మికవిద్యకును, శుక్రుడు డాంబికమునకును, గురు డాడంబరములేని కొలది వేషమునకును గారకులు. గురు కేతువులు సత్త్వగుణప్రధానులు. బుధ శని రాహువులు తమోగుణప్రధానులు. రవి చంద్ర శుక్ర కుజులు రజోగుణప్రధానులు. ఈ గ్రహములలో నేదైనను ఉచ్చస్థమందుండిన పైజెప్పిన లక్షణములు ప్రధానముగ నుండును. ఇటులే సప్తమస్థానమును జూడవలెను. ఇటులే చతుర్థాధి పతియు సప్తమాధిపతియు నే గ్రహముతో జేరి చూడబడియుండురో యెవరి యంశలయందుండురో ఆ సంబంధములగు లక్షణములు గలిగియుండును. లగ్నాధిపతికిగూడ కొంత కారకత్వము గలదు. బుధ కేతువులకును రాహువువలెనే వైద్యవిద్యకు కారకులు.

మాతృభావాధ్యాయము
సంపూర్ణము.

# పితృభావాధ్యాయము

లగ్నము మొదలు భాగ్యమును, భాగ్యము మొదలు భాగ్యాత్తు భాగ్యము అనగా పంచమమును, ఈ రెంటినిబట్టి పితనుగురించి తెలిసికొనవలెను. పగలు జననమైనవారికి రవియును, రాత్రి జనన మైనవారికి శనియును, పితృకారకు లగుదురు. భాగ్యాధిపతి భాగ్య మందుగాని పంచమమందుగాని యుచ్చస్థు డైనయెడల దండ్రి

పూర్ణాయుర్దాయమనఁబడును, [illegible] [illegible] [illegible] [illegible]
తదధిపతికి నాశేశుఁడైన యున్నయెడల [illegible] [illegible]
యోగము గలుగును. భాగ్యాధిపతి భాగ్యమందు కేంద్రాధిపతు
తులతోఁ గలిసి యున్నయెడల తండ్రి మంచి దీర్ఘాయుర్దాయము
గలవాఁడగును భాగ్యాధిపతి పంచమమందున్నను కేంద్రాధిపతితోఁ
గలిసి పంచమమందున్నను తండ్రికి మంచి పూర్ణాయుర్దాయము.
చంద్రుఁడు పంచమమందైనను, భాగ్యమందైన నుండిన నీయో
గము తప్పక చెప్పవలెను. అప్పుడు చంద్రునకు లాభాధిపత్య
మున్న మరింత విశేషము. లాభాధిపతియు లగ్న పంచమ నవమాధిపతు
లతోఁగాని యుండు నొక్కరితోనైనఁగాని, కారకునితోఁగాని కలిసి
లగ్నపంచమ భాగ్యలాభములలో నెక్కడనున్నను తండ్రికి మంచి
యాయుర్దాయము పట్టును. వీరు కేంద్రములందున్నను శుభమే.
ఇందులో కొన్ని గ్రహములుమాత్రమే శుభముగా నున్నయెడల
తండ్రికి మధ్యాయుర్దాయమైనను పట్టును.

పితృస్థానమును గురు శుక్రులలో నెవ్వరు చూచినను శుభమే.
పితృస్థానమందు గురు శుక్రులలో నెవ్వరైన నున్నయెడల వారికి
సప్తమాధిపత్యము పట్టినట్లయిన జాతకునకు బాల్యము దాటిన తరు
వాత పితృమారకము. సాధారణముగా వీరి దశలు వచ్చినపుడు
పితృనష్టము చేయుదురు. వీరికి దశలు రానపుడు పితృస్థానమునకు
వ్యయమందున్న గ్రహముగాని పితృస్థానాత్తు పితృస్థానమందున్న
గ్రహముగాని పితృస్థానమునకు సప్తమాధిపతిగాని పితృస్థానాత్తు
ద్వితీయ సప్తమాధిపతులుగాని మారకు లగుదురు. ఆస్థానమం
దున్న గ్రహములు స్థానాధిపతులకంటె నెక్కువ బలవంతులు.
భాగ్యాధిపతి బలవంతుడైన నాధిపత్యశుభులతో గలిసియుండి
భాగ్యమందు శుక్రుఁడుండి కేంద్రమందు బృహస్పతి యున్నయెడల

జాతకునకు తండ్రి బహుభాగ్యవంతుడుగా నుండును. దశమమందు గాని వ్యయమందుగాని కుజునుండి భాగ్యాధిపతి నీచయం దున్న యెడల తండ్రి ధనము లేనివాడగును. భాగ్యాధిపతి పరమోచ్చయం దుండినగాని, బృహస్పతి భాగ్యాంశయం దుండినగాని లగ్నమునకు చతుర్థాష్టమములలో నెక్కడనైన శుక్రు డున్న యెడల తండ్రి దీర్ఘాయుష్యు గలవాడగును. భాగ్యాధిపతి కేంద్రకోణములలోనుండి గురునిచే జూడబడిన యెడల జాతకుని తండ్రి నుండి యోగము గలవాడును, వాహనము గలవాడును అగును. భాగ్య రాజ్యాధిపతులకు బరివర్తన కలిగినచో జాతకుడు సత్కీర్తిగలవాడును తండ్రి కీర్తివంతుడును, ధనవంతుడును నగును. శుభదృష్టికలిగిన జాతకుడు రాజలక్షణములు గలవాడగును.

లగ్నాత్తు పంచమ నవమములలో సూర్యునుండి భాగ్యాధిపతి కేంద్రకోణములలో నెక్కడనైననుండి గురునిచే జూడబడిన యెడల జాతకుని తండ్రి భాగ్యవంతుడగును.

పితృకారకమునకు అష్టమాధిపతికూడ చాల ప్రబలమారకుడు. ఒకప్పుడు ఈ అష్టమాధిపతి చంపుట కలదు.

పితృభావాధ్యాయము
సంపూర్ణము.

## భ్రాతృభావాధ్యాయము

(తృతీయమునుబట్టి కనిష్టసోదరులను ఏకాదశమునుబట్టి జ్యేష్ఠ సోదరులను తెలియదగును. కుజుడు కనిష్టసోదర కారకుడు. శని జ్యేష్ఠ సోదర కారకుడు.) లగ్న తృతీయాధిపతులు షష్ఠాష్టమవ్యయములం దున్న యెడల భ్రాతృనాశనము. అంగారకుడు తృతీయమందున్నను భ్రాతృనాశనము గలుగును. వీనికుచ్చమైన యెడల పరిమితనష్టము.

అంగారకుడు తృతీయాధిపతి, తృతీయ షష్ఠాష్టమ వ్యయములం దున్న యెడల సోదరులు గలుగక పోవుటగాని నాశనమైనగాని జరుగును. కుజుడు తృతీయ పంచమాష్టమములలో నెక్కడనైన రాహువుతో గలసి యుండిన యెడల నట్టి జాతకునకెక్కడే సోదరుడుండడు. రవిరాహువులతో గూడిన కుజుడు తృతీయాష్టమములలోనుండి రెండవవానిచే జూడబడిన యెడలగాని చూడబడినగాని దనకంటె ముందు వెనుక సోదరులు నశింతురు. లాభాధిపతి తృతీయమందుండి శని యేకాదశమందున్న యెడల జ్యేష్ఠసోదరులు మంచిస్థితిలోనుందురు. పంచమ సప్తమాధిపతులు ఏకాదశమందున్నను ఈ యోగము పట్టును. వీరు నైసర్గిక శుభులైన యెడల యోగము మరింత మంచిది. తృతీయలాభాధిపతులు గురునితో గలిసి కోణములందైన నేకాదశమందైన నున్న యెడల సోదరులకు మంచిస్థితి. వీరి కాకోహణము మరింత శుభము. అందు గురునకు స్వక్షేత్రము, ఉచ్చక్షేత్రములైనను శుభము.

భ్రాతృభావమునకు శని పాపుడు కాడు. తృతీయలాభమందున్న శని, భ్రాతృనష్టమును జేయును. తృతీయమందున్న గురు శుక్ర బుధ చంద్రులు భ్రాతృభావమునకు శుభులు. కేతువు వీరందరికంటె భ్రాతృభావమునకు శుభుడు. కారకుడైన కుజుడు తృతీయమందున్న యెడల భ్రాతృనాశనము తప్పదు. ఈ కుజదృష్టియును, భ్రాతృభావమునకు హానికరమైనదే.

తృతీయ లాభాధిపతులు, అష్టమ వ్యయాధిపతులతో గలసి యష్టమవ్యయములలో నెక్కడనున్నను భ్రాతృనాశనము. శనికి లాభాధిపత్యముపట్టి యష్టమ వ్యయములలో నెక్కడనున్నను, జ్యేష్ఠభ్రాతృనష్టము. కారకుడైన కుజుడు అష్టమ వ్యయాధిపతులతో గలిసిగాని, విడిగాగాని యష్టమ వ్యయములలో నుండిన

భ్రాతృనాశనము. తృతీయాధిపతిగాని, కారకుడుగాని, కేంద్రము
లందు, నవమ కోణములందు నున్నయెడల భ్రాతృవృద్ధి. తృతీయాధి
పతి ద్వితీయమందును ద్వితీయాధిపతి తృతీయమందు నుండినను,
తృతీయ భాగ్యాధిపతులు బలవత్తర పష్ఠినను, ద్వితీయ తృతీయా
ధిపతులుగాని, తృతీయ భాగ్యాధిపతులుగాని, తృతీయ భాగ్యాధి
పతులుగాని కలసి ద్వితీయ, తృతీయ, భాగ్యలాభములలో నెక్క
డయున్నను సోదరవృద్ధి కేంద్రములందున్నను గొంతవరకు శుభము.

ఈ యోగము గుజుకు (కన్యాలగ్నమునకు తెలుపు) తృతీయాధి
పతిగ నుండకూడదు. బుధుడు తృతీయలాభములలో నుండిన సోద
రులు గలవారును, సోదరులు మేధావంతులును నగుదురు. సాధా
రణముగ భ్రాతృస్థానములందు స్త్రీగ్రహములున్నయెడల నక్క
చెల్లెండ్రును, పురుషగ్రహములున్నయెడల నన్నదమ్ములును,
వృద్ధిగలుగును. మిశ్రగ్రహ సంబంధమువలన మిశ్రవృద్ధిగలుగును.
వీరు నైసర్గికశుభులైనయెడల నెక్కువ వృద్ధియు, నైసర్గిక పాపు
లయిన దక్కువవృద్ధియు నని చెప్పవలెను. భ్రాతృస్థానములు పురుష
గ్రహరాసులైనది, స్త్రీగ్రహరాసులైనది చూచికొనవలెను. భ్రాతృ
స్థానము, ఓజయుగ్మరాసులలో నేదియైనదో దెలియవలెను. భ్రాతృ
స్థానములందున్నవి స్త్రీగ్రహములై భ్రాతృస్థానములు యుగ్మ
రాసులైనయెడల నక్కచెల్లెండ్లవృద్ధి యెక్కువ. ఓజరాసులై స్త్రీ
గ్రహములున్నయెడల మిశ్రఫలము. ఓజరాసులై పురుషగ్రహము
లున్నయెడల అన్నదమ్ముల కెక్కువసందర్భము. అక్కచెల్లెండ్రకు
దక్కువ.

భ్రాతృభావాధ్యాయము

సంపూర్ణము.

# శ్రీ జాతక నారాయణీయము

## ప్రథమ ఖండము

### షష్ఠభావాధ్యాయము

ఈ భావమునుబట్టి, ఋణము, శత్రువులు, అపకీర్తి, దాయాది వర్గము జూడవలెను.

స్త్రీజాతకమునకుగాని, పురుషజాతకమునకుగాని, యిది సమానముగ జూడవలెను. షష్ఠస్థానమునకు షష్ఠమనగా నేకాదశమును గూడ జూడవలెను. తృతీయ ద్వాదశములకుగూడ నీసంబంధమున్నది. సాధారణముగా నే జాతకములోనైనను తృతీయ షష్ఠ వ్యయాధిపతులు పంచమ భాగ్యలాభములలో నున్నయెడల ఋణముగలవాడగును. వీరికి లాభస్థాన మెక్కువబలము. లాభాధిపతిమాత్రము తృతీయ షష్ఠాధిపతులలో గలియక లాభమందుగాని పంచమమందుగాని భాగ్యమందుగాని యున్నయెడల మంచి ధనయోగము. ఈ పంచమ నవమ లాభములలోగాని ద్వితీయమందుగాని ధనాధిపతితో గలసిన యెడల మంచిధనయోగము. ఈలాభాధిపతి పంచమ నవమ భాగ్యాధిపతులలో నెవ్వరితోనైన గలిసి ద్వితీయ పంచమ నవమ లాభములలో నెక్కడనున్నను మంచి ధనయోగము. వీరితో ద్వితీయాధిపతి కలిసినను మంచి ధనయోగమే. లాభాధిపతి ధన పంచమ నవమాధిపతులతో నెవ్వరితో

నైనను గలిసి కేంద్రములలో నున్న యెడల మంచి ధనయోగము. కేంద్రము లుచ్చ స్వక్షేత్ర బలీయములు. వీరు నైసర్గిక పాపులై నీచ యందున్న మరింత బలము. లాభాధిపతి తృతీయ షష్ఠవ్యయాధిపతు లలో నెవ్వరితోనైన కలిసి కేంద్రములందున్న యెడల సామాన్య ముగ నుండును.

తృతీయ షష్ఠలాభవ్యయాధిపతులు నైసర్గిక శుభులై కేంద్రము లందున్న యెడల గొంత ఋణయోగమున్నను మంచి రాజయో గముగూడ నిత్తురు. షష్ఠాధిపత్యము పట్టిన నైసర్గిక శుభులకు గోణాధి పత్యముగూడ గలిగి కోణమందె యున్న యెడల సామాన్య రాజయోగ మిచ్చెదరు. కేంద్రములందున్న మంచి రాజయోగ మిచ్చెదరు. కేంద్రములందు వీరికి తృతీయాష్టమవ్యయాధిపత్యములు గలిగిన నైసర్గిక శుభులు గలిసినప్పుడు వారిలో నెవరిదశ వచ్చినను రాజ యోగ మిచ్చెదరు.

అటుల నైసర్గిక పాపులు గలిసిన రాజయోగము నీయజాలరు. పైగా ఋణబాధగూడ బెట్టెదరు.

నైసర్గిక శుభులకు కేవలము పాపాధిపత్యములు అనగా తృతీ యాష్టమాధిపత్యములుగాని, షష్ఠవ్యయాధిపత్యములుగాని, తృతీయ వ్యయాధిపత్యములుగాని, షష్ఠమ లాభాధిపత్యములుగాని గలిగి కోణములందున్న యెడల ఋణాధిక్యతగలుగును. వీరు కేంద్రము లలోనున్న యెడల ఋణబాధ గొంచెమున్నను మంచి రాజయో గము పట్టును. వీరు తృతీయ షష్ఠాష్టమ వ్యయాధిపతులతో గలిసి షష్ఠాష్టమవ్యయములలో నెక్కడనున్నను విపరీత రాజయోగము పట్టును. గాని జాతకుడు స్వయముగా గొన్ని ఋణములు చేయును. ధనాధిపతి ఋణమందును, ఋణాధిపతి ధనమందు నున్న యెడల సాధారణముగా ఋణజాతకమే యగును. వీరికి కేంద్రకోణాధి

పత్యముమాత్రమే గలిగిన గ్రహముల దృష్టిసంబంధములు గలిగిన యెడల యంత ఋణబాధ యుండదు. లాభ ద్వితీయాధిపతులకు ఋణకర్తగ గలిగినను వైరిధముగ జూచుకొనవలెను. కన్యాలగ్నము నకుగాను. దీనికి కారణము వ్యయమందున్న శుక్రుడు యోగకారకుడు. నీచపడి ద్వితీయమందున్న రవి యోగకారకుడు. గాని సంభవమునకు ధన వ్యయము చేయువాడగును.

నైసర్గిక పాపులకు తృతీయ షష్ఠవ్యయాధిపత్యము గలిగి కేంద్రములందున్న యెడల సామాన్యముగ నుండును. వీరికి తృతీయ షష్ఠాష్టమ వ్యయాధిపత్యములు గలిగిన నైసర్గికశుభుల సంబంధము గలిగినపుడు నైసర్గిక పాపులును, శుభులును గూడ రాజయోగ మిచ్చెదరు. వీరికి షష్ఠాష్టమ వ్యయాధిపత్యములు పట్టిన నైసర్గిక పాపుల సంబంధ మున్నప్పుడు రాజయోగ మీయరు.

నైసర్గిక పాపులకు లాభాధిపత్యము గలిగి దోషాకరమం దున్న యెడల కొంత రాజయోగము, కొంత ఋణయోగమునుగూడ జేయుదురు. కోణములందున్న నటులే చేయుదురు. షష్ఠాష్టమ వ్యయములందుండిన బూర్తిగ నవయోగము.

ఏ లగ్నమునకైనను షష్ఠలాభాధిపత్యము గల గ్రహములు తృతీయ షష్ఠాష్టమ వ్యయములందుండగూడదు. ఒక్క లాభాధిపతి మాత్రము లాభమందుండుట శుభము. కేంద్రకోణాధిపత్యము పట్టిన నైసర్గికశుభులు షష్ఠాష్టమ వ్యయములందున్నను రాజయోగమును భంగముచేయరుదు. ఋణబాధ కొంతయుండును. వీరు ధనలాభాధి పతులతో గలిసి ద్వితీయ లాభములందున్న యెడల మంచి ధనలాభ మిచ్చెదరు. కేంద్రకోణములందున్నను ధనయోగము. కోణాధి పత్యము పట్టిన నైసర్గికశుభులు ధన లాభాధిపతులతో నవరితో నైనగలిసి యా స్థానములలోగాని కేంద్రకోణములలోకాని యున్న

యెడల ధనయోగము. కోణాధిపత్యము పట్టిన నైసర్గికశుభులు ధన
లాభాధిపతులతో కలియకపోయినను, ద్వితీయ లాభములలో
నున్న మంచి ధనయోగము. కేంద్రకోణములందున్నపుడు సామా
న్యము. కోణాధిపత్యముగల నైసర్గికపాపులు తృతీయ షష్టాష్టమ
వ్యయములందున్నప్పుడుకాని, తృతీయ షష్టాష్టమ వ్యయాధిపతు
లతో కలిసి 3, 6, 8 12 స్థానములలో నుండినగాని ఋణబాధ
విశేషము. వీరు కేంద్రకోణములందు తృతీయ షష్టాష్టమ వ్యయాధి
పతులతో కలిసియున్న సామాన్యయోగము, ఋణబాధయు
నుండును. లాభాధిపతి తృతీయ షష్టాష్టమవ్యయములలో నెక్కడ
నైనయుండి ద్వితీయాధిపతి లగ్నమందుగాని, లగ్నాధిపతి ద్వితీయ
మందుగాని యున్నయెడల ధనవ్యయ మెక్కువగనుండును. లగ్నాధి
పతి ద్వితీయమందు, ద్వితీయాధిపతి లగ్నమందు నున్నయెడల
వ్యయమెక్కువగ నుండును. ద్వితీయాధిపతి ద్వితీయమందుండి
లగ్నాధిపతి లగ్నమందున్నయెడల ధనయోగము.

వ్యయాధిపతి ద్వితీయమందుండి ద్వితీయాధిపతి షష్టమమందున్న
ధనసంపాదన తక్కువగనుండును. షష్టాధిపతికూడ లాభమందున్న
నీయోగము మరింత విశేషము. ద్వితీయమందున్న కేతువు ధన
యోగ మిచ్చును. తృతీయవ్యయములందున్న కేతువుగూడ మంచి
యోగమిచ్చును. ఈ రాసులలో కేతువునకు శుక్రసంబంధమున్న
నీయోగమునకు ప్రతిబంధకము.

కోణలాభాధిపత్యము పట్టిన చంద్రుడు ద్వితీయమందుండుట
ధనయోగమునకు మంచిది. రాహువు ద్వితీయమందున్నయెడల
సామాన్యముగ నుండును.

( ఏకాదశమందున్న రాహువు కొంత ధనయోగమిచ్చును. షష్టాష్ట
మములందున్న రాహువు యోగమునకు మంచివాడు. అవి క్షేత్ర

సింహాసనస్థులైనయెడల శత్రుక్షయము, వ్యాధులు దాన్ని రాహువు యోగము [illegible] చేయును, తనకు షష్ఠస్థానముకూడ యోగము నీయదు

రాహువు వ్యయమందున్నను మిక్కిలి బలహీనుడైనను నారాశిలో షష్ఠమైనయెడల ధనవ్యయముచేసి కొంత పేరుప్రతిష్ఠలిచ్చును.
కేంద్రములలోనున్న రాహు [illegible] కోణములందున్న రాహువు ధన సంపాదనకు మంచివాడు. దీనికి షష్ఠాష్టమ వ్యయాధిపత్యములులేని చంద్రుని సంబంధము కలుగుట మంచిది. కేతువేకాదశమందుండిన నంతయోగము చెప్పకూడదు.

షష్ఠభావాధ్యాయము
సంపూర్ణము.

# కర్మజీవాధ్యాయము

(ఇదియే పదవయిల్లు. దశమాధిపతి నైసర్గికశుభుడై స్వక్షేత్రమందున్నయెడల శుభకర్మచేయువాడగును. కర్మస్థానము పాపరాశియై నైసర్గికశుభులున్నయెడల సత్కర్మ చేయువాడగును. కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికపాపు లున్నను సత్కర్మచేయువాడగును. కోణాధిపత్యము పట్టిన నైసర్గికశుభులున్నను మంచికర్మ చేయువాడగును. లాభాధిపతి దశమందున్నను సత్కర్మచేయును. గురుడు కర్మస్థానమందున్నను, జూచినను డాంబికములేని సత్కర్మచేయును. ఈ గురుడు శనితో జేరిగాని, చూడబడిగాని యుండిన మంచికర్మ చేయును, కర్మస్థానమందు శనియున్నను, జూచినను నాచారవ్యవహారములు తక్కువగానున్నను మంచికర్మ చేయును. కర్మస్థానమందు శుక్రుడుగాని, చంద్రుడుగాని యున్నయెడల డంబము

హెచ్చుగా నుండును. ఇచ్ఛాకన్యాపహారకములను దక్కువ. రవియైన గురుడైన నుండిన నిదేఫలము. దశమాధిపతి షష్టాష్టమవ్యయ ములలోనుండి కర్మస్థానమునకు శని గురులు దృష్టి లేనియెడల సత్కర్మహీనుడగును. పదింట షష్టమవ్యయాధిపతులలో నొకడుండి కర్మస్థానమునకు నైసర్గిక శుభగ్రహ సంబంధము లేనియెడల సత్కర్మ లేనివాడగును. కర్మస్థానాధిపతి పాపరాసులయందున్నను జలగ్నమందు గురు శనులలో నెవరైన నున్నయెడల సత్కర్మ చేయువాడగును. కర్మాధిపతి నైసర్గికశుభులలో నెవరితోనైనగాని శనితోగాని, కేతువుతోగాని కలిసినయెడల మంచిప్రవర్తన గలుగును. కర్మాధిపతి షష్టాష్టమవ్యయములలోనుండి కేతువు కేంద్రమందుండి పదింట నైసర్గిక పాపులుండిన కర్మహీనుడగును. నైసర్గిక శుభులు షష్టాష్టమ వ్యయములలో నుండి దశమమందు రాహువున్నయెడల కర్మహీనుడగును. కర్మాధిపతి బలహీనుడై పాప స్థానములందుండి కేతువు కేంద్రకోణములం దున్నయెడల కర్మ హీనుడగును. దశమాధిపతి రాహువుతో గలిసి యష్టమమందున్న యెడల పాపకార్యములు చేయును. కర్మస్థానమందు షష్టమవ్యయాధి పతులెవరైన నుండిన గురు బుధులు వ్యయమందున్నయెడల గర్మ హీనుడగును. అష్టమమున శని పదింట నుండిన సత్కర్మచేయువాడే యగును. శని కుజులు దశమమందుండి, కర్మస్థానాధిపతి గురుడు, షష్టాష్టమ వ్యయములందున్నయెడల కర్మహీనుడగును. దశమాధి పతి భాగ్యమందు, పంచమమునందు, కేంద్రములందైన నుండి పంచమ భాగ్యాధిపతులలో నెవరైన రాజ్యమందున్నయెడల జాత కుడు పౌరుషవంతుడును, కీర్తివంతుడును, సత్కర్మ చేయువాడు నగును. తృతీయ షష్టమాధిపతులలో నెవరైన దశమందుండి వారి దశలు వచ్చినయెడల వెనుకీర్తిగలవాడగును. కర్మస్థానాధిపతి నీచ

యుండుండి కర్మస్థానము నైసర్గిక శుభగ్రహయుక్తమును, దృష్ట
మును కానియెడల గర్వహీనుడగును లగ్నమందు గురు రాహు
వులు, సప్తమమందు శనియునుండి దశమాధిపతి, తృతీయషష్ఠాష్టమ
వ్యయములలోనున్న జాతకుడు వర్ణసంకరుడగును. లగ్నాధిపతి
లగ్నమందుండి దశమాధిపతి దశమమందుండినను వారికి బలవత్త్వ
గలిగినను జాతకుడు మానవంతుడును, కీర్తివంతుడును. లగ్నముగ
గాని, కారకాంశలగ్నముగాని వారికి దశమములందుగాని శని
యున్నయెడల ప్రసిద్ధమైన సత్కర్మచే జీవించువాడగును. జాత
కుడు చాల స్వాతంత్ర్యశక్తిగలవాడగును. ఈస్థానములలో శుక్రు
డైనను, చంద్రుడైనను, శుక్రచంద్రులైన నున్నయెడల రాజకీయ
మైన యుద్యోగము చేయువాడును, పూర్ణాయుర్దాయవంతుడును,
మంచి యూహలుగలవాడును, భోగియు నగును. అనుభవముచే
జూచిన, గురుడున్నను జూచిన, సుద్యోగముగలవాడగును. దశ
మందు రవియున్నను రాజకీయోద్యోగియగును. కుజుడు దశమమం
దున్నయెడల స్వతంత్రజీవనముగలవాడగును. బుధుడుండిన వ్యవ
హారసంబంధమైన జీవనము గలుగును. కొందరు చంద్రునిచే నీ
యోగములను జెప్పుచున్నారు. ఈ యోగములు జన్మలగ్నముకంటె
కారకాంశలగ్నమునుబట్టి ప్రబలముగా జరుగును.

వరాహమిహిరాదులు దశమమందు, శుభగ్రహముచే జూడ
బడక నున్నట్టి రవి, శని, కుజులుచే భృతక మనుజులు (కూలిమను
ష్యులు) పుట్టుదురని వ్రాసినారు. ఇందులో రవి యున్నయెడల
వీరిలో శ్రేష్ఠులనియును, కుజుడున్నయెడల మధ్యములనియును,
శనియున్నయెడల నధములనియును జెప్పినారు. వీరికి నాశకము
ముచ్చయైనయెడల నీయోగమునకు విపర్యయముగ జరుగును. వీరికి
నీచస్థానమైనయెడల నీచస్వభావము గలవారగుదురు. ఈ దశమ

మందు నైసర్గికశుభులగు. ఉచ్చ స్వక్షేత్ర గ్రహము లున్నయెడల [illegible] నైసర్గికపాపులైనను [illegible] [illegible] లగుదురు.

(ఈ భావమున "కర్మ" అనగా కేవలము ఆచారవ్యవహారము లనియే యూహింపగూడదు. ఒకప్పుడు జాతకుడు ఆచారవ్యవహార కర్మలయందు విముఖుడైనను సత్కర్త అనగా ఇతరులకు ఉపకారము చేయువాడు, అసత్యవాదివాడు, [illegible] [illegible]గుణములు కలవాడును అగును.)

కర్మజీవాధ్యాయము
సంపూర్ణము.

## రాజయోగాధ్యాయము

గ్రహములన్నిటికి గారకత్వముచేతను నాధిపత్యమువలన శుభాశుభ ఫలము లిచ్చెడి శక్తియున్నను వారి స్థితివలన నట్టి శుభాశుభ ఫలనిర్ణయము చేయగలయును.

గ్రహములన్నిటికి జరరాసులకంటె స్థిరరాసులును నంతకంటె ద్విస్వభావరాసులును యోగమునకు బలవత్తరములు. గనుకనే మహర్షులు గ్రహములన్నియు ద్విస్వభావరాసులలోనుండుట గొప్ప రాజయోగమని చెప్పిరి. చరమునందున్న గ్రహములు రాజయోగము నియ్యవు. స్థిరరాసులందున్నను గొంత యోగము గలదు.

గ్రహములకు భాగ్యరాజ్యాధిపతులలో నొకడైన బట్టి అష్టమ లాభములలో నొకటి బట్టినయెడల నంత రాజయోగము నీయజాలరు. యోగభంగమునుగూడ చేయజాలుదురు.

భాగ్యరాజ్యాధిపత్యములు గలిగిన గ్రహములకు షష్టవ్యయాధిపత్యములలో నొకటైన గలిగినను రాజయోగమునకు భంగము

గలుగదు. గాని, షష్ఠవ్యయాధిపత్య సంబంధమునుయిన ధనవ్యయము, ఋణపీడ, అపకీర్తి గలుగుచుండును. లాభాధిపత్యము గలిగిన గ్రహము స్వదశాభుక్తులయందు రాజయోగము నీయజాలదు. తనతో గలిసియున్న యోగగ్రహములకు అత్యంత రాజయోగము నిచ్చును. ఈ యోగగ్రహములకు త్రికస్థానస్థితులైన యెడల కేంద్రాధిపత్యదోషము పట్టకూడదు. కేంద్రాధిపత్యదోషమువలన నవయోగముగూడ గలుగును. యోగగ్రహములైన పంచమ నవమ రాజ్యాధిపతులకు లాభాధిపతి సంబంధము, లాభస్థితియును యోగమునకు శుభమేగాని శుక్ర కేతువులకుమాత్రము శుభముకాదు.

ధన లాభాధిపతులు గలియుట, ధన లాభాధిపతులకు బరివర్తన గలుగుట ధనాధిపతి కొక్కనికి లాభస్థితి గలిగినను కేంద్రాధిపత్యములేని గురుడు ధనలాభములందున్నను మంచి ధనయోగము చెప్పవలెను. గాని

1. ఈ ధనలాభాధిపతులు వ్యయమందున్న యెడల ధనయోగమునకు భంగము గలుగును.

2. ధన లాభాధిపతులు షష్టాష్టమములందుండిన నంత విశేష ధనయోగము జెప్పగూడదు.

3. షష్టాష్టమ వ్యయాధిపతుల సంబంధముచేత ధన లాభాధిపతులు అంత ధనలాభము నీయరు. ఈ చెప్పిన మూడుయోగములలో మొదటిది బలవత్తరము. రెండు మూడు నంతకంటె క్రమముగా తక్కువ.

ధనాధిపతి లగ్నమందుండి (అది వానికి స్వక్షేత్రమైనను గాక పోయినను) లాభాధిపతి యష్టమవ్యయములలో నెచ్చటనున్నను ధనవ్యయమును, ధనయోగమునకు గొంత భంగమును గలుగును. లగ్నమందు బిందువులుతగ్గి ద్వితీయమందు పాపగ్రహములున్నను

లగ్నమందు పాప గ్రహములుండి ద్వితీయమందు బిందువులు తగ్గినను నెన్ని రాజయోగములు పట్టినను రాజయోగభంగము గలుగును.

నైసర్గిక పాపులకు రాజయోగము పట్టినప్పుడు వారు నీచయందుననో, వ్యయమందుననో యుండిన సత్వరత రాజయోగమిచ్చెదరు. ఈ రెండు నొకేమారు పట్టిన మిక్కిలి మంచిది.

యోగాధిపత్యము పట్టిన మూడు నైసర్గిక పాపగ్రహములకు నీచ కలిగెనేని నీచభంగ రాజయోగమని పేరు. ఇది యత్యంత రాజయోగము. సామాన్యముగా ఏ మూడుగ్రహములకు నీచపట్టినను నీచభంగ రాజయోగమని చెప్పెదరు. ఇది తప్పు. ఇది పాప గ్రహములకుమాత్రమే వర్తించును.

కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికశుభులు పాపస్థానములగు తృతీయ షష్టాష్టమ వ్యయములలో నెచ్చటనున్నను యోగమనియును నైసర్గిక శుభులకు తృతీయ షష్టాష్టమ వ్యయాధిపత్యములు పట్టి కేంద్రములం దుండిన యోగమనియును. అందు లగ్నముకంటె చతుర్థము, దానికంటె సప్తమము, సంతకంటె దశమకేంద్రమును బలవత్తరములనియును నిదివరకు జెప్పబడినది. గాని ఇందులో నైసర్గికశుభులగు గురు, బుధ, శుక్రులలో గురునకు సప్తమమును, బుధున కష్టమమును, శుక్రునకు వ్యయమును ప్రబలములు. నైసర్గిక శుభగ్రహములలో గురునకుమాత్రము పాపాధిపత్యము అనగా తృతీయ షష్టాష్టమ వ్యయాధిపత్యములు కలిగి తిర్గి ఆ పాపస్థానము లందున్న యోగమునే ఇచ్చును. ఇది వృషభలగ్నమునకుమాత్రము వర్తించదు. ఉ॥ సింహలగ్నమునకు గురుడు అష్టమాధిపతియయి ద్వాదశమందున్నను యోగించును.

నైసర్గికపాపులకు కేంద్రాధిపత్యము పట్టి చంద్రునితో గలిసి కేంద్రకోణములందున్న యెడల వారిదశలయందు మంచి రాజయోగ మిచ్చెదరు.

చంద్రుడే గ్రహములతో గలిసినను శుభుడని చెప్పబడినను బూర్ణచంద్రుడు కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికశుభులను గలిసి కేంద్రకోణములలో నుండిన యోగము నియ్యజాలరు. ఈ చంద్రుడు రెండు యోగగ్రహముల మధ్యనున్నపుడు రెండు యోగగ్రహములును వారివారి దశలయందు మంచి రాజయోగ మిచ్చెదరు గాని యీ రెండు రాజయోగ గ్రహములును జంద్రుడును కేంద్రాధిపతులై కేంద్రమందుండిన యోగభంగమె యగును. ఈ కేంద్రము కర్కాటకమైన మరింత నవయోగము. ఉభయ కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గిక శుభగ్రహములు కేంద్రములందు కేంద్రాధిపత్యము పట్టని ఇతర నైసర్గిక శుభగ్రహములతో గలిసిన యెడల నీ రియ్యగల శుభమునుగూడ వారు తగ్గించెదరు. రెండు యోగగ్రహములు కలిసినప్పు డా యోగగ్రహములలో నొకటి శీఘ్రగ్రహమును, రెండవది మందగ్రహమును అయిన యెడల మందగ్రహ మా రాశిలో నెక్కువ భాగములు భుక్తియై ముండగను, శీఘ్రగ్రహ మా రాశిలో దక్కువభాగములు నడిచి, వెనుకనుండిన రెండుగ్రహములును మంచి రాజయోగ మిచ్చెదరు. ఈ రెండిటిమధ్యను జంద్రుడుండిన మిక్కిలి యెక్కువ యోగము నిచ్చెదరు. ఇది భిన్నమై శీఘ్రుడు ముందరను రెండవవాడు వెనుకను నుండిన యోగభంగము జరుగును. అనగా నిద్దరును యోగము చేయరు.

శీఘ్రగ్రహములు వరుసగా చంద్రుడు, కుజుడు, బుధుడు, శుక్రుడు.

మంద గ్రహములు వరుసగా శని, గురుడు, రవి.

ఇందు జేర్చిన యోగగ్రహముల వివరము. ఇవి మూడు విధములు :—

1. భాగ్యరాజ్యాధిపతులు పంచమరాజ్యాధిపతులుపంచమ భాగ్యాధిపతులు.
2. పంచమ లగ్నాధిపతులు, పంచమ వాహనాధిపతులు, లగ్న రాజ్యాధిపతులు, లగ్న నవమాధిపతులు.
3. చతుర్థ రాజ్యాధిపతులు, చతుర్థ భాగ్యాధిపతులు లగ్న చతుర్థాధిపతులు.

ఈ మూడువిధములందును మొదటిది యెక్కువ బలముగల యోగము. రెండవది మధ్యమము. మూడవది యంతకంటె కొంచెము తక్కువ.

కేంద్రకోణాధిపత్యములు రెండును గలిగిన నైసర్గికశుభునకు కోణస్థితివలన కేంద్రాధిపత్యదోషము తగ్గి కోణాధిపత్యశుభము మిగులును. కనుక యోగమునిచ్చును. కేంద్రస్థితివలన యోగము నీయజాలడు. గాని యీ నైసర్గికశుభునకు కేంద్రమందున్నను దృతీయవ్యయాధిపతి సంబంధముగాని షష్టాష్టమాధిపతుల సంబంధముగాని కలిగినయెడల కొంతపాపత్వముతగ్గి యోగము చేయును.

కేంద్రాధిపత్యము పట్టిన గురుడు షష్టాష్టమవ్యయములలో నేనయిన గురుక్షేత్రమై యందుండిన మంచి రాజయోగ మిచ్చును. కేంద్రాధిపత్యము పట్టిన గురుశుక్రులకు షష్టాష్టమ వ్యయములలో నొకటి యుచ్చమై యందు వారుండినయెడల మంచి రాజయోగ మిచ్చును.

షష్టాష్టమ వ్యయాధిపత్యము పట్టిన గురుశుక్రులు కేంద్ర కోణములందుచ్చస్థులై యుండిన మంచిరాజయోగమిచ్చెదరు. కేంద్రాధి

పత్యము పట్టిన నైసర్గికపాపులు కేంద్రాధిపత్యము పట్టిన నితర నైసర్గికపాపులతో కలిసి పాపగ్రహరాసులగు మేష సింహ వృశ్చిక మకర కుంభములందున్నపుడు మంచి రాజయోగము చేయుదురు.

కేంద్రాధిపత్యము నైసర్గికశుభులకు, కోణాధిపత్యము నైసర్గిక పాపులకును దోషమని యిదివరకు దెలుపబడినది. అటులే కేంద్రాధి పత్యము నైసర్గికపాపులకును, కోణాధిపత్యము నైసర్గికశుభులకును శుభమనియు నిదివరకు వ్రాయబడినది. కాబట్టి కేంద్రాధిపత్యము పట్టిన నైసర్గికపాపులు కలిసినపుడు అవి కేంద్రమును, ఒకనికి స్వక్షేత్రమైనయెడల నీ గ్రహములు పరస్పర శత్రువులైనను వా రందరును రాజయోగకారకులై మంచి రాజయోగము నిచ్చెదరు. వీరికి చంద్రసంబంధము కలిగిన మరింత రాజయోగము.

పంచమరాజ్యాధిపతులు కలిసినపుడును, భాగ్యరాజ్యాధిపతులు కలిసినపుడును నందులో నొకడు నైసర్గికశుభుడును, రెండవవాడు నైసర్గికపాపియునై, నైసర్గికశుభుడు రాజ్యకేంద్రాధిపతియై, నైస ర్గికపాపి కోణాధిపతియై, వీరు కోణములందు కలిసినను రాజ యోగ మీయజాలరు. గాని వీరు పాపక్షేత్రములగు తృతీయ షష్ఠ వ్యయములందున్నను మంచియోగ మిచ్చెదరు. ఇందు రెండు గ్రహములును నైసర్గికపాపులై కోణములందున్న రాజయోగము నీయరు. కేంద్రములందు కలిసిన మంచియోగము. పాపస్థానము లందు గొంచెము తక్కువ.

ఈ సూత్రము రవిశనులకు వర్తించదు. వీరిలో నొకడు కేంద్రా ధిపతియు, నొకడు కోణాధిపతియునై కోణములందు కలిసినను, యోగభంగము జేయక యోగమిచ్చెదరు. కేంద్రములందు తప్పక

యోగమిచ్చెదరు. కేంద్ర కోణములు రవి శని క్షేత్రములైన మరింత బలము.

ఇద్దరు నైసర్గిక శుభులకు కేంద్రాధిపత్యము పట్టక కోణాధిపత్యము మాత్రమే పట్టి యితరాధిపత్యములున్నను కేంద్రకోణములలో నెక్కడ కలిసినను రాజయోగ మిచ్చెదరు.

భాగ్యరాజ్యాధిపతులు కలిసినప్పుడును, పంచమ రాజ్యాధిపతులు కలిసినప్పుడును, భాగ్యాధిపతిగాని పంచమాధిపతిగాని నైసర్గికశుభుడై రాజ్యాధిపతి నైసర్గిక పాపియై కేంద్రకోణములలో నెక్కడ కలిసినను మంచి రాజయోగ మిచ్చెదరు. వీరికి చంద్ర సంబంధము మరింత (సుంచిది) ప్రబలము.

లగ్న కేంద్రాధిపత్యము పట్టిన శుక్రునకు లగ్నము, కోణముల లోనిది గనుక కేంద్రాధిపత్యదోషము తగ్గించును. ఇట్టి శుక్రునకు షష్టాష్టమాధిపత్యమువలన మరింత శుభత్వముగలవా డగును. వానికి కేంద్రకోణస్థితివలన రాజయోగము కలుగును. కేంద్రమందున్నపుడు యోగభంగము చేయక షష్టాష్టమాధిపత్య సంబంధమైన ఋణబాధ కలుగజేయును.

నీచయందున్న నైసర్గిక పాపులు ప్రబలయోగ కారకులు. అనగా పాపులకు నీచబలము. అటులే నీచయందున్న నైసర్గిక శుభు లవయోగము నిచ్చుటకు బలవంతులు.

నైసర్గిక శుభుల కుచ్చస్థితి సర్వదా యోగమని చెప్పగూడదు. నీచ నైసర్గిక పాపులకు యోగమునకు శుభమని చెప్పి కాళిదాసు "శుభఃఫల మూతాః" అని అతిజాగ్రత్తగా వ్రాసినాడు. అనగా బలవంతులైన నైసర్గికశుభులు యోగకారకులని చెప్పినాడు గాని యుచ్చను బొందిన శుభులు బలవంతులనిగాని యోగకారకులని గాని చెప్పలేదు. దీనికి కారణమేమనగా ఉచ్చపట్టిన నైసర్గిక

శుభులు ఆధిపత్యస్థితులవలన శుభులుగాగాని పాపులుగాగాని మారి, యోగముగాని అవయోగముగాని యిచ్చెదరు. కేంద్రాధిపత్యము పట్టని నైసర్గికశుభులు కేంద్రమందుండి యుచ్చపట్టినపుడు శుభము. కేంద్రాధిపత్యముపట్టి, తృతీయ షష్టాష్టమవ్యయములం దుండినను, ఉచ్చపట్టినను శుభము.

ఉచ్చ నీచలు పట్టిన గ్రహములు యోగము నిచ్చుటకు మంచి వారైనను వారికి నే కారకత్వములు గలవో యా కారకత్వము నందును నే భావములకు నాధిపత్యముగలదో యా భావము లందును నుచ్చనీచగుణములు గనబడును. నీచగ్రహము కేంద్ర కోణములందుండిన పైనిజెప్పిన నైచ్యము చాలవరకు దగ్గును. శుభగ్రహములుండిన శుభము హెచ్చును. గనుక పారాశరుడు, శ్రీపతి, వరాహమిహిరుడును నుచ్చయందున్న గ్రహము రాజ యోగ మిచ్చుటేగాక నౌదార్యాది సుగుణములనుగూడ నిచ్చు నని నొక్కి వక్కాణించిరి. జైమినిమహర్షి "ఉచ్చనీచేతస్మిన్" అని చెప్పినప్పుడు నీచయందున్నగ్రహముగూడ నౌదార్యాది గుణ ముల నిచ్చునని చెప్పినట్లు కనబడుచున్నది. కాని ఈ యభిప్రా యము సరియైనదికాదు. ఈయన యభిప్రాయము యోగము నిర్ణ యించుటకు మాత్రమేనని యూహించవలెను. ఔదార్యాది సుగుణముల విషయములో వర్తించదు. ఉ। కన్యాలగ్నమునకు గురువు ఉచ్చలోనుండి ఏకాదశమందున్నను యోగించదు. అట్టి గురుడు మీనలగ్నమునకు ఏకాదశమందు నీచపడినను యోగిం చదు. ఈ మీనలగ్నమునకు పంచమమందు ఉచ్చలో నున్నను యోగించదు.

గురు రాహువులు కలిసినపుడును మరికొందరి మతమున గురు శనులు కలిసినపుడును గురు ఛండాలయోగమని చెప్పుదురు. అట్టి

గురుడు యోగము చేయడని తాత్పర్యము. అయినను కేంద్రాధి పత్యము పట్టిన గురుడు కేంద్రాధిపత్యములేని శనితో కలిసినపుడు శుభముచేయడని చెప్పినమాట వర్తించదు. అట్టి గురుశనులు కేంద్రమందు కలిసినను శుభయోగము చేయరు. ధనుర్లగ్నమునకు లగ్నమున శనిగురులు కలసిన మంచియోగము చేయుదురు.

లగ్నము లన్నిటిలో కుంభలగ్న మధమమని వరాహమిహిరుడు చెప్పెను. జైమిని దీనినంతగా పాటించినట్లు తోచదు. గాని వరాహ మిహిరుని యభిప్రాయమె సరియైనదని తోచుచున్నది. రవికుజులకు తప్ప తక్కిన గ్రహములకు నాధిపత్యదోషములు హెచ్చుగా గలవు. గొప్ప రాజయోగములు పట్టుట కవకాశములు తక్కువ. అంతేగాని పట్టవని చెప్పగూడదు. కొలిచి తేటలు రాణించవని చెప్పవలెను. గురునకు కేంద్రాధిపత్యము పట్టక కేతువుతో కలిసి కేంద్రకోణములం దున్నయెడల నిద్దరును యోగము నిచ్చెదరు. కేంద్రాధిపత్యముపట్టిన గురుడు తృతీయవ్యయములందు కేతువుతో కలిసియున్నపుడు గురుకేతువు లిద్దరును ప్రబలయోగకారకు లగు దురు. అందు కేతువు మరింత యోగము నిచ్చును. పై విధముననే బుధకేతువులకును జూడవలెను.

కేతువు ద్వితీయమందున్న ధనయోగము నిచ్చును. తృతీయ వ్యయములందున్నను మంచియోగము నిచ్చును. ఏకాదశమునం దంతయోగము చెప్పరాదు. శుక్రకేతువులు కలియుట మంచిది కాదు. వీరు షష్టాష్టమవ్యయములందైనను, శనిక్షేత్రములందైనను కలియుట మంచిదికాదు.

వృషభలగ్నమునకు మాత్రము కేంద్రాధిపత్యము పట్టిన రవి కోణాధిపత్యము పట్టిన బుధునితో నెక్కడ కలిసినను శుభము నీయుడు. ఇది యనుభవముచేత జెప్పినమాట. రవి బుధులు విశే

విశేగా నుండుటయే మంచిది. ఈ లగ్నమునకు రవి శనులు గలి
యుట మంచిది. రవి, శనిక్షేత్రములలో గలిసిన నత్యంత శుభము.
వీరికి కేంద్రస్థితియైనను జెడుగు చేయరు. యోగభంగము రాజాలదు.
ఈ లగ్నమునకు రవి సింహాసనమును, శని మకర కుంభములలో
నెక్కడనున్నను మంచియోగము గలుగును. గురుడు తృతీయా
ష్టమములందున్నను, వాని కే యాధిపత్యములున్నను శుభమును
జేయును. శుక్రుడు ద్వితీయషష్టములందు యోగము నిచ్చును.

రాహువు 4, 7, 9, 10, 11 స్థానములందు యోగమునిచ్చును.
షష్టాష్టమములందును మంచియోగ మిచ్చును. లగ్నము మొదలు
కొని యష్టమమందుగాని, చంద్రున కష్టమమందుగాని రవియున్న
జాతకుడు పౌరుషవంతుడును, ఆయుర్దాయముగలవాడు నగును.
ఇది బాలారిష్టమునకు భంగయోగముగా జెప్పవచ్చును. రవి చంద్రు
లకు షష్టాష్టమస్థితి చాలమంచిది.

తులాలగ్నమునకు లగ్నవ్యయములందున్నపుడు తప్ప శనియోగ
కారకుడు కాడు. శనిశుక్రులు యోగకారకులైనపు డస్తంగతు
లైనను యోగమునిచ్చెదరు. అనగా నస్తంగతులైనను శనిశుక్రులు
బలవంతులే. శని ఋజుగతిలో నున్నపుడు బలవంతుడు. కుజుడు
శత్రుక్షేత్రములోనున్నను బలవంతుడె. నైసర్గికశుభులు శుక్ల
పక్షమునందును, నైసర్గికపాపులు కృష్ణపక్షమునందును బల
వంతులు గాని నైసర్గికశుభుడైనను గురుడుమాత్రము కృష్ణపక్షము
నందు బలవంతుడు. క్షీణచంద్రుడు పాతికపాపుడు అటులే పాప
యుతుడైన బుధుడు పాతికపాపి, సూర్యుడర్థపాపి, కుజుడు ముప్పా
తికపాపి, శనిరాహువులు పూర్ణపాపులు. ఇవి నైసర్గికపాపత్వములు
ఆధిపత్యముచేత నైసర్గికశుభులకును, పాపులకునుగూడ నైగా పాప
త్వము సిద్ధించును. క్షీణచంద్రునకు కేంద్రాధిపత్యము పాతిక

పాపము. అటులే పాపయుక్తుడైన బుధునకును, పాపయుక్తుడు కానపుడు కేంద్రాధిపత్యము పట్టిన బుధు డర్థపాపి. శుక్రుడు కేంద్రాధిపత్యమున ముప్పాతిక పాపి. గురు పూర్ణచంద్రులు, పూర్ణ పాపులు.

ద్వితీయమునందున్న గురుడు ధనయోగము నిచ్చును. ద్వితీయ మందున్న శనివలన మంచివాక్కును, కపటత్వమును కఠినహృదయమును పూర్వవిద్యలం దభిలాషయు నుండును. రాజ్యకేంద్రాధిపత్యము పట్టిన గురుడు తృతీయమందున్న యోగమునిచ్చును. భాగ్యాధిపత్యముపట్టిన గురుడష్టమమందున్నను యోగమునిచ్చును. ఇతర నైసర్గికశుభు లీయజాలరు.

మీనలగ్నమునకు శనిశుక్రులు గలిసిన మంచి రాజయోగము. అష్టమభాగ్యాధిపతులుగాని, షష్ఠమభాగ్యాధిపతులుగాని కలిసి నపుడు షష్ఠాధిపతియు, అష్టమాధిపతియు యోగము నిచ్చెదరు. భాగ్యాధిపతిదశ సామాన్యముగ నుండును. అటులే రాజ్యలాభాధిపతులు గలిసినపుడు రాజ్యాధిపతిదశకంటె లాభాధిపతిదశ ప్రబలముగ నుండును. బుధుడు తృతీయమందుండిన జాతకుడు పిరికి వాడును, కేతువుతో కూడిన పౌరుషవంతుడు నగును. నైసర్గిక పాపులు తృతీయషష్ఠములందున్న జాతకుడు పౌరుషవంతుడగును ఈ తృతీయ షష్ఠములందు నైసర్గిక పాపులు సమముగా నున్న యెడల మంచి రాజయోగముకూడ పట్టును. సప్తమమందు శుక్రుండిన కళత్రహాని, గురుడు బలహీనుడై పంచమ నవమములం దున్నయెడల నల్పాయుష్మంతులగు పుత్రులు గలుగుదురు, లే గొంతకష్టము చెప్పవలెను. శని యష్టమమందున్నయెడల ప్రబల మారకుడై యితరులను జంపనీయక తానే చంపును. ఈ శనిద [illegible] త్రి[illegible]మందు వచ్చిన చంపును. ద్వితీయమందైన [illegible]

మందు గలిసిన మంచియోగము. ఈ లగ్నమునకు రవితో కలియని బుధుడు తృతీయమందు మంచివాడు.

కుంభలగ్నమునకు రవిబుధులు పంచమమునందును, గురుడేకాదశమందు నుండినపుడు గురుకృత సామూహ్యముగా నుండి రవి బుధ దశలు ప్రబలయోగము చేయును.

ఈ గ్రంథమున వ్రాయబడిన గ్రహబలాధ్యాయములోని యోగములున్ను, రాజయోగాధ్యాయములోని యోగములున్ను అనేక వేల విషయములు నేను వ్రాసిన యోగావళీఖండము రెండవ భాగమున విపులముగా వ్రాయబడినవి.

రాజయోగాధ్యాయము

సంపూర్ణము.

## మోక్షభావాధ్యాయము

వ్యయాధిపతి నైసర్గికశుభుడై శుభరాసులలో నున్నయెడల జాతకునకు సుఖపూర్వ మరణము. మరణానంతరముగూడ కీర్తి గలవాడగును. వ్యయాధిపతి గురుడై వ్యయమందేయుండిన నీశ్వర భక్తుడును, సద్బుద్ధిగలవాడును, పిత్రులోకము పొందువాడును, సత్కీర్తితో మరణించువాడునగును. వ్యయాధిపతి గురుడై కేంద్ర కోణములందున్నను సత్కీర్తిగలవాడును మంచిలోకములకు బోవు వాడు నగును. వ్యయాధిపతి గురుడై తృతీయ షష్టాష్టమములం దున్నయెడల కొంత అపకీర్తి గలవాడగును. లాభమందున్న యెడల మంచికీర్తి గలవాడు మంచిగతులు గలవాడు నగును.

శుక్రుడు గురుకేతువులతో గలియక నితరగ్రహములతో గలిసి నను, షష్టాష్టమవ్యయములలో నున్నయెడల నపకీర్తితోను,

క్తితోను మరణించును. గాని వ్యయమందు శని గురు కేతువు
ఎవరున్నను వైనజెప్పిన యోగమునకు భంగముగలిగి
క్తితో బోవును.

వ్యయాధిపతి శుక్రుడై వ్యయమందుండిన వేశ్యావకోరికలు గల
ధనకాముల గాంక్షలతో మరణించును. ఈ శుక్రుడు
నితోగాని కేతువుతోగాని గలిసి కేంద్రములందుగాని కోణము
గాని వ్యయమందుగాని లగ్నమందుగాని యుండిన వైని
న యోగము కలుగదు. మోక్షము కలుగును. శుక్రకుజులు కలిసి
చెప్పిన స్థానములలోనుండిన నధికారకాంక్షలతో బోవును. రవి
లుగలిసిన విదేశఫలితము. శనిశుక్రులు గలిసిన మనస్సంతుష్టితో
ను. శుక్ర రాహువులు గలిసిన పిశాచజన్మము గలుగును.

వ్యయాధిపతి బుధుడై వ్యయ కేంద్ర కోణములందు యున్న
ల శివభక్తిగలవాడై మంచిలోకమునకు బోవును. ఈ బుధుడు
గురు, కేతువులలో నెవరితోనైన గలిసి తృతీయ షష్టాష్ట
ములలోనున్న మిశ్రఫలము చెప్పవలెను. ఈ బుధుడు నైసర్గిక
లైన రవికుజులతో గలిసి కేంద్రకోణములందుగాని యేకాదశ
గాని యున్నయెడల సూర్యోపాసకు డగును. పుణ్యకార్య
చేయువాడు నగును. ఈ బుధుడు రవి, కుజులతో గలిసి
షష్టాష్టమములందున్నయెడల విపర్యయముగా జరుగును.
క పాపులు వ్యయాధిపతులై వారికి నైసర్గిక శుభులు సంబం
గలిగి కేంద్రకోణ లాభములందున్న సునాయాస మరణ
బొందును. భక్తిగలవాడు నగును. వ్యయాధిపత్యము పట్టిన
క పాపులు కేతువుతప్ప, నితర నైసర్గిక పాపులతో గలిసి
మందుగాని తృతీయ షష్టాష్టమములందుగాని యున్నయెడల
డు అంత మంచికీర్తి గలవాడు కాడు.

ఏ లగ్నమునకైనను వ్యయమందు శనికేతువులలో నెవరున్నను మోక్షముగలుగును. వైష్ణవక్షేత్రములలో గురుబుధులు సప్తివారే. శుక్రచంద్రులతో నెవరున్న మోక్షము చెప్పకూడదు. లగ్నమునకు ద్విస్వభావరాశియైయుండుట అనగా ఏకాదశమందు రవి, వ్యయమందు కుజుడున్నయెడల మోక్షప్రాప్తి యగును. కేతువు లాభాధిపతితో కలిసినచో మోక్షప్రాప్తి గలుగును. ఒకకుజుడుమాత్రము వ్యయమందున్నయెడల మోక్షప్రాప్తి చెప్పకూడదు. రవి భాగ్యమందున్నయెడల సన్యాసకారు.

మోక్షభావాధ్యాయము
సంపూర్ణము.

## నైర్యాణికాధ్యాయము

అష్టమాధిపతినిబట్టియు, అష్టమమందున్న గ్రహములనుబట్టియు మరణస్వభావమును నిర్ణయింపవలెను.

వీరిలో నెక్కువ బలవంతులలో వారికి చెప్పబడిన ధాతుప్రకోపమువలన మరణము నిర్ణయింపవలెను.

రవికి పైత్యము, చంద్రునకు వాతశ్లేష్మములు. గురునకు శ్లేష్మము, కుజునకు పైత్యము, బుధునకు వాతపిత్తశ్లేష్మములు, శుక్రునకు వాతశ్లేష్మములు, శనికి వాతము.

మరియు వారికి చెప్పబడిన భూతములవలనగాని, రోగములవలనగాని మరణము గలుగును.

రవికి :—అగ్ని, దాని సంబంధము.

చంద్రునకు :—జలసంబంధము, రాజయక్ష్మ మొ॥

[illegible] :- కేశి. [illegible], [illegible] మొ॥ చర్మవ్యాధులు,
[illegible], [illegible] మొదలగునవి.

ధనుస్సు :- [illegible] రోగములు, జ్వరాదులు, [illegible] సంబంధము.

మకరకు :- తెలియబడని దీర్ఘవ్యాధులు.

[క్రొ]నకు :- దప్పి, ఉదరరోగము.

[మీ]నకు :- ఆకలి, వాతరోగము.

అష్టమమందు గ్రహములు లేనియెడల. జన్మద్రేక్కాణమునకు [ఇర]వదిరెండవ ద్రేక్కాణమునకు నాధిపత్యముగల గ్రహముయొక్క [స్వభావ]ము ననుసరించి మరణము గలుగును. అనగా సప్తమాధిపతికి [గా]ని పైనిజెప్పిన ద్రేక్కాణాధిపతికిగాని యష్టమమందున్న గ్రహ[ము]నకుగాని, షష్ఠాష్టమ వ్యయాధిపతులతోగాని, నైసర్గికపాపు[లతో]గాని సంబంధము గలిగినపుడు పాపత్వమునందు బలవంతులై[న] [వారి]కి సంబంధమైన ధాతుములజేతను, రోగములజేతను, బాధపడి [మర]ణమునొందును.

అటులే నైసర్గికశుభులతో గలిసిగాని, కేంద్రకోణములందుండిన[ను], గలిగినపుడు వారికిజెప్పిన ధాతుప్రకోపములజేత మరణము [గలు]గును. అయినను బాధపడక ననాయాసమరణము గలుగును. [అష్ట]మాధిపతి పూర్ణజలరాసులందుండిన జలసంబంధములగు రోగ[ము]లవలనను, గండమువలనను మరణము గలుగును. ఈ యోగము [...]దకుజులకు నిశ్చయముగ జెప్పవలెను.

కర్కట మీనములు పూర్ణజలరాసులలో ముఖ్యములు.

గ్రహములకు గర్కట మీనములు జలగండ రాసులలో [ము]ఖ్యములు.

[illegible]

మీన కర్కాటకములయందున్న యెడల జలగండమునకు బల వంతుడు. ఈ యష్టమ ద్రేక్కాణాధిపత్యము కుజచంద్రులకుబట్టి వీరు కర్కాటక మీనములలోనుండిన జలగండముచే మరణము తప్పదు. అటులే మీన కర్కాటకములు చతుర్థదశమములలో నొకటై యందు చంద్రకుజులలో నెవరుండినను జలగండము. కుజు నకు జతుర్థమునకంటె దశమము బలమెక్కువ. అష్టమాధిపతి రవి కుజుల సింహములో నున్నప్పుడు జాతిదెబ్బవల్లను అగ్నివల్లను, స్ఫోట కాదులవలనగాని గండము. కుజునివలన రహస్య ప్రదేశములలో గ్రిమిసంబంధమైన రోగములవలన గండము. బుధునివలన బంధువుల చేతను, స్ఫోటకాదివ్యాధులచేతను గండము. శుక్రునివలన శత్రు వులచేతను, రాజకీయ వ్యవహారములచేతను, స్త్రీలచేతను నతి శ్రమము మొదలగువానిచే గలుగు రోగములచేతను గండము. శనివలన జ్వరాదులచేతను, వాతరోగములచేతను అకాలమరణము గలుగును, బృహస్పతివలన శ్లేష్మసంబంధమైన రోగములచేతను ఉపాసనము వలనను మరణము.

మరణానంతరమునందు జీవుని యవస్థ

షష్ట సప్తమాధిపతులనుబట్టిగాని యా స్థానమందున్న గ్రహ ములనుబట్టిగాని యనగా వీరియందలి బలాధికగ్రహమునుబట్టి జీవునకు వారికిజెప్పిన లోకములు కలుగును.

బృహస్పతిచే దేవలోకము, శుక్రచంద్రులచే పితృలోకము, రవి కుజులచే తిర్యగ్లోకము శని బుధులచే నరకము గలుగును.

ఏ జాతకమునకైన నరకకారకులైన శని బుధులు పాపులై యుండినను, జాతకములో గురు డుచ్చయందుగాని, ధనుర్మీనము లందుగాని యుండినను శని బుధులలో నెవ్వరైన గురుని రాసు లందుగాని, గురు నవాంశలయందుగాని యుండినను ఈ గురుడు

బలవంతులైన శని బుధుల యిండ్లలో నుండినను నరకయోగము కలుగక మంచిలోకములు కలుగును.

పైని జెప్పిన మరణస్వభావమునకు గారకులైన గ్రహములకు చరస్థిరద్విస్వభావరాసులలో దేనికి నాధిపత్యము కలుగునో యట్టి రాసులలో నున్నప్పుడు మిగుల బలవంతులు.

ఉదా॥ రవి స్థిర రాశికి (అనగా సింహమునకు) అధిపతి.

ఆ రవి స్థిరరాసులగు వృషభ, సింహ, వృశ్చిక, కుంభరాసు లందున్నపు డెక్కువ బలవంతుడు.

ఒకే గ్రహమునకు చరస్థిరములకు నాధిపత్యముగలిగినయెడల నా గ్రహము చరస్థిరములలో నెందున్నను సమాన బలవంతుడు.

ద్విభావరాసులకు మాత్రమే నాధిపత్యముగల బుధ గురులు ద్విస్వభావరాసులందున్నపు డెక్కువ బలవంతులు. అటులే చంద్రు డొక్క చరరాశికే యధిపతి గనుక మేష, కర్కాటక, తుల, మక రములందెక్కువ బలవంతుడు.

మరణహేతువులకు నీ బలమునుగూడ నాలోచించవలెను. రాసులయొక్క త్రైవిధ్యమునుబట్టి చరస్థిర ద్విస్వభావరాసులనుబట్టి మరణమునకు దేశనిరూపణము జేయవచ్చును.

మరణకారక గ్రహములు చరస్థిరరాసులలో స్థితినిబట్టిగాని, చరస్థిరద్విస్వభావరాసులయాధిపత్యమునుబట్టిగానిబలానుసారముగ

1. చరరాసియందున్నయెడల నితర దేశములలోను

2. స్థిరరాసిస్థైన స్వగ్రామమందును,

3. ద్విస్వభావరాశిస్థైన కేవలము స్వగ్రామముగాక దానికి సమానమైన నితరగ్రామమునందు మరణము నొందును.

ఈ నిర్ణయము మరణకాలమునందలి దశాంతర్దశావిదశలనుబట్టి యోచించవలెను.

నైర్యాణికాధ్యాయము—సంపూర్ణము.

# శ్రీ జాతక నారాయణీయము

## ప్రథమ ఖండము

### స్త్రీజాతకాధ్యాయము

స్త్రీజాతకమునకు లగ్నమునుబట్టి యంగసౌష్టవమును, చతుర్థమునుబట్టి ప్రవర్తనయు, పంచమమునుబట్టి సంతానమును, ప్రసవస్వభావమును, సప్తమమునుబట్టి కళత్రమును, అష్టమమునుబట్టి సౌభాగ్యమును తెలుసుకొనవలెను. అష్టమము సౌభాగ్యస్థానము గనుక ద్వితీయమందున్న గ్రహములు అష్టమస్థానమును జూచును. గనుక సౌభాగ్యవిషయములో ద్వితీయమందున్న గ్రహములను గూడ నాలోచించవలెను. స్త్రీజాతకమునకు విశేషమేమనగా, పంచమమునుబట్టి ప్రసవవేదన నిరూపించవలెను. అష్టమము ఆయుస్థానమేగాక సౌభాగ్యము తెలుసుకొనుటకును నుపయోగించును. అనుభవమునుబట్టిచూడగా పురుష జాతకమునకును, స్త్రీజాతకమునకునుగూడ చతుర్థస్థానమునుబట్టియే ప్రవర్తన తెలిసికొనవలెను. స్త్రీజాతకమునకు సౌభాగ్యస్థానమగు నష్టమమందు పాపగ్రహము లుండగూడదు. గ్రహవర్జితమైయుండుట నుత్తమము. అట్లే ద్వితీయమందును పాపగ్రహము లుండగూడదు. అష్టమమందున్న పాపగ్రహదశ వచ్చినప్పుడు స్త్రీజాతకమునకు సౌభాగ్యనష్టము చేయును. అష్టమాధిపతి దశవచ్చినప్పుడు భర్త యాయుర్దాయమునుబట్టి నష్టమును నిరూపించవలెను. ద్వితీయస్థానమందున్న పాపగ్రహముల దశలును నట్టులే. సప్తమమందున్న పాపగ్రహ

ములు [illegible] లున్నచో, అష్టమస్థానమందున్న పాపులవలనను ద్వితీయ మునకు, పాపులుండిన వస్త్రనాశమును [illegible] కలుగు చేయును,

అష్టమస్థానము మాంగల్య [illegible] సౌభాగ్యస్థానము. దీని [illegible] మొదలగు మాంగల్యశుభ త్వము సౌభాగ్యమును [illegible] చేయవచ్చును.

సౌభాగ్యస్థానమునకు లాభస్థానము, భాగ్యస్థానపతిగాని [illegible]. దీని మాంగల్యశుభత్వముల శ్రేష్ఠత్వము, దీని మాంగల్యవృద్ధి [illegible] యొకల [illegible] మాంచిది. కని లాభాధిపతియైనను సౌభాగ్యహీనము చేయును. సౌభాగ్య స్థానాధిపతి యోగాదశయందున్న సౌభాగ్యవృద్ధి. స్త్రీజాతకములో సౌభాగ్యము కనపడనియెడల పురుషజాతకములో నాయుర్దాయము కనపడినను నా ఆయుర్దాయమును క్షీణింపజేసి స్వల్పారిష్టములు ప్రబలములై పురుషునకు మారకము జేయును. స్త్రీజాతకమునకు గల శుభాశుభయోగములు భర్తకు జెప్పవలెనని ఋషుల యభి మతము. ఇందలి సాంప్రదాయ మేమన లగ్న సప్తమాష్టమములను బట్టి భర్తకు నాయుర్దాయమును నిర్ణయించి స్త్రీజాతకమునందలి శుభాశుభయోగములు భర్త అనుభవించుటకు నవకాశమున్న యెడల భర్త, అది లేనియెడల స్త్రీకిని జెప్పవలెను.

స్త్రీకి తన జాతకమునుబట్టి సౌభాగ్యము తక్కువగాను, ఆయు ర్దాయముగూడ తక్కువగా నుండుటయును భర్తజాతకములో భర్త కాయుర్దాయము విశేషముగాను ద్వికళత్రయోగముండుటయును, గలిగినప్పుడు భర్త జాతకములోని ద్వికళత్రయోగము ప్రబలమై స్త్రీకి మారకము జేయును.

ఈ యోగము భర్తజాతకములో ద్వికళత్రయోగము పట్టక పోయినను జరుగును. భర్తజాతకములో ద్వికళత్రయోగమున్న

నాయుర్దాయమునుబట్టి స్త్రీజాతకములో స్త్రీకి సంచి యాయుర్దాయమును సౌభాగ్యనష్టమును గనుపించినప్పుడు ముందు భర్తకు నష్టమునుజేసి తరువాత స్త్రీకి మారకమునుజేయును.

స్త్రీజాతకములో లగ్నమందు కుజునుండి శని కేతువులలో నొక నష్టమునందును ఒకడు ద్వితీయమందున్న యెడల చిన్నతనములోనే వైధవ్యము ప్రాప్తించును. ఏ లగ్నమునకైనను లగ్నమందున్న గ్రహమునుబట్టి లగ్నాధిపతినిబట్టి, స్త్రీపురుష జాతకములకు రూపములను నిర్ణయించగూడదు. గాని పరాశరమతమునుబట్టి లగ్నమునను సరించియే రూపమును నిర్ణయించుచున్నారు. నవాంశమును బట్టి వరాహమిహిర సత్యాచార్య యవనాదులు రూపము నిరూపించుచున్నారు. ఇదియును గాక ద్రేక్కాణమునుబట్టికూడ గొందరు నిరూపించుచున్నారు. అనుభవమునుబట్టిచూడ లగ్న నవాంశాధిపతు లెవరితో గలిసియుందురో నెవరియింట నుందురో వారినిబట్టి వర్ణముండునని తెలుచన్నది.

శ్లో॥ ఏనయుక్తో ఏనదృష్టో యుదం శేవా స్థితన్స్వయం ।
ధారాధీశస్తుతద్వర్ణం కళత్రంలభతే పుమాన్ ॥"

అని చెప్పబడినది.

స్త్రీజాతకమునకు శని కుజులు ప్రవర్తనవిషయములో జెడ్డ గ్రహములు. అనగా రెండుగ్రహము లెంత పాడయిన నంత చెడ్డ ప్రవర్తన యుండును. శనికుజులు బలహీనగ్రహముల నంశలయందుండిన యెడలను బలహీనులతో గలిసినను పాపస్థానములగు షష్టాష్టమవ్యయములందున్నను నీచపడినను నస్తంగతులైనను చెడు ప్రవర్తన గలుగును.

వీరికి నైసర్గికశుభుడైన గురుసంబంధముగాని, నైసర్గిక పాపుడైనను కేతువు సంబంధముగాని, చెడుప్రవర్తనమునకు ప్రతిబంధ

కము, శుక్రచంద్రుల సంబంధము నిశ్చయముగ జెడుప్రవర్తన గలిగించును. శనికుజులు బలహీన అంశములలో నున్నను నస్తంగతులైనను స్త్రీజాతకమునకు జన్మవ్యాధి కలుగును. గురుని అంశలలో నున్న పుత్ర సంతానవృద్ధి, శని యంశలో నున్నయెడల భర్తను నిందించునదియును బుధ శుక్ర చంద్రాంశలలో నున్న యెడల సౌభాగ్యమువంతురాలును నగును. శని కుజులు బలహీనాంశలయందున్నయెడల చీల కుష్ఠువ్యాధికలది యగును. చంద్ర దృష్టి నిశ్చయము చేయును.

స్త్రీజాతకమునకు లగ్నాత్తు చతుర్థమున నైసర్గికశుభుడగు గురుదుండినయెడల మంచి అంగసౌష్ఠవముకలది అగును. ఈ గురునకు చతుర్థము శుక్రక్షేత్రము అయినయెడల స్త్రీ అతికామవతి యగును. ఈ గురుడు శుక్ర శని నవాంశములయందున్నను ఈ యోగము చెప్పవలెను. గురుడు చతుర్థమందు ఉండక పై విధము అనగా శని శుక్ర నవాంశములయందున్న ఈ యోగము చెప్పబడును. సాధారణముగా స్త్రీ జాతకమునకు చతుర్థమున గ్రహవర్జితమైయుండుట ప్రశస్తము, నైసర్గికశుభు లుండుట మంచిదికాదు. చతుర్థమందు నైసర్గికశుభు లున్నను శనిదృష్టి ఉన్నయెడలమంచి సుగుణవంతురాలగును. ఈ చతుర్థమున నైసర్గికపాపు లుండినయెడల మంచిగుణములు కలది యగును. చతుర్థమునందు శుక్రుడుండుట మిక్కిలి చెడుగు, చతుర్థమందున్న నైసర్గికశుభులకు చంద్రసంబంధము వలనను, నైసర్గికపాపుల సంబంధమువలనను కొంతదోషము హరించును.

స్త్రీజాతకమునకు కుజదోషమును నిర్ణయించునప్పుడు సాధారణముగా కుజుడు వానికి దోషముగా చెప్పబడిన, 1, 2, 4, 7, 8, 12 స్థానములలో ఉన్నాడా యను అంశమును మాత్రమే పురుష

జాతకమువలెనే వ్రాయుచున్నారు. ఈ వాడుక మన తెలుగు దేశమునందేగాక, తమిళ, కేరళ, కర్ణాటక దేశములందును వాడుకలో గలదు. కాని సర్వత్రా స్త్రీజాతకమున వర్తించదు. ఇందుకే కారణము పరాశరమహర్ష్యాదులు స్త్రీజాతకమునుగురించి ప్రత్యేకముగ వ్రాయుచు ఈ విషయమును చక్కగా చెప్పినారు. స్త్రీకి సౌభాగ్యస్థానమున నైసర్గికపాపగ్రహములగు రవి, కుజ, శనులున్నను ద్వితీయమునందున్న నైసర్గికశుభులవలన (అనగా) ద్వితీయమునందున్న గురు శుక్ర బుధ పూర్ణచంద్రులవలన స్త్రీకి సౌభాగ్యనష్టము కలుగదని వారి అభిప్రాయము. జైమినిమతము వలెనే వారున్నూ, అష్టమమందున్నవారికి ద్వితీయమందున్న గ్రహము ప్రతిబంధకగ్రహముగా తీసుకొన్నట్లు కనిపించుచున్నది. ఇంకొక ముఖ్యవిషయ మేమనగా కుజుడు సౌభాగ్యస్థానాధిపతి యయి ఆ స్థానమందున్నయెడల కుజదోషము చెప్పకూడదు. అప్పుడు ద్వితీయమందు నైసర్గికశుభులున్నయెడల అసలే కుజ దోషము లేదు. ఒకప్పుడు భర్త జాతకములో ఆయుర్దాయము లేక మరణించినను అది కుజదోషముక్రింద రాదు. స్త్రీజాతకములో ఉపపదాత్తు ద్వితీయ సప్తమాష్టమములలో పాపగ్రహము లున్న యెడల భర్తనష్టమేగాక ఒకప్పుడు రెండవ వివాహ మగుటయును గలదు. ఈ ద్వితీయాష్టమములలో రాహుకేతువులుండి, శని కుజు లలో నెవ్వరున్నను ఈ యోగము చెప్పవలెను.

స్త్రీకి ప్రసవవిషయమునుగురించి చూచునప్పుడు లగ్నాత్తు పంచ మమునుబట్టి చూడవలెనని పైని చెప్పినాను. ఈ పంచమమునకు నైసర్గికశుభుడైన గురునిస్థితిగాని, దృష్టిగాని కలిగినచో స్త్రీ చాల సులువుగా ప్రసవించును. ఇతర శుభగ్రహముల సంబంధముకూడ మంచిదే. ఒకప్పుడు ఆ స్థానమునకు నైసర్గికశుభుల సంబంధ

మున్నకు ప్రసవము పాపగ్రహ దశాంతర్దశలలో జరిగిన యెడల కొంతవరకు క్లేశము ఎక్కువగా నుండవచ్చును.

## స్త్రీజాతకాధ్యాయము
## సంపూర్ణము

# ప్రత్యేక యోగాధ్యాయము

కారకసంజ్ఞ :—వరాహమిహిరాదుల మతమున కారకు డనగా గ్రహము స్వక్షేత్రగతుడై యా స్వక్షేత్రము కేంద్రమైన యెడల నా గ్రహమునకు కారకత్వము కలుగును. ఇట్టి కారక గ్రహములు రెండుమూడు జాతకమునందున్నపుడు లగ్న కేంద్రమందున్న వాని కంటె చతుర్థకేంద్రమందున్న వాడును, వానికంటె సప్తమమందున్న వాడును వానికంటె దశమమందున్న వాడును బలవంతుడు. వీరిలో వీ రొకరికొకరు కారకు లగుదురు. వీరు మంచి రాజయోగ మిచ్చెదరని చెప్పిరి.

మరికొందరి మతమున బలాధిక కారకగ్రహమునకు కేంద్ర కోణములందు పంచమ రాజ్యాధిపతులుగాని, భాగ్య రాజ్యాధిపతులుగాని, యితరయోగ కారకగ్రహములుగాని కలిసియైన గలియక నుండినయెడల మంచి రాజయోగ మిచ్చెదరు.

జైమినీమతమున కారకుడనగా దొమ్మిది గ్రహములలోను భాగాధికగ్రహము; భాగాధికగ్రహ మనగా నే గ్రహము తా నున్న రాశిలో నధిక భాగములు భుక్తిగలుగునో యది భాగాధిక గ్రహము, భాగాధిక గ్రహమంశలో నే రాశియందుండునో యది కారకాంశలగ్నము. కారకలగ్న మనబడును. ఈ కారక లగ్న

మునుబట్టి జైమినిమహర్షి తన జ్యోతిషశాస్త్రమును గుణించెను. జన్మలగ్న మితరుల కెంత ప్రాముఖ్యమో యీ మహర్షికి గారక లగ్న మంత ముఖ్యము.

ప్రత్యేక యోగము లనగా నాధిపత్యసంబంధము చేతగాక కొన్ని గ్రహములను మాత్రము తీసికొని యా గ్రహముల సంయోగము చేతను స్థితినిబట్టియును కొన్ని యోగములు కట్టి వానికి గొన్ని పేర్లు పెట్టిరి. ఇవి యనేకములున్నను నందు ముఖ్యమైనవియు, త్రిమత ములవారు నంగీకరించినవియు, ననుభవముచేత సరిపోవుననియు నగు కొన్నియోగములను ప్రత్యేకయోగములుగ నిందు జేర్పఁబడినవి.

1. బుధాదిత్యయోగము — రవిబుధులు గలియుట, రవిబుధులు సామాన్యముగ గలియుచునేయుందురు. అట్టి వీరియోగము ప్రత్యేకయోగముగ నేలజెప్పిరి? ఈ రవిబుధు లెక్కడగలిసినను యోగమని వారి యభిప్రాయము కాదు. వీరికి స్వక్షేత్ర, ఉచ్చ, మూల త్రికోణరాసులగు మేష, మిథున, సింహ, కన్యలలో వీరు కలిసినపుడు బుధాదిత్యయోగమని పరాశర్యాది మతము. కొందరి యభిప్రాయమున నష్టమమందు గలిసినపుడే యీ యోగము. మరికొందరు ద్విస్వభావరాసులలో గలిసిన నీ యోగము అనిరి గాని యనుభవమునుబట్టిచూడగ రవికి గోణాధిపత్యమును, బుధునకు కేంద్రాధిపత్యమును బట్టక, మేష, మిథున, సింహ, కన్యలలో నెక్కడ గలిసినను నీ యోగఫలములు జరుగుచున్నవి. ఇట్టియోగ మున బుట్టినవారు కీర్తివంతులును, ఐశ్వర్యవంతులు నగుదురు.

2. అధియోగము :—ఇది మూడుమతములవారును నెక్కువగ వర్ణించియున్నారు. ఇందు మతభేదములు లేవు. చంద్రునకు షష్ట సప్తమాష్టమములందు నైసర్గికశుభగ్రహము లన్నియు గలిసిగాని,

కలియుండక గాని యున్న యెడల నధికయోగమగును. ఈ యోగమున బుట్టినవారు ప్రభువులు, మంత్రులు, సేనానాయకులు అగుదురని వరాహమిహిరాచార్యులు చెప్పిరి గాని ప్రస్తుత కాలమున నీ యధి యోగమున బుట్టినవారు కీర్తివంతులును, పౌరుషవంతులును, ఐశ్వర్యవంతులు నగుచున్నారు. చంద్రునకు షష్ఠ సప్తమాష్ట మములందున్న నైసర్గికశుభుల దశలు వచ్చినపుడు యోగము నిచ్చెదరు. నైసర్గికశుభులందరు యీ మూడు స్థానములలోనే యుండి మిగిలిన గ్రహములు ఇతర రాసులయందున్న యెడల నధి యోగము కానేరదు. నైసర్గికశుభగ్రహము లన్నియు నీ మూడు స్థానములలో నిమిడియున్నను, నీ మూడుస్థానములలో నెక్కడ నైన నొక నైసర్గిక పాపగ్రహమైన నున్న యెడల నధియోగమునకు భంగము.

3. కేమద్రుమయోగము :— పారాశర్యములో లగ్నాధిపతి నీచ యందుండి లగ్నాధిపతి ఏ నవాంశమందుండునో యందు షష్ఠా ష్టమాధిపతు లిద్దరు నున్న యెడల కేమద్రుమయోగముగ జెప్పిరి. కొందరి మతమున రవి, శని, చంద్రులు గలిసి కేంద్రములందుండి రాజ్యాధిపతి వ్యయమందును, వ్యయాధిపతి ధనమందు నున్న యెడల కేమద్రుమయోగము. మరికొందరి మతమున జన్మలగ్నము మొదలు నాలుగు కేంద్రములందును గ్రహములు లేక చంద్రుడే గ్రహము తోను గలియకనున్నచో కేమద్రుమము. మరికొందరి మతమున ధన భాగ్య లాభాధిపతులు వ్యయమందుండిన కేమద్రుమము గాని చంద్రునకు ద్విర్ద్వాదశములందు సూర్య వ్యతిరిక్త గ్రహములలో నెవ్వరును లేనియెడల కేమద్రుమమని వరాహమిహిరుని మతము. జైమిని యీ మతముల నెల్ల నతిక్రమించి వేరుగ కేమద్రుమమును నిరూపించెను. జన్మలగ్న, ఆరూఢలగ్న, కారకలగ్నములకు తృతీ

యాష్టమములందు నైసర్గిక పాపగ్రహములు సంఖ్యయందు సమా
నముగా నుండిన కేమద్రుమమని వక్కాణించెను. ఈ మతము
సమంజసముగ తోచుచున్నది. ఈ యోగము కర్తరియోగము.

4. మాలికాయోగము :—ఏ జాతకమునకైన, లగ్నము
మొదలుకొనియైన, వ్యయము మొదలుకొనియైన సప్తగ్రహములు
వరుసరాసులలోనున్న మాలికాయోగము. ఈ యోగము స్వతంత్ర
యోగము కాదు. జాతకములో యోగములేనప్పుడీ యోగము
స్వతంత్రముగ యోగము చేయదు. కానిజాతకములో యోగమున్న
పుడు ఈయోగము దానిని ప్రబలముచేయును. లగ్నముతో గలియక
గ్రహములు వరుసగా నున్నను, మాలికాయోగము చెప్పకూడదు.

5. మాలాయోగము :—ఈ యోగము పరాశరులచే ప్రత్యే
కము చెప్పబడినది. ఇందు మతాంతరము లనేకము లున్నను
వరాహమిహిరుని మతము సమంజసమైనదగుట నిందుదాహరించు
చున్నాను. నాలుగు కేంద్రములందు శుభులుండిన మాలాయోగము.
ఇందు శుభులనగ నాధిపత్యశుభులని కొందరును, నైసర్గికశుభులని
కొందరు నూహించుచున్నారు. అనుభవమునుబట్టిచూచిన నైసర్గిక
శుభులును, నాధిపత్యశుభులును గూడనని తోచుచున్నది. మాలా
యోగమున బుట్టినవారు మంచి యాయుర్దాయము గలవారును,
భోగవంతులును, కీర్తివంతులు నగుదురు.

6. కేసరీయోగము :—చంద్రునకు కేంద్రమునందు బృహస్పతి
యున్న గజకేసరీయోగ మందురు. కొందరు గురుశుక్రులు సమ
సప్తమములలో నుండిన గజకేసరి యందురు. కొందరు గురుశుక్రులు
సమసప్తమములలో నుండిన గజకేసరి యందురు. ఇందు మొదటిదే
సమంజసము. ఈ యోగమున బుట్టినవారు ఆయుర్దాయవంతులు
నగుదురు. ఇదియును స్వతంత్రయోగము కానేరదు.

7. చంద్రమంగళయోగము :— ఈ యోగమునకు చంద్రకుజుల సమాగమము ప్రధానము. ఈ రెండు గ్రహములు మేష వృశ్చిక [illegible] కలిసిన ఈ యోగమగును. [illegible] రాసులలో [illegible] కలిసిన ఈ యోగ మగును. ఈ యోగ[illegible] యోగము[illegible] నను భవమునుబట్టి చూచిన చంద్రుడు పూర్ణచంద్రుడైనప్పుడు కేంద్రాధిపత్యదోషమును, కుజునకు కోణాధిపత్యదోషమును బట్టక అష్టమమందైనగాక పైని జెప్పిన రాసులయందు చెప్పట కలిసినను ఈయోగము పట్టునని తోచుచున్నది. ఈ యోగము స్వతంత్ర యోగము. ఈ యోగమున బుట్టినవారు మంచి ఐశ్వర్యవంతులును, కీర్తిమంతులును, ప్రాసంగికత గలవారు నగుదురు.

8. శనిచంద్రయోగము :—శనిచంద్రులు కేంద్రకోణాధిపతులై పాపరాసులగు మేష, సింహ, వృశ్చిక మకర కుంభములు కేంద్రములై యుండునప్పుడు ఈయోగము.

కొందరు కర్కాటక తులలుకూడ ఇందు జేర్చినారు. ఇదియు నొప్పినదే యగును గాని యనుభవమునుబట్టి చూచిన సప్తమ లాభాధిపత్యము శని చంద్రులకు నీ రాసులలో సమాగమము మంచిదని కనబడుచున్నది. రాజవంశములో బుట్టినవారికి సింహాసనాధిపత్యము కలుగుటకు శనికి రాజ్యాధిపత్యమును ఔదార్యాది గుణములు కలుగుటకు, శని యుచ్చస్థుడగుటయు, మేషలగ్నమునకు కేంద్రమగు తులయందు కలిసినప్పుడు కలుగును. అప్పుడు శనికి లాభాధిపత్యము దోషముగా నెంచనక్కరలేదు ఇది రాజవంశమువారికే. ఇతరులకు శని చంద్రు లీ విధముగ కలిసినయెడల శనిదశలో గొంత యువయోగము కలుగును.

కారణమేమన, చంద్రునకు కేంద్రాధిపత్య దోషమును, శనికి

లాభాధిపత్య దోషమును బట్టును. ఇట్లేగాక నైసర్గికపాపియగు శనికి గేంద్రస్థితియును, ఉచ్చస్థానముగూడ శుభముగా పరిణమించును. శని చంద్రయోగమున బుట్టినవారికి శనిచంద్రుల దశలలో మంచి రాజయోగమును, ధనార్జనము వాహనయోగము వ్యవహార నైపుణ్యమును గలుగును.

9. శ్రీమంతయోగములు :—పరాశరీయములో నూరు యోగములు చెప్పిరి. ఇవి ప్రత్యేకముగా రాజయోగములు కావు. వీనిని పరీక్షించి చూచిన కారకత్వ, ఆధిపత్యములకు ప్రాముఖ్యత యిచ్చినట్టు కానరాదు. కొన్నిగ్రహములను గొన్ని భావాధిపతులనుబట్టి యా భావములకు సరిపడిన యోగములను నిరూపించిరి గాని వీరి కితరగ్రహముల సంబంధమువలన నెట్టిమార్పులు గలుగునో యవి తీసికొనక గొన్నిగ్రహములను మాత్రమే లెక్కలోనికి దీసికొని యా యా యోగములు వ్రాసినారు. అందువలన నీ యోగములు జాతకములలో బట్టినను నా యోగములకు జెప్పిన ఫలితములు మాత్రము జరుగుటలేదు. ఇటులే వరాహమిహిరాదులును గొన్ని యోగములు జెప్పిరి. అవి యేవనగా,

1. ఏ జాతకమునందైన పైనిజెప్పిన రీతిగా గారకసంజ్ఞగల గ్రహములు గలుగుట.

2. రవికి ద్వితీయరాశి వేసిరాశియని పేరు. ఈ రాశియందు నైసర్గికశుభు లుండుట.

3. చంద్రున కష్టమమందు రవియుండుట లేక సూర్య చంద్రులకు షష్టాష్టమ మగుట.

4. చంద్రునకు ద్విద్వాదశమములందుగాని యొకదానియందు గాని రవ్యేతరగ్రహము లుండుట.

5. కేంద్రములు గ్రహశూన్యములుగా నుండకపోవుటను (ఒక కేంద్రమందైన).

6. దశమకేంద్రమందు నైసర్గిక పాపులగు రవి, కుజ, శను లుండకపోవుట మొదలగు కొన్ని ప్రత్యేక యోగములను, ఇవిగాక పదునెనిమిదివందలు (1800) నాభసయోగములను, కొన్ని చాంద్ర యోగములను జెప్పిరి. వీని ఫలితములు ప్రస్తుత కాలములో వారు చెప్పినంతవట్టుకు బట్టక సామాన్యస్థితి నుండునని తెలుపుదు.

జైమినిమహర్షి సూ॥ 'లాభేపదే కేంద్రత్రికోణే వా శ్రీమంతః' యనియును, 'వ్యయే సగ్రహే గ్రహదృష్టే వా శ్రీమంతః' యని యును ఈ మొదలగు గొన్ని శ్రీమంతయోగములు జెప్పెను. వీనికి నర్థములు, 1. జన్మలగ్నమునకు నారూఢలగ్నము, కేంద్రముగాని, కోణముగాని యైనయెడల శ్రీమంతుడగును. 2. ఆరూఢలగ్నమున కేకాదశమునందు గ్రహమున్నను జూచినను శ్రీమంతుడగునని యర్థము. పైని పేర్కొనిన పరాశర్యునియొక్కయు, వరాహమిహి రాదులయొక్కయు, యోగములన్నియు, జైమినీ మహర్షియొక్క శ్రీమంత యోగములవంటివే. వారు గొప్పయోగములుగ జెప్పినను ప్రస్తుతకాలములో జైమిని శ్రీమంతయోగములకంటె గొప్పవికావు.

విపరీత రాజయోగము

షష్టాష్టమ వ్యయాధిపతులు ముగ్గురును గలిసిన యోగము పట్టునని ఋషులందరును జెప్పిరి గాని కాళిదాసులుమాత్రము ఇంత మాత్రమున విపరీతరాజయోగము పట్టదనియు, వీరు షష్టాష్టమ వ్యయములలో నెక్కడనైనను గలిసిగాని, విడిగాగాని యుండిన యెడల బట్టుననియును జెప్పెను. ఈయభిప్రాయమే సరిపోవుచున్నది. గురుబుధశుక్రులకు షష్టాష్టమ వ్యయాధిపత్యములు గలిగినప్పుడు గురుడు షష్టమమునందు, బుధు డష్టమమందును, శుక్రుడు వ్యయ

మానును నుండిన యీ యోగము ప్రబలయోగమగును. గాని మకరలగ్నమునకు నీ యోగము అష్టమమందు బట్టినప్పుడు చాలవరకు యోగభంగము జరుగుచున్నది. నాస్థానమందు శుక్ర కేతు సమ్మేళనము యీ యోగమునకు భంగము. ఇది అనుభవములో చాలా జాతకములు పరిశీలించినతరువాత వ్రాయబడినది.

బాధక, వేధక, బంధక, ప్రతిబంధక యోగములు.

ఏ భావమునకైనను. ద్వితీయమందున్న గ్రహము బాధకగ్రహ మనబడును. తృతీయమందున్న గ్రహము వేధకగ్రహ మనబడును. చతుర్థమందున్న గ్రహము బంధకగ్రహ మనబడును. అష్టమమందున్న గ్రహము ప్రతిబంధకగ్రహ మనబడును. ఏ భావమునైనను ద్వితీయ, తృతీయమందున్న బాధక. వేధక గ్రహములు నైసర్గిక శుభులైనయెడల గొంతవరకు నాభావమునందు శుభము నిత్తురు, నైసర్గికపాపులైనయెడల శుభము నివ్వరు. నైసర్గిక పాపులకు స్వక్షేత్రమైనయెడల కేవలము పాపత్వము చెప్పగూడదు. ఈ యభిప్రాయము జైమినీమహర్షి గూడ "శుభార్గళాద్ధ్యాతుః" అనగా నే భావమునకైనను ద్వ్యేకాదశములయందు నైసర్గికశుభులున్న యెడల నా భావమునకు శుభమని చెప్పినాడు. ఈ యభిప్రాయము నమభవమునకును గూడ సరిపోవుచున్నది. చతుర్థమందున్నగ్రహము బంధకగ్రహముగ జైమినీమహర్షి కూడ వప్పుకొనయున్నాడు. ఈ గ్రహము నైసర్గికశుభుడైనయెడల శుభుడుగాను, నైసర్గికపాపుడైనయెడల పాపిగాను జెప్పినాడు. చతుర్థమందున్న గ్రహమును బట్టి వ్యవహారాది చిక్కులు గలుగును. జైమినీమహర్షి చదుర్థ సప్తమములందున్న నైసర్గికపాపులనుబట్టి కారాగృహవాసము, రాజదండన మొదలగుకష్టములు నిర్ణయించినాడు. అష్టమమందున్న గ్రహము నాభావసంబంధమైన యోగమునకు నాటంకము గలు

కారకలగ్నమగును. ఒకప్పుడు నవాంశములో రెండు గ్రహములు భాగాధిక గ్రహములై యున్నయెడల వానిలో ముందు ఏ గ్రహము ఆ పాదమునుండి పోవునో వానిని భాగాధిక గ్రహముగా గ్రహించు కొనవలెను. అప్పుడుకూడ ఆ రెండు గ్రహములు ఒకే కాలమున ముందుకు పోవుచో శీఘ్రగ్రహము భాగాధిక గ్రహము.

ఆరూఢ చక్రము

సూ॥ యావదీశా శ్రయంపద మృక్షాణాం'

భావాధిపతి యాభావమున కెన్నవయింట నుండునో యక్కడ నుండి యన్నవయింట, ఆ భావపద మగును. జైమినిమహర్షి తొమ్మిది భావములను దీసికొని వాని ననుసరించి తొమ్మిది పదముల నేర్పరచెను. అవి యేవియనగా :—

జన్మ లగ్నమునుబట్టి ఆరూఢలగ్నమును (ఆరూఢపదమును) ధనస్థానమునుబట్టి అనగా లగ్నాత్తు ద్వితీయమునుబట్టి కోశపదమును, తృతీయమునుబట్టి భ్రాతృపదమును, చతుర్థమునుబట్టి మాతృపదమును, పంచమస్థానమునుబట్టి మంత్రపదమును, సప్తమమును బట్టి దారపదమును, నవమమునుబట్టి భాగ్యపదమును, దశమమును బట్టి రాజ్యపదమును, పన్నెండవ యింటినిబట్టి యుపపదమును గనిపెట్టిరి. షష్టాష్టమలాభాధిపతులు యోగకారకులు కారనెడు మతము జైమినీమహర్షి గూడ నంగీకరించినట్లు, ఈ మూడుభావములకు బదముల నేర్పరచకుండుటచే విశదమగుచున్నది. విశేషమేమన లగ్నాధిపతి లగ్నమందే యున్నపుడు "స్వస్థేదారాః" అనెడు సూత్రమునుబట్టి చతుర్థము, ఆరూఢలగ్నమగును. అటులనే లగ్నాధిపతి లగ్నమునకు సప్తమమందున్నపుడు "సుతస్థేజన్మ" అను సూత్రమునుబట్టి దశమ మారూఢలగ్నమగును.

లగ్నాధిపతి లగ్నసప్తములలో నెక్కడనున్నను "యావదీశా

## హోరాలగ్నము

జాతకుని జన్మదినమున దినప్రమాణములు బాహాంగములో జూచుకొని నా ప్రమాణమును జన్మాంశ భాగములు చేయవలెను. అప్పుడు రాశియొక్కింటి కొన్ని గడియలు. గడియలు నమ్మునో కల్పవలెను. ఈ లెక్కన రాసులు జనన కాల గడియలవరకు లెక్కించగా నెన్ని రాసులగునో తెలియును. అప్పుడు జన్మలగ్నము మొదలుకొని యన్ని రాసులు లెక్కించవలెను. అదియే హోరాలగ్నమగును. ఇంతే రాత్రిప్రమాణమునుగూడ గట్టవలెను.

విశేషము, జన్మలగ్నము బేసియైనచో కుడివైపుగాను. సరి రాశియైనయెడల ఎడమవైపుగాను లెక్కించవలెను.

ఉదా॥ జననకాలము సూర్యోదయాది 3-30 దినప్రమాణం 32-42 రాశి ౧ కి 2-43.

3-30 జనన కాల గడియలుగనుక రెండవరాశి యగును. కర్కాటకము, జన్మలగ్నము. అది సరి రాశియైనది. గనుక ఎడమవైపుగా లెక్కించవలెను. అప్పుడు మిథునం హోరాలగ్న మగును.

వెనుకటి చక్రము పంచాంగము జూడుడు.

హోరాలగ్నమునుబట్టికూడ గొన్ని రాజయోగములు చెప్పెదరు.

ఘటికాలగ్నము. ఇది యాయుర్దాయభాగమున వివరించబడును.

జైమినిశాస్త్రమునందు శుభులనగా నైసర్గికశుభులు.

పాపులనగా నైసర్గికపాపులని యర్థము.

జైమినిసూత్రముల అక్షరసంజ్ఞ ఈ ప్రకారము చూచుకొనవలెను. :

సూ॥ సర్వత్రసవర్ణాభావారాశయశ్చ. అను సూత్రమునుబట్టి యీ శాస్త్రమునందంతట రాసులను అక్షరసంజ్ఞలచే దెలుపుచున్నాడు.

క ట ప యాది

క మొదలుకొని ఝ వరకు 9 అక్షరములు.

ట ,, ధ ,, 9 ,,

ప ,, మ ,, 5 ,,

య ,, క్ష ,, 9 ,,

ఇది అర్థము చేయుటలో అంకమూర్ధము అనగా, కుడినుండి యెడమ జూడవలెను. ఉదా: సింహా, శబ్దమునకు అర్థము స = 7 హా = 8 గనుక ఎడమవైపుగా జూచిన 87 అగును. దీనిని 12 భాగములు చేయగా 3 మిగులును. అందుచేత సింహా, అనగా తృతీయ మర్థమగును. గ్రహముల పీడ్ల వచ్చినప్పుడు అక్షరసంజ్ఞ చూడకూడదు. ఇందుకు సూ: "న గ్రహాః" అని ఈ మహర్షి చెప్పినాడు.

సూ: 1. అభిపశ్యంతిఋక్షాణి॥

2. పార్శ్వభేచ॥

3. తన్నిష్ఠాశ్చతద్వత్॥

రాసులు 3 భాగములు చేయబడును.

| చర, | స్థిర | ద్విస్వభావములు. | |
|---|---|---|---|
| మేష, | వృషభ, | మిథున | మొదటివర్గము I Group. |
| కర్కటక, | సింహా, | కన్య | రెండవవర్గము II Group. |
| తుల, | వృశ్చికము, | ధనస్సు | మూడవవర్గము III Group. |
| మకరము, | కుంభము, | మీనము | నాలుగవవర్గము IV Group. |

చరరాశియందున్న గ్రహము స్థిరరాశియందున్న గ్రహమును, స్థిర రాశియందున్నది చరరాశియందున్న దానిని ద్విస్వభావరాశియందున్నది ద్విస్వభావరాశియందున్న దానిని జూచును. ఒకేవర్గములోని చరస్థిర రాసులయందలి గ్రహములు చూచుకొనవు. అనగా మేష

ముననున్న గ్రహము వృషభములోని గ్రహమును. వృషభములో నిది మేషములోనివానిని జూచును. ఇట్లే కర్కాటక, సింహములు తులావృశ్చికములు, మకర కుంభములు పరస్పరము చూచును.

4. సూ: దారభాగ్యశూలస్థార్గలా నిధ్యాతుః.

82 = 28. $\frac{28}{12}$ ఈ మాదిరిగా భాగించగా దార 4 భాగ్య అనగా 2. శూల అనగా 11.

కారకాంశలగ్నమున కెట్టి నాలుగు, రెండు, పదునొకండు స్థానము లందున్న శుభగ్రహములు ధనలాభమును కలిగించును. ఇది జన్మ లగ్నమునుబట్టికూడ జరుగును. ఈ శుభగ్రహములు సమానముగ నున్నయెడల నత్యంత ధనయోగ మిచ్చెదరు. లగ్నాత్తు పంచ మాధిపతికికూడ నటులె జూచుకొనవలెను. అనగా 2, 4, 11 స్థానముల నాలోచించవలెను. ఈ యోగము విశేషము జన్మలగ్న మైనపుడు, ద్వితీయ చతుర్థ ఏకాదశములందున్న గ్రహముల దశల పర్యంతమైన రాజయోగము చేయుదురు. శుభగ్రహములైన చంద్ర, బుధ, గురు, శుక్రులలో గురుబుధులు చతుర్థమునకంటె ద్వితీయలాభములలో నుండినపుడు అధికయోగ మిచ్చెదరు. ఇందుకు కారణము, కేంద్రాధిపత్యము పట్టిన గురు బుధులు, కేంద్రకోణములందున్నయెడల అవయోగ మిచ్చెదరు గనుక ఈ మూడు స్థానములలో జతుర్థము కేంద్రము గనుక నీ గురు బుధు లా స్థానమందున్నచో నంతయోగించరు. ఈ 2, 4, 11 స్థానము లలో శుభగ్రహములు సమానముగ నుండక చతుర్థమునందు మాత్రము గురుడుగాని, బుధుడుగాని, గురుబుధులు కలిసిగాని యుండిన వారి దశలలో నెవరిదశ వచ్చినను యోగమునియ్యరు సరి గదా గురుబుధుల దశాంతర్దశలలో చిక్కులి యవయోగము చేయుదురు. అట్లే యీ ఘటికాలగ్నమునకు జైమిని చెప్పిన 2, 4,

11 స్థానములందు శుభగ్రహములు సమముగానుండి శుక్రుడు చతుర్థకేంద్రమం దున్నచో వానిదశలో గాని యంతర్దశలలో గాని జాతకునకు మిక్కిలి యత్యంత ధనయోగము చేయును. శుక్రుడు తృతీయాష్టమాధిపతియైనను, విద్యాధిక్యముగూడ జెప్పవలెను. ఈ యోగము ఏకాదశమున శుభగ్రహముగాని పాపగ్రహముగాని యుండకపోయినను, ద్వితీయ చతుర్థములలో శుభగ్రహములు సమానసంఖ్యగా నున్నయెడల నీ ధనయోగము గలుగును.

౫. సూ : కామస్థానే షష్ఠాయనాః పాపానామ్

3, 6, స్థానములందున్న పాపులు యోగమిచ్చెదరు. ఈ యోగమునకు గ్రహములు సమానముగా నుండవలెను. 4, 5 సూత్రములలో రెండుగా గలిపి యొకటేయోగము. రాజయోగము వచ్చునపుడు నీ రెండును బట్టినది తెలిసి చూడవలెను, ఈ రెండును బట్టినేని సంస్థానాధిపతియగులగాని ప్రబలమైన రాజయోగము కలుగులగాని నిశ్చయము. ఈ రెంటిలో నొక్కమాత్రమే పట్టిన యెడల నందు జెప్పిన గ్రహముల దశలు వచ్చినపుడు రాజయోగ మిచ్చెదరు.

౬. సూ : రిప్ఫనీచ కామస్థా విరోధినః॥

2, 4, 11 స్థానములందున్న శుభగ్రహములకు క్రమముగ 12, 10, 3 స్థానములందున్న గ్రహములు విరోధులగును. అనగా ప్రతిబంధకగ్రహములు ద్వితీయమందున్న శుభగ్రహమునకు వ్యయమందే గ్రహమున్నను యోగభంగము చేయును చతుర్థమందున్న శుభగ్రహమునకు దశమందున్న గ్రహముల్లే. మరియు నేకాదశమందున్న శుభగ్రహమునకు తృతీయమందున్న గ్రహముల్లే, గాని పైనిజెప్పిన సూత్రములో తృతీయమందున్న పాపగ్రహము యోగము నిచ్చునని యున్నది. ఇప్పుడు తృతీయమందున్న

గ్రహ మేకాదశమునందున్న గ్రహమునకు ప్రతిబంధకముగా నున్నను తృతీయమందున్నది తక్కువ భాగములు భుక్తిదై యుండగా దక్కువబలము గలదైన మూడింట లాభమందున్న గ్రహమునకు ప్రతిబంధకము చేయజాలదు. మరియు దానిని యోగమునకే జేయును గనుక మునుచెప్పిన సూత్రమునకు వైరుధ్యము లేదు.

7. సూ : పశ్చాదాభిబలాశ్చ।

ఆరవసూత్రమున జెప్పినప్రకారము 2, 4, 11 స్థానములం దున్న శుభగ్రహములకు 12, 10, 3 స్థానములందలి గ్రహములు వారికంటె బలహీనములైనయెడల రాజయోగమునకు భంగము గలుగదు. వారికంటె బలవంతులైనను, సమానులైనను, సంస్థానాధిపత్యము, మున్నగు గొప్పరాజయోగములకు భంగము చేయుదురుగాని యశుభమునీయరు.

8. సూ : ప్రాగ్వత్త్రికోణే॥

పంచమమందున్న శుభులు బలహీనులైనను యోగము నిచ్చెదరు. వీరికి కేంద్రాధిపత్యదోషమున్నను యోగము నిచ్చెదరు. వీరికి చంద్రసంబంధము మరింత మంచిది. స్థానలగ్నమునకుమాత్రము కాదు.

9. సూ : విపరీతం కేతోః॥

కేతువితర పాపులవలెగాక నవమమందున్నను యోగించును. కొందరిమతమున పంచమమునను యోగించును గాని కేతువునకు శుక్రసంబంధము కూడదు.

10. సూ : తస్యానుసరణాదమాత్యః॥

ఈ సూత్రముననుసరించి రవిమొదలు సప్తగ్రహములు, రాహుకేతువులలో నొక్కడును, మొత్తము ఎనిమిదిగ్రహము లేచో రా

సులలో నున్నవో యా రాసులలో వారి కెన్నిభాగములు భుక్తి
యైనవో జూచికొని యందులో నెక్కువభాగములు భుక్తియైన
గ్రహము మొదలు క్రమముగ తక్కువభాగములు భుక్తియైనగ్రహ
మువరకు వరుస నేర్పరచుకొనవలెను. అందులో ప్రథమగ్రహము,
లగ్నకారకగ్రహమనియు, లేక ధనాది కారకుడనియుజెప్పవలెను.
వీనినిబట్టి లగ్నాధిపశక్తివలెనే ఫలములను జూచుకొనవలెను.

రెండవదిగా భాగలు భుక్తియైనగ్రహము అమాత్యకారకగ్ర
హముగను, వీనినిబట్టి బుద్ధియు, ఆలోచనశక్తి మొదలగునవి చూచి
కొనవలెను.

11. సూ: తస్యభ్రాతా॥ 12. సూ: తస్యమాతా॥
13. సూ: తస్యపుత్రః॥ 14. సూ: తస్యజ్ఞాతిః॥
15. సూ: తస్యదారాశ్చ॥

ఇట్లే 11వ సూత్రప్రకారము మూడవదిగా భాగలు భుక్తియైన
గ్రహము భ్రాతృకారకుడగును. నాల్గవది మాతృకారకుడును,
అయిదవది పుత్రకారకుడును, ఆఱవది జ్ఞాతికారకుడును, ఏడవది
కళత్రకారకుడును అగును.

ఈ సూత్రములనుబట్టిచూడగా జైమిని మహర్షికూడ కారకు
లను ఎట్లు నిర్ణయముచేయవలెనో యీసంగతి పారాశర్య మతము
ననుసరించుచు, భాగలనుబట్టికూడ పై చెప్పినరీతి కారకత్వము
నిర్ణయించెను. ఈ రెండు మతములకు ముఖ్యభేదముకు రవ్యాది
సప్తగ్రహములు పారాశర్యమతమున నెప్పుడును కారకత్వమొ
క్కటే. ఉ:- సూర్యుడు పితృకారకుడు, చంద్రుడు మాతృకార
కుడు, కుజుడు భ్రాతృకారకుడు, మొదలుగా పారాశర్యనిమతము.
జైమినిమతమున అట్లు గ్రహాలకు కారకత్వము రూఢింపబడి
యుండియు, వారున్నరాసులలో వారున్న భాగమునుబట్టి క్రింద
చెప్పినరీతిని కారకత్వముకూడ నిరూపింపబడెను.

| వరుస | భుక్తమైన భాగలు | రాశి | గ్రహం | కారకము |
|---|---|---|---|---|
| 1 | 25 భాగలు | మకరం | శని | తను |
| 2 | 24 భాగలు | సింహం | బుధ | అమాత్య |
| 3 | 20 భాగలు | కుంభం | గు | భాతృ |
| 4 | 16 భాగలు | మేషం | ర | మాతృ |
| 5 | 14 భాగలు | కర్కాట | కు | పుత్ర |
| 6 | 10 భాగలు | మిథు | శు | జ్ఞాతి |
| 7 | 8 భాగలు | ధనస్సు | చం | దార |
| 8 | 5 భాగలు | మీనం | రా | ఆయుష్ఠా |

ఈ పైన ఉదహరించిన పటమునుబట్టి గ్రహములు తాామున్న రాశిలో తమకు భుక్తమైన భాగాధిక్యతనుబట్టి కారకత్వము జైమినిమతము ప్రకారము సిద్ధించునని తెలియును. కాని జైమినిపరాశర్యుని భావనిరూపణ యొప్పుకొనుచు వానికి బలకరముగ భాగాధిక కారకత్వమిచ్చెను. ఉదాహరణ :– పై ఉదహరించిన పటములో గురునకుపారాశర్యములోని పుత్రకారకత్వమును, జైమిని ప్రకారము భాతృకారకత్వము కలిగినది.

16. సూ : మాత్రాసహపుత్రమేకేసమాామనంతి॥

పైని ఉదహరించిన 1 వ సూత్రప్రకారము నాలుగవదిగా భాగలు భుక్తమైన మాతృకారకత్వము గ్రహమునుబట్టి పుత్రకారకత్వముకూడ చూచుకొనవచ్చునని ఈ సూత్రము చెప్పుచున్నది.

17. సూ : "భగిన్యారత శ్యాల॥"

కుజునిబట్టి సోదరీవిషయమును, భార్య సోదరులవిషయమును జూచుకొనవలెను.

18. సూ : "కనీయాజననీచేతి"

ఈ కుజునిబట్టియే కనిష్ఠసోదరులను, కనిష్ఠభ్రాతృవర్గమును జూడ వలయును. (ఈ సూత్రము మా తాటియాకు గ్రంథమున ప్రత్యేకముగ వ్రాయబడియున్నది. కొన్నిచోట్ల పైసూత్రములో కలిసి యున్నది.)

19. సూ : "మాతులాదయో బాంధవా మాతృసజాతీయా ఇత్యుత్తరతః"

మేనమామ మొదలగు తల్లివంక బంధువులను బుధునిబట్టి నిర్ణ యించవలెను.

20. సూ : "పితామహా పతిపుత్రా వితిగురుముఖా దేవ జానీయాత్"

తండ్రి, తండ్రితండ్రి, ప్రభుపుకుమారులు వీరినిగురించి గురునిబట్టి నిర్ణయించవలెను.

21. సూ : "పత్నీపితరౌ గురూ (శ్వశురౌ) మాతామహా ఇత్యంతేవాసినః"

భార్య, అత్తగారు, మామగారు, గురువు, మాతామహులు, శిష్యవర్గము, వీరివిషయము శుక్రునివలన నిర్ణయించవలెను.

22. సూ : "మందోజ్యాయాన్గ్రహేషు"

శనినిబట్టి జ్యేష్ఠభాతృని తెలిసికొనవలెను.

ఇచ్చట శని, గ్రహములలోకెల్ల బలహీనుడని కొందరి యభిమతము. ఈ సూత్రమునకు ఈ యభిప్రాయము సమంజసముగాదు.

23. సూ : "ప్రాచీవృత్తిర్విషమభేషు"

24. సూ : "పరావృత్త్యోత్తరేషు"

బేసి (ఓజ) రాసులు క్రమముగాను, సరి (యుగ్మ) రాసులు వెనుకనుండియు, లెక్కించవలెను. ఈ లెక్క మేషము మొదలు చూచుకొనవలెను.

| 6. బేసిరాసులు. | | 6. సరిరాసులు. | |
|---|---|---|---|
| మేష | తుల | వృషభ | వృశ్చిక |
| మిథున | ధనస్సు | కర్కాటక | మకర |
| సింహ | కుంభము | కన్య | మీన |

25. సూ : "నక్షవత్"

కొందరియభిప్రాయము బేసిరాసులను, సరిరాసులను ఈ క్రమముగానే చూచుకొనవలెనని చెప్పుదురు.

కారకాంశలగ్న రాశి మేషాది రాసులలో నేదియగునో, దానిని బట్టి యికముందు ఫలితము చెప్పఁబడును.

26. సూ : "పంచమూషికమార్జాలాః"

అనగా కారకాంశ రాసి మేషమైన యెడల ఎలుకలు, పిల్లులు మొదలలైన జంతువులవలన భయము కలుగును.

ఈ యభిప్రాయము జాతక రాజీయములోను, ఉపదేశప్రదీపికలోను జెప్పినారు.

శ్లో॥ మార్జాలమూషికాదిభ్యోభయం మేషాంశసంస్థితే.

27. సూ : "తత్రచతుష్పాదః"

ఈ కారకాంశరాశి వృషభమైనయెడల గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు చతుష్పాద జంతువులవలన భయము కలుగును.

శ్లో. కారకావృషభాంశేతు చతుష్పాదభయం భవేత్.

28. సూ : మృత్యోః కండూః స్థౌల్యంచ.

కారకాంశరాసి మిధునమైనయెడల స్థూలశరీరముకలవాఁడును చర్మవ్యాధులవలన మృతిపొందువాఁడును అగును.

శ్లో. కారకే మిధునాంశే కండూస్థౌల్యాగ్ని మృత్యుర్భవేత్.

28. సూ : "దూరే జలకుష్ఠాదిః"

కారకాంశ రాశి కర్కాటకమైనయెడల జలగండమువలనగాని, కుష్ఠురోగమువలనగాని, జాతకునకు భయము.

శ్లో. కర్కాటకాంశగ తేపిచాత్ కుష్ఠాదిభ్యోభయంభవేత్.

30. సూ: "శ్వాపదాః"

కారకాంశ రాశి సింహమైనయెడల సింహ శార్దూలాదులవలన భయము.

శ్లో. సింహాంశే శుపకాద్భీతాం ఆత్మకారక సంస్థితే.

31. సూ: "మృత్యువజ్జాగ్ని కణశ్చ"

కారకాంశ రాశి కన్యయగునేని మిధునమునకు జెప్పినఫలితమే చెప్పనగును. దీనికి అగ్నిభయముకూడ గలుగును.

32. సూ: "లాభే వాణిజ్యా:"

కారకాంశరాసి తుల యగునేని లాభము కలుగును.

శ్లో. కన్యాంశేగ్నిః తులాంశే వాణిజ్యలాభసంస్థితే.

33. సూ: "అత్రజలసరీసృపా స్తన్యహానిశ్చ"

కారకాంశరాశి వృశ్చికమైనయెడల జలగండము, సర్పాదుల వలన భయము, మాతృస్థన్యము క్షీణించుటవలన ఇతరులపాలు త్రాగుటయు సంభవించును.

శ్లో. కారకే వృశ్చికాంశస్థ భయం జలసరీ సృపాత్
మాతుం స్థన్యంచ నభవేత్ ........"

34. సూ: సమే వాహనాదుచ్చాచ్చ్యక్రమాత్పతనం.

కారకాంశరాసి ధనస్సయినయెడల వాహనాదులవలన నుండి గాని, వృక్షాదులువలనగాని, వాటినుండి పడుటవలనగాని భయము.

35. సూ: జలచరఖేచర కేటకండు దుష్టగ్రంథయశ్చరిఃఫే.

కారకాంశరాసి మకరమైనయెడల మొసళ్ళు మొదలలైన జల చరములవలనను, వ్యాఘ్రములు మొదలగు భూచరములవలనను,

గర్దభ మొదలగు చతుష్పాద జంతువులవలన భయము కలుగును. కంటకాలు మొదలగు శస్త్రసాధనములు వానివలనను భయము సంభవించును.

శ్లో. వాహనా మన్నత్రిస్థానేత్పుత్రః [illegible]
కారకే మకరాంశస్థే జంతుభ్యో భయం భవేత్.
[illegible]

కారకాంశ రాశి కుంభ[illegible] మొదల తటాకారామాదులను నిర్మించువాడు ధర్మమందు ఆసక్తిగలవాడును అగును. ఈ తటాకాదుల వలన భయము కలుగును.

శ్లో. కుంభాంశే కారకేషు తటాకాదికయో భవేత్.

37. సూ: "ఉచ్చే ధర్మనిత్యతా కైవల్యం చ"

కారకాంశ ఉచ్చమైనయెడల సదా ధర్మపరత్వము మోక్ష ప్రాప్తియు కలుగును.

శ్లో. ధర్మశాలీ మోక్షశాలీ మీనాంశే కారకేస్థితః
కారకేణాంశ రాశిస్థగ్రహస్థితిఫలం బ్రువః.

రవ్యాదిగ్రహములకు కారకాంశ లగ్నస్థితఫలములు.

38. సూ: సూత్రత్రరవౌ రాజకార్యపరః.

కారకాంశరాసియందు సూర్యుడున్న యెడల, రాజకీయోద్యోగి గాని లేక రాజకార్య వ్యవహారములు బాగుగా తెలిసినవాండ్రు గాని యగును.

శ్లో. కారకేణసిహాంశేవ రాసౌవాసస్థితౌరవౌ
రాజకార్యపరోజాతో భవేన్నాత్రవిచారణా.

కొందరి యభిప్రాయము కారకాంశలగ్న రాసికి సప్తమమును బట్టికూడ ఈ ఫలమునే చెప్పవలయునని యందురు.

39. సూ : "పూర్ణేందు శుక్రయోర్భోగీ విద్యాజీవీచ.

కారకాంశలగ్నమున పూర్ణచంద్రుడుగాని, శుక్రుడుగాని వీరిరు వురును కలసిగాని యున్నయెడల భోగియు, విద్యలవలన జీవించు వాడును అగును. ఈయోగము జన్మలగ్నమునకు పంచమస్థానము లందుగాని, కారకాంశలగ్నమునకు కేంద్రకోణములందుగాని ఉన్న ప్పుడు చెప్పవలసినదిగా పరాశరాదిఋషులు చెప్పినారు. అనుభవ మునుబట్టి చూడగా రెండునూ సరిపోవుచున్నవి. కాని కారకాంశ లగ్నమునందుమాత్రమే శుక్రుడున్నయెడల తప్పక రాజకీయో ద్యోగము గలవాడగుచున్నాడు.

40. సూ : "ధాతువాదీ కౌంతాయుధవహ్నిజీవీచభౌమే"

కారకాంశరాశియందు కుజుడుండిన యెడల రసవాదము చేయు వాడును అనగా రసాయనవిద్యచేతను, ఆయుధములవలన, అగ్ని సంబంధమయిన పనులు చేయుటవలనను, జీవించువాడగును.

41. సూ : వణిజస్తంతు వాయశ్శిల్పినో వ్యవహారవిదశ్చ సౌమ్యే.

కారకాంశరాశియందు బుధుడుండినయెడల వాణిజ్యమునందా సక్తికలవాడుగాని, వాణిజ్యసంబంధముగు నుద్యోగముగలవాడు గాని అగును. చిత్రలేఖనమునందును వ్యవహార జ్ఞానముకలవాడై వీనివలన జీవించువాడు కూడ నగును.

42. సూ : "కర్మజ్ఞాననిష్ఠావేదవిదశ్చజీవే"

కారకాంశరాశియందు గురుడుండినయెడల శ్రౌతస్మార్తాదికర్మ లయందు పట్టుకలవాడును, యోగశాస్త్ర జ్ఞానముకలవాడును అగును.

43. సూ : రాజకీయాః కామినశ్శతేంద్రియశ్చశుక్రే"

కారకాంశరాశియందు శుక్రుడుండెనేని రాజకీయాధికారము

కలవాఁడును, దీర్ఘాయుర్దాయము కలవాఁడును అగును. కొందరు కామశాస్త్రకౌశల్యము కలవాఁడుకూడ నగునని 'కామిః' అను మాటకు అర్థము చేసినారు. కాని ఇది పొరపాటు అభిప్రాయమువలె తోఁచుచున్నది. ఈ మాటలకు అనుభవమునుబట్టి చూడగా అనేకకోర్కెలు గలవాఁడగునని తెలియుచున్నది. శుక్రుఁడు కామమునకు కారకుఁడైనను కారకలగ్నమందున్న స్థానమాత్రము దాని కర్తృత్వ మారోపించకూడదు. రాజకీయోద్యోగమనగా ప్రభుత్వోద్యోగము మాత్రమేగాక బోర్డు, మునిసిపలు ఉద్యోగములుకూడ చెప్పుకొనవలయును. ఇచ్చట ఇంద్రియమను మాటకు జీవము అనగా ఆయుర్దాయమని అర్థము. 'శత' అనగా నూరు అనిమాత్రమే అనుకొనగూడదు. అనేకము అని అభిప్రాయముతో ఉపయోగించినట్లు కనుపించుచున్నది.

44. సూ : "ప్రసిద్ధకర్మాజీవశ్శనౌ"

కారకాంశ రాశియందు శని యుండెనేని ప్రసిద్ధమైనటువంటికర్మచేత జీవించువాఁడగును. "ప్రసిద్ధ కర్మణా జీవేత్ శనినా" అని పాఠాంతరముండుటచేత ప్రసిద్ధమైనట్టివాఁడును (అనగా స్వకుల ప్రసిద్ధుఁడును,) మంచికర్మచేత జీవించువాఁడును, స్వశక్తియే జీవనాధారముగాఁ గలవాఁడును అగును. ఈ సూత్రము కారకాంశ లగ్నమునకేగాక జన్మలగ్నమునుబట్టికూడ చూచుకొనవచ్చును. ఈ లగ్నము ధనుర్మకరకుంభతులాలగ్నములకు మరింత ప్రశస్తము

45. సూ : "ధానుష్కాశ్చోరాశ్చ"

46. సూ : జాంగలికా లోహయంత్రిణశ్చ రాహౌ"

కారకాంశ రాశియందు రాహువున్నయెడల ధనుర్ధరులై యడవులయందుండి దోచుకొని జీవించువారలగుదురని వ్రాసినారు. ఈ యభిప్రాయము అనుభవమునకు సరిగానున్నట్లు కనుపించదు.

కాని వేటయం దిష్టముకలవారును, కుయుక్తులుకలవారును అగుదురు. లోహాయంత్రములవలనకూడ జీవించువారగుదురు. అనగా ఇత్తడి, రాగి, వెండి, బంగారము మొదలగువాటిని అమ్ముటవలన జీవించువారును అగుదురు. విషవైద్యముచేతకూడ జీవించువారును కావచ్చును.

47. సూ : "గజాన్యవహారిణశ్చోరాశ్చ కేతౌ"

కారకాంశరాశియందు కేతువున్నయెడల ఏనుగులను విక్రయించువారును; చౌర్యవృత్తిగలవారు నగుదు. కాని ఈ యభిప్రాయమంత సమంజసముగా లేదు. అనుభవమునుబట్టి చూడగా వ్యవహారజ్ఞానము కలవాడగునని యు,బూటకములచేగాని, వంచకవృత్తి చేగాని. జీవించువాడగునవియు లేక వంచకవృత్తిచే గలసిన వ్యవహారజ్ఞానము కలవాడగునని యును ఊహించవలెను.

48. సూ : "తత్రమంద సర్పయోః తాంబూలదాయీ"

కారకాంశలగ్నమందు శనిరాహువు లుండినయెడల తాంబూలపీఠకాధారమువలన జీవించువారు లగుదురని వ్రాసినారు. కాని యనుభవమునుబట్టి చూడగా ఈ శని రాహువులు కలిసినంతమాత్రమున నీచవృత్తినిం గలుగంజేయుటలేదు. స్వతంత్రజీవనము కలవారగుచున్నారు. కాని పైకి గాంభీర్యము కలవారైనను సమయమునకుమాత్రము కొంత నీచత్వమునుజూపి తమ్ము కాపాడుకొను స్వభావము గలవారగుదురు.

49. సూ : చాపే చంద్రే నావికః.

50. సూ : శుక్రదృష్టే విశేషేణ.

కారకాంశరాశి కర్కాటకమై అందు చంద్రు డుండినయెడల నావికావ్యాపారమువలన ధనము సంపాదించును. శుక్రదృష్టికూడ నున్నయెడల ఈ యోగము మరింత యధికముగాను చెప్పవలెను.

పడవల వ్యాపారముగాని నీటిసంబంధమునైన మరి యేయితర వ్యాపా
రములుగాని చేయువాడగును.

51. సూ : రవిరాహుభ్యాం సర్పనిధనం

కారకాంశ రాశియందు రవి రాహువులున్న యెడల సర్పము
వలన చావుగాని హానిగాని కలుగును.

52. సూ : శుభదృష్టే తన్నివృత్తిః.

దీనికి శుభగ్రహవీక్షణముండినగాని, కలియుటగాని యున్నయె
డల ఆదోషము నివృత్తియగును. అనగా పాము కరచినను చావు
మాత్రము సంభవించదు.

53. సూ : శుభమాత్రసంబంధాజ్జాంగలికః

రవిరాహువులు కారకాంశ రాశియందుండి శుభుల సంబంధము
మాత్రమే కలిగినప్పుడు అడవులయందు తిరిగి జీవనము చేయువాం
డగును. అనుభవమునుబట్టిచూడగా వైద్యము చేసికూడ జీవనము
చేయువాడగునని తెలియుచున్నది. జాంగలిక శబ్దమునకు వైద్య
మనుటయే సమంజసము. కొందరు అడవులని వ్యాఖ్యానము చేయు
చున్నారు.

54. సూ : చంద్రకేతుభ్యాం మిత్యేకే.

కారకాంశ రాసియందు చంద్రకేతువులుండి శుభగ్రహదృష్టి
గలిగినప్పుడుకూడ వైయోగమే తటస్థించునని కొందరిమతము.
కొందరు విషవైద్యముచేత జీవనముచేయు వాండగునని చెప్పుదురు.
రెండవ యభిప్రాయమే బాగున్నట్లు తోంచుచున్నది.

55. సూ : కుజమాత్రదృష్టే గృహదాహకః అగ్నిదోవా.

కారకాంశ రాశిని కుజుండు చూచిన యెడల తన యిల్లు కాలిపో
వుటగాని, ఇతర యిండ్లను తగలబెట్టువాండు కాని, యగును. ఒక

ప్పుడు ఇల్లు తగులబడకపోయినను, కూలిపోవుటగాని తటస్థించ వచ్చును.

56. సూ : శుక్రదృష్టే అర్థదాహః

కారకాంశరాశిని శుక్రుడు చూచినయెడల యింటికి పూర్తిగా నష్టముగాక కొంతమాత్రము తగులబడును. శుక్రకుజులిద్దరు చూచినను ఈ యోగము చెప్పవచ్చును. పాఠాంతరము ''శుక్రదృష్టేర్న దాహః'' దీనిప్రకారం శుక్రసంబంధమువలన పై యోగమునకు భంగము.

57. సూ : గురుదృష్టే ఆసన్నగృహాత్.

పాఠాంతరము సూ : గురూదృష్టే స్వాసమీ గృహాద్దాహాత్.
కారకాంశరాశిని కుజునితోడ బాటు గురువుకూడ చూచుచున్న యెడల సమీపమందున్న యిల్లు తగులబడును.

58. సూ : సగుళికే విషదో విషహతో వా.

కారకాంశరాశియందు గుళికుడున్నయెడల ఇతరులను విషముచే చంపువాడుగాని, తాను విషముతిని, మరణించుటగాని యగును. గుళిక సాధనము సంజ్ఞాధ్యాయమున జెప్పబడినది.

59. సూ : చంద్రదృష్టౌ చోరాపహృతధనశ్చోరో వా.

కారకాంశరాశియందు గుళికుడుండి చంద్రదృష్టి యున్నయెడల చోరులవలన ధనము పోగొట్టుకొనినవాడుగాని తాను చోరుడగుట గాని సంభవించును.

60. సూ : స్వాంశేబుధమాత్రదృష్టే బృహద్బీజః.

కారకాంశరాశిని బుధుడుమాత్రమే చూచినయెడల పెద్ద అండము కలవాడగును. ఈ బుధుడు కారకాంశలగ్నమందున్న యెడల నిశ్చయముగా నీయోగము జరుగును. ఒకప్పుడు కారకాంశ లగ్నమందు లేకపోయినను, జూడకపోయినను ఈ గ్రహము పాపై వీని దశాంతర్దశలు వచ్చినప్పు డండవృద్ధియగును.

61. సూ : "తత్ర కేతౌ పాపదృష్టే కర్ణచ్ఛేదః కర్ణరోగో వా."

పాఠాంతరము సూ : తత్ర కేతౌ కర్ణచ్ఛేదః, కర్ణరోగో వా.

కారకాంశ రాశియందు కేతువుండి, పాపగ్రహము చూచు చుండిన యెడల కర్ణచ్ఛేదముగాని, చెవులయందు రోగముగాని కలుగును. కేతువుండకపోయినను, కేతుదృష్టియు, పాపగ్రహదృష్టియు నున్న యెడలకూడ చెవుల రోగముండును.

62. సూ : "శుక్రకుజాన్యతరదృష్టే దీక్షితః"

కారకాంశ రాశిలో కేతువుండి, కుజశుక్రులలో నొక్కడుగాని, ఇద్దఱుగాని చూచిన యెడల జాతకుడు కార్యదీక్ష గలవాడగును.

పాఠాంతరము సూ : శుక్రదృష్టే దీక్షితః.

దీనికి వ్యాఖ్యాతలు కారకాంశమున కేతువుండి శుక్రునిచే జూడబడిన యజ్ఞాదిక్రతువులయందు దీక్షకలవాడగునని చెప్పుచున్నారు. ఈ యభిప్రాయముకంటె పై యభిప్రాయమే బాగున్నది.

63. సూ : "బుధశనిదృష్టే నిర్వీరః"

కారకాంశ రాశిలో కేతువుండి (లేకపోయినను ఇది చెప్పవచ్చును) బుధశనులు చూచిన యెడల బలహీనుడగును. శరీర దార్ఢ్యము చాల తక్కువకలవాడగును. నపుంసకుడగుననుట అనుభవమునకు వ్యతిరేకము.

64. సూ : బుధశుక్రదృష్టే పౌనః పునికః"

పాఠాంతరము 1 సూ : బుధశుక్రదృష్టే పౌనః పునికో దాసీపుత్రో వా.

కారకాంశ రాసిని బుధశుక్రులు చూచిరేని జాతకుడు నత్తిగలవాడగును. కొందరి యభిప్రాయమున కారకాంశ రాసికి ద్వితీయ

మున బుధశుక్రకు లుండిన శక్తివచ్చును. (కారకాంశమున కేతు వుండవలెనన్నమాట లోపము).

65. సూ: శనిమాత్రదృష్టే సన్న్యాసాభాసః.

66. సూ: శనిదృష్టే తపస్వీ ప్రేష్యోవా.

కారకాంశ రాశిని శనియొక్కడు చూచినయెడల సన్న్యాసలక్షణములు కలవాడగును. ఈ యోగము జన్మలగ్నమునుబట్టికూడ జూచుకొనవలయును. జన్మలగ్న కారకాంశలగ్నములందు శని యుండినను ఈ యోగము జెప్పవచ్చును. ఈ యోగము కలిగినయెడల జాతకుడు నిరాడంబరుడగును.

కారకాంశమున కేతువుండి శని జూచినయెడల తపశ్శక్తి కలవాడును ఇతరులందు అప్పుడప్పుడు ఆధారపడువాడును అగును. ఇది జన్మలగ్నమునకును గలుగును. (65 వ సూత్రమునకు కారకాంశమున కేతు వుండనవసరము లేదు. శనియున్నను, చూచినను జెప్పవలెను.

67. సూ: తత్రరవిశుక్రదృష్టే రాజభృత్యః.

కారకాంశరాసిని రవి శుక్రులు చూచినయెడల రాజభృత్యుండగును. అనగా రాజకీయోద్యోగి యగును.

68. సూ: రిఃఫే (బుధే) బుధదృష్టే వామందవత్.

కారకాంశరాసికి పదవయింట బుధుడుండినను, చూచినను, కారకాంశలగ్నమున శని యున్నట్లువలెనే స్వశక్తివలన జీవించువాడగును. ఈ యోగము జన్మలగ్నమును బట్టికూడ చూచుకొనవలయును. కారకాంశలగ్నమునకుగాని, జన్మలగ్నమునకుగాని దశమమందు శని యుండినను ఈ యోగము చెప్పవలయును. కాని వరహామిహిరులు దశమమందున్న రవి, కుజ, శనులనుబట్టి కూలి మనుష్యులు పుట్టుచున్నారనియును, వారిలో రవి, కుజ, శనులకు

క్రమముగా ఉత్తమ మధ్యమాధమములకును ఫలమును చెప్పినాడు. కాని ఈ యభిప్రాయము సరిగానున్నట్లు కనిపించదు.

69. సూ : శుభదృష్టే ధైర్యం.

పాఠాంతరము సూ : శుభదృష్టేఽస్థైర్యః. కారకాంశరాసికిగాని జన్మలగ్నమునకుగాని దశమమందు గురుడుండినయెడల మిక్కిలి ధైర్యవంతుడగును. పాఠాంతర సూత్రముప్రకారము చపలత్వము లేనివాడగును.

70. సూ : రవౌ గురుమాత్రదృష్టే గోపాలః

కారకాంశ రాసికి దశమమందు రవియుండి గురుమాత్రమే చూచినగాని, రవిగురులు కలిసియుండినగాని గురుడుండి రవిచే చూడబడుచుండినగాని పాడికలవాడగును. ఈయోగము లగ్నము నుబట్టికూడ చూచుకొనవలయును.

71. సూ : దారే చన్ద్రశుక్రదృగ్యోగాత్ప్రాసాదః.

కారకాంశ రాశికి చతుర్థమందు శుక్రచంద్రులు కలిసియున్న యెడల భవనములందు నివసించువాడగును. ఈ యోగము కొంత వరకు జన్మలగ్నమునుబట్టికూడ జరుగును. కారకాంశలగ్నమునకు శుక్రచంద్రులలో నొకడుండి రెండవవానిచే చూడబడుచుండిన యెడల కొంతవరకు ఈయోగము కలుగును.

72. సూ : ఉచ్చగ్రహేఽపి.

కారకాంశ రాసికి చతుర్థమందు ఉచ్చగ్రహము లున్న యెడల ప్రాసాదయోగము కలుగును. ఈ శుక్రచంద్రులకు ఆరోహణము గాని, ఉచ్చగాని మరింత శుభము.

73. సూ : రాహుశనిభ్యాం శిలాగృహమ్.

కారకాంశ రాసికి చతుర్థమందు శని రాహువులున్నయెడల శిలా గృహము కలవాడగును.

74. సూ : కుజకేతుభ్యాం మైష్టికః.

కారకాంశ రాసికి చతుర్థమందు కుజకేతువులున్న యెడల జాతకుడు ఇటికలతో కట్టిన యిల్లుగలవాడగును.

75. సూ : గురుణా దారవం.

76. సూ : తార్ణం రవిణా.

కారకాంశ రాసికి చతుర్థమందు గురుడున్నయెడల కఱ్ఱలతో కట్టిన ఇల్లుకలవాడగును. ఈ సూత్రమునకు ఈ అర్థము అనుభవమునకు సరిపోవుటలేదు. కారకాంశ రాసికి చతుర్థమందు బృహస్పతియున్నను శిలాగృహముగాని ఇటికయిల్లుగాని కలవాడగును.-కఱ్ఱపని ఇంటికి ఎక్కువగా నుండును. రవి యున్నయెడల గడ్డియిల్లు గలవాడగును. కాని ఇదియు సరిగాలేదు. రవియున్నను ఇటికలయిల్లుకలవాడగును. ఒకప్పుడు మట్టి కలుగుటయు గలదు

77. సూ : సమే శుభదృగ్యోగా ద్ధర్మనిత్యః
సత్యవాదీ పితృ గురుభక్తశ్చ.

కారకాంశ రాసికి నవమస్థానమున శుభగ్రహము లుండినను, శుభగ్రహములు చూచినను జాతకుడెల్లప్పుడు, ధర్మాసక్తిగలవాడు, సత్యవాదియును, సత్యము చెప్పువారియందు భక్తికలవాడును, తలిదండ్రులన నమ్రత గలవాడును అగును. పాఠాంతర సూత్రప్రకారము గురుభక్తిగలవాడుకూడ నగును.

78. సూ : అన్యథా పాపైః.

ఈ నవమస్థానమున పాపులున్నయెడలగాని, పాపులచే చూడబడినగాని, పైని చెప్పబడినదానికి వ్యతిరేకఫలము.

79. సూ : శని రాహుభ్యాం గురుద్రోహః

కారకాంశలగ్న రాసికి. నవమమందుశని రాహువులున్నయెడల గురుద్రోహిగాని, గురువుయందు భక్తిలేనివాడుగాని, యగును.

ఈ యోగము జన్మలగ్నమునకుకూడ పంచమ నవమములనుబట్టి చూచుకొనవలెను.

80. సూ : గురురవిభ్యాం గురావవిభ్యాన్వా.

కారకాంశరాశికి నవమమందు రవిగురులుగాని, వారిలోనొకరు పంచమమందును, మరియొకరు నవమమందును ఉన్నను, లేక రవి గురులిద్దరును, పంచమమందున్ననుగూడ జాతకుడు గురుద్రోహి యగును.

81. సూ : తత్రశుక్రాంగారకవర్గే పారదారికః.

కారకాంశరాశికి నవమ సప్తమములందెక్కడైన రవికుజులు కూడిగాని, విడిగాగాని ఉండి, కుజ శుక్రాంశలను పొందియుండిరేని జాతకుడు వ్యభిచారి, సంసారస్త్రీలతో రమించువాడు నగును. ఈ యోగము కారకాంశలగ్నరాశికి సప్తమమున కుజుడుండి, రవి చూచినను కలుగును. జన్మలగ్నమునకుకూడ రవికుజులలో నెవ్వరైనను సప్తమమున నుండి శుక్రుడు అంశలో మకర కుంభాంశలలో నున్నప్పుడు ఈ యోగము కలుగును. శుక్రకుజులు రాశిలో సప్తమమందుగాని భాగ్యమందుగాని యుండి, అంశలో మకర కుంభాంశములయందుండినప్పుడు ఈయోగము చెప్పవలయును.

82. సూ : దృగ్యోగాభ్యా మధికాభ్యామామరణం.

ఈ రవి కుజుల దృగ్యోగ సంబంధము పై రాసులకును, గ్రహాములకును, బూర్ణముగా కలిగినయెడల జాతకుడు యావజ్జీవమును వ్యభిచారి యగును.

83. సూ : కేతునా ప్రతిబంధకః.

పైని చెప్పిన యోగము పూర్తిగాపట్టినను కేతువు ఈ నవమ స్థానమునగాని, సప్తమమునగాని, రవికుజులతో కలిసి యున్నను, రవికుజులను జూచుచున్నను ఈ యోగమునకు భంగము కలుగును.

ఒకప్పుడు పై యోగము పట్టుటవలన జాతకుడు వ్యభిచారియైనను కేతుసంబంధమువలన కొంతకాలమునకు అపవాదముచేత గాని తాను ప్రేమించినస్త్రీ చనిపోవుటవలనగాని ఈ వ్యభిచారయోగము పోవును.

84. సూ : గురునాస్త్రైణః.

కారకాంశలగ్నమునకు నవమమందుగాని సప్తమమందుగాని, గురుండిన స్త్రీలోలుడగును. ఈ యభిప్రాయము అనుభవమునకు వ్యతిరేకముగానున్నది. కాని రవికుజులుండి గురుడు చూచుచుండిన యడల ఇది కొంతవరకు జరుగును. స్త్రీలయం దభిలాషమాత్రము కలవాడైన నగును.

85. సూ : నొవృషభేన్యై కే

కారకాంశలగ్నమునకు, నవమము వృషభ మైనయడల పైని చెప్పిన పారదారికయోగములు పట్టినను అవి జరుగవు. కాని అనుభవమున ఈ యభిప్రాయము సరికాదు. కారకాంశలగ్నముగాని, జన్మలగ్నముగాని, వృషభమైనయడల ఈ పారదారికయోగములు పట్టవని జైమిని యభిప్రాయమని తోచుచున్నది. పారాశర్యాదుల మతమునను అన్ని లగ్నములకంటె వృషభలగ్నము ప్రశస్తమైనదని చెప్పబడినది. అనుభవము చెప్పవలసివచ్చినప్పుడు ఇతర లగ్నములకు చెప్పినట్లుగా వృషభలగ్నమునకు చెప్పకూడదు.

86. సూ : రాహుణా అర్థనివృత్తిః.

కారకాంశరాసికి నవమమందుగాని, సప్తమమందుగాని రవికుజులుండి రాహుసంబంధము కలిగినయెడల కొంతకాలమే వ్యభిచారదోషముండును.

87. సూ : లాభే చంద్రగురుశుక్రే సుందరీ.

పాఠాంతర సూ : లాభే చంద్రగురుభ్యాం సుందరీ.

కారకాంశరాశికి సప్తమమందు గురు, శుక్ర, చంద్రులుండి నను లగ్నమందుండి సప్తమమును జూచుచున్నను భార్య సౌందర్యవతి యగును. ఈ యోగము జన్మలగ్నమునుబట్టికూడ జూచుకొనవలయును. ఒకప్పుడు పైని చెప్పిన శుభగ్రహములున్నను భార్య రూపవతి కాకపోవచ్చును. దీనికి కారణము

శ్లో. ఏనదృష్టా ఏనయుక్తో యదంశే వాస్థితస్సదా:
దారాధీశస్తుతద్వర్ణం కళత్రంలభతే పుమాన్.

అని బృహస్పతి చెప్పియుండుటచేత కళత్రస్థానాధిపతి యెవ్వరి యింట నుండునో, యెవ్వరితో కలిసియుండునో, ఎవ్వరిచే చూడబడునో, ఎవరి యంశయందుండునో ఆయా బలముల ననుసరించి ఆవర్ణముగల భార్య గలుగుననియర్థము. పాఠాంతర సూత్రమును బట్టి శుక్రుని జూడకూడదు. మొదటిదే యుక్తముగ నున్నది.

88. సూ : రాహుణా విధవా.

కారకాంశలగ్నమునకు సప్తమమందు రాహువుండినయెడల/ జాతకునకు విధవాసంభోగముగాని, భర్తనువదలిన స్త్రీసంభోగముగాని సిద్ధించును.

89. సూ : శనినావయోధికా, రోగిణీ, తపస్వినీవా.

కారకాంశలగ్నమునకు సప్తమమున శనియున్నయెడల తన కన్న వయస్సున ఎక్కువగా కనుపించునదియును, రోగినియును, కృశించిన శరీరము కలదియును, అగు స్త్రీ భార్యయగును. ఇది జన్మలగ్నమునుబట్టికూడ చెప్పవచ్చును. ఈ సూత్రమునకు వయస్సున తనకంటె పెద్దదగు భార్య కలుగుననుట యుక్తముగాదు. భార్యవయస్సులో తనకంటె పెద్దవానివలెకనిపించును. "తపస్విని" అను మాటకు కృశించిన శరీరము కలదనుట అనుభవమునకు సరిపోవుచున్నది.

90 సూ : బుధేచ కలావతీ.

కారకాంశ రాశికి సప్తమమందు బుధుడున్నయెడల సంగీత, సాహిత్య, చిత్రలేఖనాది కళలు తెలిసిన భార్య సిద్ధించును. కల శబ్దమునకు చిత్రలేఖనాది కళలుకూడ అని చెప్పవలెను.

91. సూ : కుజేన వికలాంగీ.

కారకాంశ రాశికి సప్తమమునందు కుజుడున్నయెడల భార్య సమానమయిన అవయవములు కలది కాదు. అనగా శాస్త్రవిరుద్ధమయిన రూపము గాని అంగములుగాని కలదిగా అగును.

92. సూ : రవిణా స్వకులేగుప్తాచ.

కారకాంశ రాశికి సప్తమమందు రవి యున్నయెడల భార్య మంచి అవయవములు కలదిగాని, ఆ మరణానంతరము భర్తకోటి గాని, తాను వైధవ్యము అనుభవించవలసి వచ్చినను అత్తగారి ఇంటియందుగాని, భర్త బంధువుల యింటియందుగాని తన జీవితమును అతిగుప్తముగ కాలక్షేపము చేసుకొని జీవించునదగును.

93. సూ : చాపే చంద్రేణ అనావృతే దేశే.

కారకాంశ రాశికి సప్తమము కర్కాటకమై అందు చంద్రుడున్నయడల అనాఖ్యాయితమగు ప్రదేశమునందు స్త్రీతో ప్రథమ సంగమము జాతకునకు కలుగును.

94. సూ : కర్మణి పాపే శూరః.

కారకాంశలగ్నమునకు జన్మలగ్నమునకుగాని తృతీయమందు పాపగ్రహములున్నయెడల జాతకుడు శూరుడు అనగా పౌరుషము కలవాడగును. శుభగ్రహములున్న పిరికివాడగును. కార్యములందుకూడ ఈ పిరికితనము యుండును. బుధుడుండిన మరింత పిరికివాడగును. బుధుడుండినను కేతుసంబంధము కలిగినచో మంచిధైర్యముకలవాడగును. ఎవరున్నను కేతువుండినచో ధైర్యముకలవాడగును.

95. సూ : శుభే కాతరః.

కారకాంశ రాశికి తృతీయమందు నైసర్గికశుభు డుండిన యెడల జాతకుడు పిరికివాడగును.

96. సూ : మత్స్వోపచితయోః పాపే కర్షకః.

కారకాంశరాశికిగాని, జన్మలగ్నమునకుగాని తృతీయ షష్ఠములందు పాపులున్నయెడల జాతకుడు వ్యవసాయమువలన జీవించువాడగును. కాని ఈ తృతీయ షష్ఠములందు గ్రహసామ్యము ఉండిననే ఈ ఫలము కలుగునని నాయభిప్రాయము.

97. సూ : నవమగురౌ విశేషేణ.

కారకాంశ రాశికి నవమమందు గురుడుండిన ఈ యోగము విశేషముగా చెప్పవలెను. కొందరు తృతీయ షష్ఠములందు పాపులుండి వీరిని గురుడు నవమమందుండి చూచినయెడల ఈ యోగము విశేషముగా నుండునని చెప్పుదురు.

98. సూ : ఉచ్చే శుభే శుభలోకః.

కారకాంశ రాశికి ద్వాదశమందు శుభగ్రహము లుండినయెడల జాతకుడు శుభలోకములు పొందువాడగును. ఇది జన్మలగ్నమును బట్టికూడ చూచుకొనవలయును.

99. సూ : కేతౌ కైవల్యం.

100. క్రియచాప యోర్విశేషణ.

కారకాంశ రాశికి వ్యయమందు కేతువుండిన మోక్షప్రాప్తికలుగును. ఇది జన్మలగ్నమునుబట్టియు జూడవచ్చును.

కారకాంశరాశి మేషముగాని, ధనస్సుగాని అయి అందు కేతువుండినయెడల ఈ యోగము మరింతవిశేషము. ఈ సూత్రమునకు ఉత్తరఖండిక కంటె భావముల ప్రకారమే సరిగా అనుభవమునకు సరిపోవుచున్నది.

101. సూ : పాపైరసద్భిః.

కారకాంశరాశికి వ్యయమునందు పాపులుండిన యెడల పైనిచెప్పిన దానికి వ్యత్యాసముకలిగి జాతకునకు శుభలోకములు కలుగవు.

102. సూ : రవికేతుభ్యాం శివభక్తః.

కారకాంశలగ్నమునకు గాని లగ్నమునకు వ్యయమునగాని రవి కేతువులున్న శివభక్తుడగును.

103. సూ : చంద్రేణ గౌర్యాం.

కారకాంశలగ్నమునకు వ్యయమున చంద్రుడుండిన గౌరీభక్తుడుగాని, శక్త్యుపాసకుడుగాని యగును.

104. సూ : శుక్రేణ లక్ష్మ్యామ్.

కారకాంశరాశికి ద్వాదశమున శుక్రుడున్న లక్ష్మియందు భక్తి గలవాడును, అనగా డబ్బు సంపాదించుటయే మోక్షముగాగల వాడని కొందరిమతము.

105. సూ : కుజేనస్కందే.

కారకాంశరాశికి ద్వాదశమున కుజుడున్నచో కుమారస్వామి యందు భక్తిగలవాడగును.

106. బుధ శనిభ్యాం విష్ణౌ.

కారకాంశరాశికి ద్వాదశమున బుధ శనులున్నయెడల విష్ణువు భక్తికలవాడగును.

107. సూ : గురుణా సాంబశివే.

కారకాంశరాశికి ద్వాదశమున గురుడున్నచో పార్వతీపరమేశ్వరులయందు భక్తిగలవాడుగాని, శైవోపాసకుడుగాని యగును.

108. సూ: రాహుణా తామస్యాం (శివభక్తి)దుర్గయాంచేతి

కారకాంశరాశికి ద్వాదశమున రాహువున్నయెడల శివుని యందును, దుర్గయందును తామసభక్తి కలవాడగును. లేక ఉగ్ర దేవతోపాసనయైన కలవాడగును.

109. సూ: కేతునా గణేశస్స్కందశ్చ.

కారకాంశరాశికి వ్యయమున కేతు వున్న యెడల గణపతియందును, కుమారస్వామియందును భక్తి కలవా డగును. లేక శైవోపాసకు డగును.

110. సూ: పాపర్క్షే మందే క్షుద్రదేవతాసు.

కారకాంశరాశికి ద్వాదశమున పాపక్షేత్రమై అందు శనియున్న యెడల క్షుద్రదేవతోపాసన కలవాడగును.

111. సూ: శుక్రే చ.

కారకాంశరాశియందుగాని, లగ్నాత్తు వ్యయమందుగాని శుక్రు డున్న యెడల క్షుద్రదేవతలను ఉపాసించువాడగును.

112. సూ: త్రికోణే పాపగ్రహే తాంత్రికః.

కారకాంశరాశికి నవమ పంచమములయందు పాపగ్రహము లున్న యెడల తాంత్రికుడగును. క్రూరమంత్రములు కలవాడును అగును.

113. సూ: పాపదృష్టే నిగ్రాహకః.

114. సూ: శుభదృష్టే నుగ్రాహకః.

కారకాంశరాశికి పంచమ నవమములను పాపగ్రహములు చూచిన యెడల అభిచారికాది క్రూరకృత్యములు (చెడుపు పెట్టుట మొదలగు పనులు) చేయువాడగును. శుభములు చూచిన యెడల పిశాచాది పీడలను పోగొట్టు భూతవైద్యుడగును.

115. సూ: అమాత్యదాసేచైవం.

కారకాంశలగ్నమునకుగాని, జన్మలగ్నమునకు వ్యయమునగాని అమాత్యకారకగ్రహము అనగా రెండవదిగా భాగలు భుక్తి అయిన గ్రహము ఉన్న యెడల క్షుద్రదేవతలను ఉపాసించును.

116. సూ: త్రికోణే పాపద్వయే మాంత్రికః.

కారకాంశ రాశికి పంచమ నవమములయందు పాపగ్రహసామ్య ముండినయెడల శాస్త్రము తెలిసినవాఁడుగాని భూతవైద్యమునందు ప్రావీణ్యము కలవాడుగాని అగును.

117. సూ : శుక్రేందా శుక్రదృష్టేవరసవాదీ.

కారకాంశ రాశియందు చంద్ర శుక్రులున్నను, శుక్రుడు చూచి నను రసవాదముచేత జీవనము చేయువాఁడగును.

118. సూ : బుధదృష్టేభిషక్.

కారకాంశ రాశిని బుధుడు చూచినయెడల వైద్యుడగును. ఈ యోగము కొందరు చంద్రుడుచూచినకూడ కలుగునని యందురు.

119. సూ : చాపే చంద్రే శుక్రదృష్టే పాండుశ్విత్రీ.

కారకాంశ రాశి కర్కటకమై అందు చంద్రుఁడుండి శుక్రునిచే చూడఁబడెనేని శ్వేతకుష్ఠు కలవాఁడగును.

120. సూ : కుజదృష్టే మహారోగః.

కర్కటకము కారకాంశలగ్నమై అందు చంద్రుఁడుండి కుజుడు చూచినయెడల జాతకుడు మహారోగముగాని, దీర్ఘరోగముగాని కలవాఁడగును.

121. సూ : కేతుదృష్టే నీలకుష్టమ్.

కర్కటకము కారకాంశలగ్నమై అందు చంద్రుడుండి కేతువుచే చూడబడిన నల్లకుష్టు (కుష్టు) రోగము కలవాఁడగును.

122. సూ : తత్రమృత్యుర్వా షష్టేనాపి త్యేకే.

కారకాంశ రాశికి తృతీయ షష్టములఁబట్టి రోగ విధానమును గనిపెట్టవలెను. ఇది జన్మలగ్నమునుబట్టికూడ చూచుకొనవలెను.

123. సూ : కుజ రాహుభ్యాం క్షయః.

124. సూ : చంద్రదృష్టే నిశ్చయేన.

కారకాంశ రాశికి తృతీయషష్టమముల కుజరాహువు లిద్దరుండిన

యెడల శియనోగపీడితుఁ డగును. ఈ సూత్రమునకు చతుర్థ పంచ మములందు అని అర్థము చెప్పుకొనుట అనుభవమునకు విరుద్ధము. వీనికి చంద్రసంబంధమువలన నిశ్చయముగా నీ యోగము సంభ వించును.

125. సూ: కుజేఽపిట కాదిః.

కారకాంశమునకు చతుర్థ పంచమములందు కుజు డున్న యెడల కాయలు, కురుపులు మొదలగు రక్తసంబంధమైన, చర్మసంబంధ మైన వ్యాధులు కలవాఁడగును. ఇది జన్మలగ్నాత్తుగాని, కారక లగ్నాత్తుగాని షష్ఠమమునకు కూడ చెప్పవచ్చును.

126. సూ: కేతునా గ్రహణీ జలరోగో వా.

కారకాంశ రాశికి చతుర్థపంచమములందు గాని, షష్ఠ మందుగాని, కేతువున్న యెడల గ్రహణి లేక జలరోగము మొద లైనవి కలుగును.

127. సూ: రాహుగుళికాభ్యాం క్షుద్రవిషాణి.

కారకాంశ రాశికి చతుర్థ పంచమములందుగాని, షష్ఠమమందు గాని రాహుగుళికు లున్న యెడల క్షుద్రజంతువులవలన కలిగిన విష ముగలవాఁడై దానివలన బాధకలవాఁడగును. "క్షుద్రవిషమునకు" మూషికాది విషమువలన అనునదికూడ సరిగానే యున్నది.

128. సూ: శ్రితశనౌ ఘాతుకః.

కారకాంశ రాశికి నాల్గింట శని యున్న యెడల శస్త్రములవలన దెబ్బలుగాని, రాతిదెబ్బలు తగులుటవలనగాని బాధకలుగును. లేక వీటితో ఇతరులను బాధపెట్టువాడుగాని అగును.

129. సూ: కేతునా ఘటికాయంత్రీ.

కారకాంశకు నాల్గింట కేతువున్నయడల యంత్రములను తయా

ను చేయువాడును, వాటియందు మిక్కిలి ప్రావీణ్యము కలవాడును అగును.

130. సూ : బుధేన పరమహంసో లగుడీవా.

కారకాంశ రాశికి తృతీయ సప్తమములలో బుధుడుండిన యెడల కఱ్ఱదెబ్బవలన మరణమునొందును. కఱ్ఱలు మొదలగు నాయుధములు ధరించువాడు నగును. మూలగ్రంథమున "బుధేనలగుడీ" అని యున్నది. పై సూత్రము ప్రకారము కారకాంశలగ్నమునకు చతుర్థమున బుధుడుండిన పరమహంస దండమును ధరించు వాడును, బ్రహ్మజ్ఞానియు నని అర్థము.

131. రాహుణాలోహయంత్రీ.

కారకాంశ రాశికి తృతీయ సప్తమములలో రాహువుండిన లోహయంత్రములు చేయువాడుగాని, ధరించువాడుగాని యగును. కారకాంశలగ్నమునకు చతుర్థమున రాహువున్న యెడల లోహయంత్రములను జేయువాడగును. ఇది అనుభవమునకు వ్యతిరేకము.

132. సూ : కుజేనకుంతీ.

కారకాంశ రాశికి తృతీయ సప్తమములలో కుజుడుండిన యెడల ఈటెలు మొదలగు నాయుధములు ధరించువాడగును. చతుర్థమున నున్నయెడల ఈటెలు మొదలగు నాయుధములు ధరించునన్నది అనుభవమునకు సరిగాదు.

133. సూ : మాతాపిత్రో శ్చంద్రగురుభ్యాం గ్రంథకృత్.

కారకాంశలగ్న పంచమములయందు ఎక్కడైన గురుచంద్రు లుండినయెడల గ్రంథకర్తయగును. ఈ యోగము లగ్నమునుబట్టి కూడ చూచుకొనవలయును. భాగ్యమందున్నను ఈ యోగము పట్టును. ఇది మీనమునకు వర్తించదు.

134. సూ : శుక్రేణ కించిదూనమ్.

కారకాంశలగ్నమునకుగాని, పంచమము, నవమములకుగాని, శుక్ర, చంద్ర దృగ్యోగం గలిగిన యెడల గ్రంథకర్త యగును గాని పైని చెప్పిన యోగముకన్న తక్కువ. కొంచెము లోపము న్నట్లు గ్రంథము చేయునన్నది సమంజసము కాదు. పైనుండు చంద్ర యోగముకంటె తక్కువ అని చెప్పుకొనుట కాకుండును.

135. సూ : బుధేన తతోఽపి.

పై విధముగా బుధ చంద్రదృగ్యోగము గలిగినప్పుడును గ్రంథ కర్త యగునుగాని శుక్ర చంద్ర దృగ్యోగముకంటెను తక్కువ.

136. సూ : శుక్రేణ కవిర్వాగ్మీ కావ్యజ్ఞశ్చ.

కారకాంశలగ్నమునకు పంచమమునగాని, నవమమునగాని శుక్రుడున్నను ఆరాసులనుచూచుచున్నను జాతకుడు కవిత్వధోరణి కలవాడును వక్తయు కావ్యములం దెలిసినవాడు నగును. శుక్రుడు చూచిన యీయోగము ఇంత యెక్కువగా చెప్పకూడదు.

137. సూ : గురుణా సర్వవిద్గ్రాంథికశ్చ.

కారకాంశలగ్న పంచమ నవమములలో గురుడున్నగాని, వానిని చూచుచున్నగాని సర్వము తెలిసినవాడగును. గ్రంథ పాఠ సమర్థుడును, గ్రంథములు జేయువాడును అగును. వీనికి నీచగ్రహాసంబంధమువలన ఈ విద్య నీచత్వముగా నుపయోగించును.

138. సూ : నవాగ్మీ.

కాని వక్తృత్వముమాత్ర ముండదు.

139. సూ : విశేష్యవైయాకరణో వేదవేదాంగవిచ్చ.

కారకాంశలగ్నమున గాని, పంచమమునగాని, గురుడుండిన వ్యాకరణ శాస్త్రమునుగాని, వేదమునుగాని, వేదాంగములగాని తెలిసినవాడగును.

140. సూ : సభాజడశ్శనినా.

కారకాంశలగ్న, పంచమ, నవమములలో శనియున్నగాని వానిని శని చూచుచున్నను సభాభీరుడగును. ఈ యోగము జన్మ లగ్నమునుబట్టి కూడ చూచుకొనవలయును.

141. సూ : బుధేః మీమాంసకః.

కారకాంశలగ్న పంచమ నవమములలో బుధుడున్నగాని వానిని బుధుడు చూచినగాని, మీమాంసశాస్త్రజ్ఞుడగును.

142. సూ : కుజేన నైయాయికః.

కారకాంశలగ్న పంచమ నవమములలో కుజుడున్నగాని, వానిని బుధుడు చూచినగాని జాతకుడు తర్కశాస్త్రజ్ఞుడగును.

143. సూ : చంద్రేణ సాంఖ్యయోగజ్ఞః
సాహిత్యజ్ఞో గాయకశ్చ.

కారకాంశలగ్న పంచమ నవమములలోగాని, జన్మలగ్న పంచమములలోగాని, చంద్రుడున్నగాని, వానిని చంద్రుడు చూచిన గాని, సాంఖ్యయోగము తెలిసినవాడుగాని, సాహిత్యము తెలిసిన వాడుగాని సంగీతశాస్త్రము తెలిసినవాడుగాని యగును.

144. సూ : రవిణా వేదాంతగీతజ్ఞశ్చ.

పై రాసులయందు రవి యుండెనేని వేదాంతముగాని సంగీతము గాని తెలిసినవాడగును.

145. సూ : గురుణాసంబంధేన సాంప్రదాయసిద్ధిః.

పై రాసులయందు గురుడున్న యెడల శాస్త్రసాంప్రదాయములు తెలిసినవాడుగాని, సాంప్రదాయసిద్ధమైన శాస్త్రములను తెలిసిన వాడుగాని యగును.

146. సూ : కేతునా గణితజ్ఞః.

కారకాంశలగ్నమునగాని, పంచమమందుగాని, కేతు వున్న యెడల గణితశాస్త్రము బాగుగా తెలిసినవాడగును.

ఇకముందు యోగములన్నియు ఆరూఢలగ్నమునుబట్టి చెప్ప బడును. ఆరూఢలగ్న మెట్లు కట్టబడునో దానిలోని యుక్తిప్రాయ భేదములను ఇదివరలో వివరించియున్నాము. కారకాంశలగ్నము నుబట్టికూడ చెప్పకొనవచ్చును.

153. సూ : వ్యయే సగ్రహే గ్రహదృష్టేహ శ్రీమంతః.

ఆరూఢలగ్నమునకు పదునొకండవయింట గ్రహములుండినను, ఆ స్థానమును గ్రహములు చూచినను, జాతకుడు శ్రీమంతుడగును.

154. సూ : శుభై ర్న్యాయ్యోల్లాభః.

ఆరూఢలగ్నమునకు ఏకాదశమున శుభగ్రహములుండినగాని, చూచినగాని, న్యాయమైన ధనార్జనకలవాడగును.

155. సూ : పాపై రమార్గేణ.

ఆరూఢలగ్నమునకు ఏకాదశమందు పాపగ్రహసంబంధమున్న యెడల అన్యాయార్జిత ధనలాభము కలుగును.

156. ఉచ్చాదిభి ద్విశేషాత్.

ఆరూఢ ఏకాదశమందు ఉచ్చగ్రహమున్నను, ఉచ్చగ్రహము చూచినను విశేష ధనలాభము కలుగును.

157. సూ : నీచే గ్రహదృగ్యోగాద్వ్యయాధిక్యం.

ఆరూఢలగ్నానికి వ్యయమందు చాల గ్రహములుండినను జూచి నను జాతకునకు ఆదాయముకంటె వ్యయమెక్కువ యగును.

158. సూ : పాపై పాపములాత్ శుభై శుభములాత్.

ఆరూఢలగ్నమునకు ద్వాదశమున పాపగ్రహము లున్నయెడల ధనము దుర్వినియోగ మగును. శుభులున్నయెడల సద్వినియోగము చేయును.

159. సూ : రవి రాహు శుక్రై ర్నృపాత్.

ఆరూఢలగ్నమునకు పంద్రెండవయింట రవి, రాహు, శుక్రులున్న

యెడల రాజమూలకముగా ధనవ్యయము కలుగును. లేక వివాద ములవలన అభియోగములవలన ధనవ్యయమగును.

160. సూ : చంద్రదృష్టే నిశ్చయేన.

ఆరూఢలగ్నమునకు కారకాంశలగ్నమునకు వ్యయమునందు రవి, రాహు, శుక్రులుండి చంద్రుడు చూచిన నిశ్చయముగా రాజ మూలక ధనవ్యయము తప్పదు.

161. సూ : బుధేన జ్ఞాతిభ్యో వివాదాద్వా.

ఆరూఢకారకలగ్నములో దేనికైన వ్యయమున బుధుడున్న జ్ఞాతులతో వివాదములవలన ధనవ్యయము, లేక వివాదములవలన గాని, జ్ఞాతులవలనగాని, ధనవ్యయము కలుగును.

162. సూ : గురుణా కర్మమూలాత్.

పాఠాంతరము సూ : గురుణా కరమూలాత్.

ఆరూఢమునకుగాని, కారకరాశికిగాని, పన్నెండవయింట గురు వున్న యజ్ఞయాగాది క్రతువులవలనగాని సత్రవులు మొదలగునవి స్థాపించుటవలనగాని ధనవ్యయము. పాఠాంతర సూత్రప్రకారము పన్నులు ఇచ్చుటకు ధనవ్యయ మగును.

163. సూ : కుజశనిభ్యాం భ్రాతృమూలాత్.

అరూఢకారకలగ్నములకు వ్యయమున కుజ శనులున్నయెడల సోదరీసోదరులవలన ధనవ్యయము.

164. సూ : ఏతద్వ్యయ ఏవం లాభః.

పైన చెప్పినట్లు క్రమముగా గ్రహములు ఏకాదశమందున్న యెడల ఆరీతుల ధనలాభము కలుగును. ఉ : ఆరూఢకారకలగ్న ములకు ఏకాదశమున బుధుడున్న జ్ఞాతులవలన ధనలాభము, కుజ శనులున్న సోదరీసోదరులవలనను, గురువున్న యజ్ఞయాగాది శుభ

కర్మలవలనను ధనలాభము. ఇట్లే 157 నుండి 163 సూత్రములకు నిర్ణయించుకొనవలయును.

165. సూ. రాహౌ రాహుకేతుభ్యా ముదరరోగః.

ఆరూఢకారకములకు సప్తమమందు రాహువుగాని, కేతువుగాని యున్న ఉదరరోగము కలుగును.

166. సూ : తత్ర కేతౌ నాభుశీర్జ్యాని లింగాని.

ఆరూఢలగ్నమునకుగాని, కారకలగ్నమునకుగాని, సప్తమమున కేతువున్న యెడల గుల్మవ్యాధి కలవాడగును.

167. సూ : చంద్ర (బుధ) గురుశుక్రేషు శ్రీమంతః.

ఆరూఢమునకు సప్తమమున చంద్ర, బుధ, గురు, శుక్రులున్న, జాతకుడు శ్రీమంతుడగును. ఈ యోగము ద్వితీయమునుబట్టి కొందరు చెప్పుచున్నారు. జన్మలగ్నమునుబట్టికూడ జరుగును.

168. సూ : ఉచ్చే నవా కేనాపి.

ఆరూఢ సప్తమమున ఏ గ్రహమైన యొక యుచ్చగ్రహమున్న జాతకుడు శ్రీమంతుడగును. ఈ యోగముకూడ లగ్నమునుబట్టి చూచుకొనవచ్చును. ద్వితీయమునుబట్టికూడ చూడవలెనని కొందరి యభిప్రాయము.

169. సూ : స్వాంశవదన్యత్రాప్యయేణ.

ఈ యోగములు కారకాంశలగ్నమునకు వలెనే చూచుకొనవలెను. అనగా నాయోగములు కారక, ఆరూఢ, జన్మలగ్నంలకు కూడ చూచుకొనవలెను.

170. సూ: లాభపదే కేంద్రే త్రికోణేవా శ్రీమంతః.

ఆరూఢలగ్నము జన్మలగ్నమునకు సప్తమముగాని, ఇతర కేంద్ర కోణములుగాని అయ్యేనేని జాతకుడు శ్రీమంతుడగును. ఈ సూత్రమునుబట్టికూడ జైమినీమహర్షి జన్మలగ్నమునకు (అనగా నది

వదలి) ఆరూఢము చేయుట ఇష్టములేనట్టుల తన యభిప్రాయము వెల్లడించెను.

171. సూ : తస్మిన్ స్వోచ్చే నీచే పితృలాభయోః శ్రీమంతః

ఆరూఢలగ్నమునందుగాని, కారకాంశలగ్నమునందుగాని వీనికి సప్తమమునందుగాని, బుధగురువులు ఉచ్చయందుగాని, నీచయందుగాని యున్నయెడల జాతకుడు శ్రీమంతుడగును.

172. సూ : స్వాంశవదన్యత్రాపి యోగః

పైనిచెప్పిన శ్రీమంతయోగములు తప్పక ఆరూఢలగ్నమునుబట్టియు కారకాంశలగ్నమునుబట్టియును చెప్పుకొనవలయును

173. సూ : తత్రశుక్ర చంద్రయోర్వాహనవతః.

కారకాంశలగ్నమునకుగాని. ఆరూఢలగ్నమునకుగాని. జన్మలగ్నమునకుగాని శుక్ర చంద్రులు లగ్న సప్తమములయందున్నయెడల జాతకునకు వాహనయోగము కలుగును.

174. సూ : తత్రశని కేతుభ్యాం గజతురగాఢ్యః

కారక, జన్మలగ్నములలోగాని, సప్తమములోగాని, శని కేతువులు కలిసియున్నయెడల ఏనుగులు, గుఱ్ఱములు కలవాడగును. అనుభవమునుబట్టి చూడగా ఈ యోగము పట్టినవానికి గుఱ్ఱపుస్వారియందును, ఏనుగు నెక్కుటయందును నిష్టముకలవాడుమాత్రమగుచున్నాడు.

175. సూ : శుక్ర కుజ కేతుషు స్వభాగ్యదారేషు స్థితేషు రాజానః.

శుక్ర కుజ కేతువులు, కారకాంశరాశికి ద్వితీయ, చతుర్థములయందుండినను, లేక కారకాంశరాశియందొకటియు, ద్వితీయమందొకటియు, చతుర్థమందొకటియు, ఒకరినొకరు చూచుకొనుచున్నను రాజగును. కాని ఈ యభిప్రాయ మంతబాగుగా

లేను. కారకాంశరాశికి ద్వితీయ చతుర్థములయందు గ్రహము లుండి ఒకరి నొకరు చూచుకొనుచున్న యెడల యీ యోగము ప్రబలముగాబట్టును. ఈయోగమునకు జైమినికృష్టిరేః ముఖ్యము.

176. సూ : పితృకర్మ లేయలాభయో గురౌ చంద్రశుభ దృగ్భ్యాం మండలాంతః.

కారకాంశలగ్నమునందుగాని, సప్తమమందుగాని, గురుడుండి వానిని చంద్రుడును, నితర శుభగ్రహములును జూచిన యెడల గొప్ప రాజగును. లేక మంచి రాజయోగమును పొందును.

177. సూ : తత్రశుభగురుదృగ్యోగా యువరాజో వా

పైని చెప్పిన కారకాంశలగ్నమునకు ఏకాదశమునకు, సప్తమమునకు బుధగురు సంబంధము కలిగిన యెడల, యువరాజగుటగాని, రాజకుటుంబ బంధువుడగుటగాని, సంభవించును.

178. సూ : సూర్యే చంద్రేఽష్ఫగురౌః ధనేషు శుభేషు రాజానః.

కారకాంశలగ్నమునకు పదకొండింట చంద్రుడుండి పదింట గురువుండి తొమ్మిదింట శుభులున్న యెడల జాతకుడు రాజగును.

179. సూ : పత్నీలాభయోశ్చరాశ్యం శకదృకారైర్వా.

ఈ చెప్పిన రాజయోగములు కారకాంశరాశినిబట్టిగాని దానికి సప్తమమునుబట్టిగాని చూచుకొనవచ్చును.

180. సూ: పంచమాంశపదే పిసమేషుశుభేషు రాజానువా

కారకాంశలగ్నాత్తు పంచమమునకు ద్వితీయ చతుర్థముల యందు రెండింటను శుభగ్రహములుమాత్రమే యున్నయెడల జాతకుడు రాజగును.

181. సూ : స్వలేయమేషాభ్యాం రాజచిహ్నాని.

కారకాంశలగ్నాత్తుగాని దానికి పంచమాత్తుగాని ద్వితీయ

చతుర్థ ఏకాదశములయందు మూడింటను సమముగా నైసర్గిక శుభులుమాత్రమే యున్న యెడల జాతకుడు రాజగును.

182. సూ: అన్యథా దుష్టే.

జన్మలగ్నమునకు ఆరూఢలగ్నము కేంద్ర త్రికోణములు గాక, లాభముగాని కాక ఇతర స్థానస్థమైన యెడల జాతకుడు దుఃఖవంతుడగును.

183. సూ: కేంద్ర త్రికోణోపచయేషు ద్వయోర్మైత్రీ.

ఆరూఢలగ్నమునకు, దారారూఢము కేంద్ర త్రికోణమైన యెడల భార్యాభర్తల కన్యోన్య మెక్కువగా యుండును. ఈ ఆరూఢలగ్నమునకు దారారూఢము ఉపచయస్థాన మయిన యెడలను మైత్రి కలుగును. (ఉపచయము లిక్కడ 3, 10, 11 స్థానములుమాత్రమే)

184. సూ: రిపురోగ చింతాసుద్వైరం.

ఆరూఢలగ్నమునకు దారారూఢము ద్వాదశ, అష్టమ, షష్టమ స్థానములలో నేదైననైన యెడల భార్యాభర్తల కన్యోన్యముండదు.

185. సూ: పత్నీలాభయో ర్దిష్ట్యా నిరాభాసార్గలయోః.

ఆరూఢ కారకలగ్న సప్తమములయందు శుభగ్రహములుండి ఒకరినొకరు చూచుకొనుచుండినేని శాశ్వతమైన ఐశ్వర్యము కలవాడగును.

186. సూ: శుభార్గళేన ధనసమృద్ధిః.

శుభగ్రహములు ఆరూఢలగ్నాత్తుగాని, కారకలగ్నాత్తుగాని రెండు, నాలుగు, పదకొండు స్థానముల నున్నప్పుడు మంచి ధనలాభము కలుగును. ఇచ్చట గ్రహములు సమముగా నుండుట మరింత మంచిది. ఈ యోగము జన్మలగ్నమునుబట్టికూడ చూడవచ్చును.

187. సూ: జన్మకాల ఘటికాస్వేకదృష్టాసు రాజానః.

జన్మలగ్నమును, హోరాలగ్నమును, ఘటికాలగ్నమును ఈ మూడింటిని ఒక్క గ్రహము చూచిన యెడల రాజగును. ఈ లగ్నములను కట్టువిధము వెనకనే చెప్పబడినది. జన్మకాలమునకు సూర్యోదయాది యెన్నిఘడియలు అయినవో చూచుకొనవలెను. సూర్యోదయాది ఒక్కొక్క రాశికి ఒక్కొక్క ఘడియ చొప్పున భాగించగా జన్మకాలఘడియ యేరాశియందుండిన నది ఘటికా లగ్నమగును.

188. సూ : రాశ్యా సకదుకాణై ర్వా.

కారకాంశలగ్నము, నవాంశలగ్నమును, ద్రేక్కాణలగ్నమును ఈ మూడింటిని ఒక గ్రహము చూచిన యెడల రాజయోగము. కాని కొందరు 187, 188 సూత్రములలో చెప్పిన ఆరూఢలగ్నము లలో నే మూడింటినైనను ఒకే గ్రహము చూచినయెడల రాజగు నని చెప్పుదురు. ఇది యనుభవమునకు వ్యతిరేకము.

189. సూ : న్యూనే దృగ్న్యూనం.

పైని చెప్పిన లగ్నములను ఒకే గ్రహము చూచినప్పుడు ఆ చూచుచున్న గ్రహము భాగాధికగ్రహమైనయెడల మహారాజు అగును. అట్లే పైనిచెప్పిన ఆరూఢలగ్నములలోను మూడుకంటె నెక్కువ జూచినను మరింత రాజయోగము. తక్కువభాగము భుక్తమైన గ్రహము చూచినయెడల యోగము తగ్గిపోవును.

190. సూ : శుక్రచంద్రయోః మిథోదృష్టయోః
సింహస్థయోః వాయానవతః.

శుక్రచంద్రులు ఒకరికొకరు 3, 11 ల యందుండి ఒకరినొకరు చూచుకొనుచుండిన యెడల మంచి వాహనయోగము కలుగును. ఈ సూత్రమునుబట్టి "మిథోదృష్టయో" అని చెప్పబడుటచేత ఒకరి నొకరు చూచుకొనుచుండవలెనని (జైమినిదృష్టి) జైమిని యుక్తి

ప్రాయముగా తోచుచున్నది [illegible] అనుభవ
మున సామాన్యప్రమాణము కలుగునని తోచుచున్నది.

191. సూ : శుక్ర [illegible] కేతుషు [illegible].

శుక్ర [illegible] కేతువులు ఒకరితో [illegible]
ఒకరినొకరు చూచుకొనుచున్నయెడల జాతకుడు ఛత్రచామరాది
రాజచిహ్నాలు పొందును.

192. సూ : స్వభాగ్యదారమాతృభావే
సమేషు శుభేషు రాజానః.

కారకలగ్నమునకు ద్వితీయ, చతుర్థ, పంచమములయందు
సమముగా శుభగ్రహములున్నయెడల రాజగును.

193. సూ : కర్మదాసయోః పాపయోశ్చ.

కారకాంశలగ్నమునకుగాని, జన్మలగ్నమునకుగాని, 3, 6 ల
యందు సమముగా పాపగ్రహములుండిన యెడల మంచి రాజయో
గము. పైని చెప్పినట్లు నైసర్గిక శుభులును, నైసర్గిక పాపులును
కూడ రెండు యోగములు ఒక జాతకునకే పట్టిన మహారాజయో
గము కలుగును.

194. సూ : పితృలాభాధిపాచ్చైవం.

పైని చెప్పిన యోగములన్నియును లగ్నాధిపతినిబట్టియు సప్త
మాధిపతినిబట్టికూడ చూచుకొనవచ్చును. కాని అనుభవమునుబట్టి
చూడగా సప్తమాధిపతివలన లగ్నాధిపతియందె ప్రయోజనము
న్నట్లు కనుపించదు.

195. సూ : మిశ్రేసమాః.

కారకాంశలగ్నమునకుగాని జన్మలగ్నమునకుగాని, ద్వితీయ
చతుర్థ పంచమములయందు శుభపాపగ్రహములు సమముగా కలిసి

యున్న యెడల యోగభంగము చేయక సామాన్యముగా మంచియో
గము చేయును.

196. సూ : దరిద్రా విపరీతే.

కారకాంశలగ్నమునకుగాని. జన్మలగ్నమునకుగాని 3, 6 ల
యందు సమముగా శుభులున్న 2, 4, 5 యందు పాపులున్న యె
డల జాతకుడు దరిద్రుడగును.

197. సూ : మాతరిగురౌ శుక్రేచంద్రేవా రాజకీయః

కారకాంశలగ్నమునకుగాని, జన్మలగ్నమునకుగాని పంచమ
మందు గురు, శుక్ర, చంద్రులున్నను గురుడుండి శుక్ర చంద్రులలో
నొకరు కలిసినను రాజకీయాధికారము కలవాడగును. అనుభవ
మునుబట్టి చూడగా గురుచంద్రులు కలియుటకంటె గురుశుక్రులు
కలియుట రాజకీయాధికార యోగమునకు కారణ మగుచున్నది.
శుక్రుడొక్కడున్నను ఈ యోగము కొంచెము తగ్గి యుత్తము
మైన యోగము కలుగుచున్నది. గురు చంద్రులు విడిగాయున్న
ఈ యోగము చెప్పకూడదు.

198. సూ : కర్మణిదాసేవా పాపే సేనాన్యః.

కారకాంశలగ్నమునుబట్టిగాని, జన్మలగ్నాత్తుగాని, 3 న గాని,
6 న గాని, పాపగ్రహము లున్న యెడల సేనాధిపతిగాని మిక్కిలి
పౌరుషవంతుడుగాని యగును.

199. సూ : స్వపితృభ్యాం, కర్మధాసస్థ
దృష్ట్యాతదీశ దృష్ట్యాచ.

లగ్నాత్తుగాని, కారకాత్తుగాని 3, 6 స్థానముల గ్రహములుండి
లగ్నాధిపతినిగాని, కారకాంశ లగ్నాధిపతినిగాని చూచిన సేనా
నాయకుడగును. ఈ 3, 6 ల యందున్న గ్రహములు 3, 6 అధి
పతులను జూచినను ఈ యోగము చెప్పవచ్చును.

200. సూ : మాతృనాథదృష్ట్యాఢ్యః సంతః.

కారకాంశలగ్నమునుగాని! జన్మలగ్నమునుగాని పంచమాధిపతి చూచినయెడల మంచి బుద్ధిమంతుడగును.

201. సూ : జాతేశదృష్ట్యాసుఖినః.

కారక లగ్నమునుగాని, జన్మలగ్నమునుగాని చతుర్థాధిపతి చూచినయెడల జాతకుడు మంచి సౌఖ్యముగలవాడగును.

202. సూ : రిపుభోగదృష్ట్యా వ్యయశీలాః.

పాఠాంతరము సూ : రోగేశదృష్ట్యా దరిద్రాః.

కారక లగ్నమునుగాని, జన్మలగ్నమునుగాని, వ్యయాధిపతి చూచినయెడల జాతకుడు ధనవ్యయము చేయువాడగును. పాఠాంతర సూత్రప్రకారము అష్టమాధిపతి చూచిన దరిద్రుడగును. పై సూత్రప్రకారము ఖర్చుపెట్టువాడుగాని, దరిద్రుడు కాడు. ఈ యభిప్రాయమే సమంజసముగా నున్నది.

203. సూ : స్వామిదృష్ట్యాప్రబలాః.

జన్మలగ్న కారకలగ్నములు ఆజన్మలగ్న కారకలగ్నాధిపతులతో చూడబడిగాని,! కూడబడిగాని యున్నయెడల మంచి రాజయోగము కలుగును. పైని చెప్పిన రాజయోగములుపట్టి యుదికూడ కలిగినయెడల పై రాజయోగమునకు మరింత ప్రబలము.

204. సూ : పంచామాత్ రిపుభాగ్యతో:

గ్రహ సామ్యే బంధః.

కారకలగ్నాత్తుగాని, జన్మలగ్నాత్తుగాని, పంచమమునకు 3, 12 ల యందు అనగా 4, 6 ల యందు పాపగ్రహ సామ్యమున్న యెడల జాతకుడు కారాగృహవాసి యగును. (పంచమమునకు పాపార్గళము) పాపగ్రహసామ్యము లేక పాపగ్రహములున్నచో ఈ

యోగమువట్టును. శుభగ్రహసాన్నిధ్యము చతుర్థ దశమములకు పట్టిన అర్గళ అనుభవమునకు విరుద్ధము.

205. సూ : కేంద్రయుగ్మే దారా దిష్ఫయోశ్చ.

కారకాంశలగ్నమునకుగాని, జన్మలగ్నమునకుగాని తృతీయ, ఏకాదశములయందు పాపగ్రహసాన్నిధ్యము పట్టినయెడల శృంఖలాబద్ధుడగును. అట్లే 4, 10 ల యందును పాపగ్రహ సామ్యమున్న యెడలను ఈ యోగము చెప్పవలయును.

206. సూ : ఏవమ్మాతౄణాం తదీశానాం వా చ.

ఈ రాసులకువలెనే ఆ భావాధిపతులనుబట్టికూడ ఈ పాపార్గళ పట్టినప్పుడీయోగము కలుగును. అనగా పంచమస్థానమునకేగాక, పంచమాధిపతికిని పాపార్గళ యున్నను ఇట్లే ఇతరులనుగూడ చూచుకొనవలెను.

207. సూ : శుభసంబంధాత్ నిరోధమాత్రః.

పైని చెప్పిన యోగములకు శుభగ్రహ సంబంధము కలిగిన యెడల పాపులుండినను, సర్గళయోగము పట్టినంతవరకు జరిగి వదలి వేయును. పంచమమందు శుభుడుండి ఆ స్థానమునకు కేవలము పాపార్గళ పట్టినను ఈ యోగము ప్రబలముగా పట్టక, పట్టినంత గడబిడ చేయును. అట్లే మిగతాభావములకును జూచుకొనవల యును. (4, 10, 11 స్థానములు)

208. సూ : పాపసంబంధాత్ శృంఖలప్రహారాదయః.

పైని చెప్పిన స్థానములకు అర్గళముపట్టి శుభసంబంధము బొత్తిగా లేనప్పుడు సంకెళ్ళు వేయబడి దెబ్బలు తినువాడై కారాగృహవాసము చేయును.

209. సూ : శుక్రాద్గౌణపదస్థో రాహు
సూర్యదృష్టో నేత్రహాని.

తాత్పర్యము సూ : శుక్రే గౌణపదస్థే రాహు

సూర్యదృష్టౌ నేత్రహానిః.

కారకాంశ రాశికిగాని, జన్మలగ్నమునకుగాని ద్వితీయమునందు
శుక్రుండుండి, రవిరాహువులచే చూడబడుచున్న శుక్రుడు రవి రాహు
వులతో గూడియుండి, శుక్ర రాహువులలో నెవ్వరైనను చూచుచు
న్న, నేత్రహాని కలుగును. శుక్ర రవి రాహువులలో నొక్క
డైనా వీరి చూపు లేకపోయినను ఈ యోగము పట్టును. ఈ విష
యమై వ్యాఖ్యాతలనేక విధములుగా చెప్పినారు. దీనికి కారణము
గౌణపదమనగా వేరువేరు రకముల వ్యాఖ్యానములు పొందుటయే. నీలకంఠీ
యము మొదలైన అచ్చువ్యాఖ్యానములలో గ్రంథకర్తలు గౌణ
పదమన పంచమమని భావించినారు. కాని కొన్ని వ్రాతగ్రంథము
లలో "గౌణశబ్దేన ద్వితీయముచ్యతే" యని వ్రాసినారు. నేత్రస్థా
నము ద్వితీయ మగుటచే ఈవ్యాఖ్యానమే సమంజసముగానున్నది.
శుక్రుడు నేత్రకారకు డగుటచేతను, కారకుడు భావమునందుండుట
భావమునకు నష్టమగుటవలనను ఈ వ్యాఖ్యానమే ఆమోదించ
దగినది. పంచమమునకును, నేత్రమునకును నేమియు సంబంధము
లేదు. పాఠాంతర సూత్రమే మిక్కిలి బాగున్నది.

210. సూ : స్వదారగయో శ్శుక్రచంద్రయో

రాతోద్యం రాజచిహ్నానిచ.

కారకలగ్నాత్తు చతుర్థమున శుక్రచంద్రులు మాత్రమే యున్న
ఛత్రచామరాది రాజచిహ్నాలు కలవాడగును. ఈ యోగము
జన్మలగ్నమునుబట్టి చూచుకొనగూడదు.

211. సూ : ఉపపదం పిత్రనుచరాత్.

జన్మలగ్నమునకు వెనుకనున్న రాశి ఉపపదము. అనగా ద్వాద
శమునుబట్టి ఉపపదము నిర్ణయింపబడినది. జన్మలగ్నాత్తు వ్యయాధి

పతి వ్యయస్థానమునకు ఎన్నవయింట నుండునో దాని కన్నవయిల్లు
ఉపపదమనబడును. ఇందుకు శాస్త్రప్రవృత్తి సంగ్రహమున :—

శ్లో. భవేదుపపదః లగ్నాదారూఢాదారూఢమత్రచ
ఏవంద్వాదశభావానాం సంక్షేపాపరికీర్త్యతే.

అని చెప్పబడియున్నది.

212. సూ : తత్ర పాపస్య పాపయోగే
ప్రవ్రజ్యాదార నాశోవా.

ఈ ఉపపదములో చెప్పిన యోగములన్నియు ఉపపదాత్తు ద్వితీయమునుబట్టి చూచుకొనవలయును.

ఉపపదాత్తు ద్వితీయమున పాపగ్రహముండి పాపగ్రహముచే చూడబడుచున్న యెడల సన్న్యాసయోగముగాని, కళత్ర నష్టముగాని చాలకాలమునకు పెండ్లికాకుండుటగాని జరుగును. ఇందుకు పరాశర్యమున ఇట్లున్నది.

శ్లో. జామిత్రారూఢగే పాపే జామిత్రే వాధనేపిచ
లగ్నాద్భాగ్యగతే రాహౌ దారహాని వినిర్దిశేత్.

213. సూ : ఉపపదాన్యావ్యారూఢద్వా దేవనాత్రరవిపాపః

ఉపపదమునకు ద్వితీయమున రవి యున్నను హాని చేయడు. అనగా కళత్రమువిషయమై రవి పాపికాడు.

214. సూ : శుభదృగ్యోగాన్న.

ఉపపదాత్తు ద్వితీయమందు పాపులున్నను శుభసంబంధమువల్ల కొంత పాపత్వము తగ్గును. కేవలము శుభులున్న యెడల పరాశర్యములో చెప్పబడిన ద్వికళత్రయోగముల కన్నిటికి భంగము చెప్పవలయును. (ద్వితీయమందు గురుడుండిన యెడల ఈ శుభయోగము ప్రబలమై యెన్ని ద్వికళత్రయోగములు పట్టినను ద్వికళత్రయోగము జరుగదు.

215. సూ: నీచేదారనాశః.

ఉపదాత్తు ద్వితీయమున నీచగ్రహ మున్నయెడల కళత్రనష్ట మగును.

216. సూ: ఉచ్చే బహుదారాః.

ఉపపదాత్తు ద్వితీయమున ఉచ్చగ్రహమున్నయెడల బహుభార్యలుకలవాడగును. ఇది ఎల్లప్పుడు జరుగునని చెప్ప వీలులేకున్నది. ఉచ్చగ్రహము ద్వితీయమందున్నయెడల భార్య సుఖముకలుగునని యగును. ఈ యభిప్రాయమే అనుభవమునకు సరిపోవుచున్నది.

217. సూ: యుగ్మేచ.

ఉపపదాత్తు ద్వితీయము మిధునమై అందు శుభగ్రహము ఉచ్చయందున్నను, జాతకుడు బహుభార్యలు కలవాడగును. కొందరు ముగ్గురు భార్యలు కలవాడగునని చ కారమునుబట్టి చెప్పుదురు. ఈ యోగమును పరాశర్యమున ద్వికళత్రయోగము కలుగనియెడల చెప్పకూడదు.

218. సూ: తత్రస్వామి నాయుక్తే స్వక్షేత్రేవా
తథైవోత్తరాయుషి నిర్దారః.

ఉపపదాత్తు ద్వితీయమందున్నది పాపగ్రహమై వీనికి ఉపపదాత్తు ద్వితీయము స్వక్షేత్రమై యందున్నయెడల. జాతకుని ఆయుర్దాయము రెండుభాగములుచేసి, ఆ రెండుభాగములలో కళత్రనష్టము కలుగునని చెప్పవలెను, ఇందుకు బార్హస్పత్య సంగ్రహమిట్లు చెప్పుచున్నది.

శ్లో. సప్తమాధిపతి పాపః సప్తమే లగ్నగేధవా
స్థితో యది విభార్యస్స్యాత్ జాతకః పరాయుషి.

ఇదిగాక విశేషముకూడ నేమనగా

శ్లో. కామత్రికోణగే రాహుః పాపు తేనేక్షితే త్రితే
వివాహరహితో యద్వానష్టదార్యాన్మృతిం ప్రపేదతి.

119. సూ : ఉచ్చే తస్మిన్నుత్తమకులాద్దారలాభః.

ఉపపదాత్తు ద్వితీయమందు ఉచ్చగ్రహమున్నయెడల మంచి కుటుంబమునకు చెందిన భార్యకలవాడగును. కొందరు "స్వకులాపేక్షయా ఉత్తమకులాద్దారలాభో భవతీర్థ్యః" అని వ్రాసియుండుటల, తనవంశముకంటెను భార్యవంశము ఉత్తమవంశమని చెప్పవలసియున్నది. ఇందుకు బారహాస్పత్యమున :

శ్లో. వర్గోత్తమాంశే స్వక్షేత్రే ఉచ్చేవాస్య పదమాధిపః
స్థితశ్చే దుత్తమకులాద్భార్యా లాభో భవేధ్రువం.

శ్లో. సప్తేశో యదాశుక్రాః క్రూరరాశ్యంశకేస్థితః
దుర్బలోవ్యయగోవాపి వివాహస్తత్రదుర్లభః.

శ్లో. శుభో సప్తధవాశుక్రోజన్మకాలేయదాభవేత్
సహాస్థితో లగ్నపేవ బాల్య ఉద్వాహకారకః.

శ్లో. బాల్యే వివాహయోగాం శ్చశాక్రేశనియుతేక్షితే
బాల్యే వివాహమాప్నోతి లగ్నేశే సప్తమస్థితే.

శ్లో. జామిత్రే పాపసంయుక్తే శుభాంశే లగ్ననాయకే
జామిత్రేశే విలగ్నస్థే బాల్యేఉద్వాహమవాప్నుయాత్.

220. సూ : నీచే విపర్యయః.

ఉపపదాత్తు ద్వితీయమందు నీచగ్రహమున్నయెడల భార్య తనవంశముకంటె తక్కువ వంశములోనిది కావలయును. ఇందుకు పరాశర్యమున

శ్లో. నీచశ్చేత్సప్తమాధీశ నీచేవాసప్తమేస్థితః
వివాహోనభవేద్యద్వా ఓఢావాపాంశులాభవేత్.

221. సూ : శుభసంబంధాత్సుందరీ.

ఉపపదాత్తు ద్వితీయమున శుభగ్రహములున్న భార్య రూపవతి యగును.

శ్లో. సౌమ్యదృష్టో యోగయుక్తోపపదే శుభాస్థితేస్సదా.
దారాధీశస్తుతస్సౌమ్యః కళత్రం లభతే ప్రియాం

222. సూ : రాహుశనిభ్యామపవాదాత్త్యాగో నాశో వా.

ఉపపదాత్తు ద్వితీయమున శని రాహువులున్న యెడల భార్యకు అపవాదమువలనగాని, దెబ్బలాటలవలనగాని విడిచిపెట్టుటయు, లేక విషము పెట్టి చంపుటయు సంభవించును. వీరికి శుభదృష్టి కలిగిన యెడల ప్రథమమున భార్యాభర్తలు విడిపోయినను తర్వాత నన్యోన్యము ప్రేమకుదిరి కలియుదురు.

223. సూ : శుక్రకేతుభ్యాం రక్తప్రదరః.

224. సూ : అస్థిస్రావో బుధకేతుభ్యాం

ఉపపదాత్తు ద్వితీయము శుక్రకేతువులున్న భార్యకు రక్తప్రదరరోగము కలుగును. ఇందుకు పారాశర్యమున

శ్లో. సప్తమే కుజసంబంధా త్త్రికోణే దివాకరః
స్థితశ్చే ద్గురుణాదృష్ట స్తస్యాస్థి స్రావకోభవేత్.

ఉపపదాత్తు ద్వితీయమున బుధకేతువులుగాని, బుధునుగాని యున్న యెడల రక్తస్రావముగాని, తెలుపుగాని అగును. గర్భపాతముగూడ కలుగును.

225. సూ : రవిరాహుశనిభిరస్థిరజ్వరః

పాఠాంతరము సూ : శనిరవిరాహుభిరస్థిజ్వరః.

ఉపపదాత్తు ద్వితీయమందు రవిశని రాహువు లున్న యెడల భార్య ఎల్లప్పుడు జ్వరపీడితురాలై క్షయరోగమునకు గురియగును. పాఠాంతర సూత్రప్రకారం భార్యకు అస్థిజ్వరము అనగా నెముకనుపట్టిన జ్వరము కల్గును. ఇందుకు బారహస్పత్య సంగ్రహమున

శ్లో. జామిత్రాధారూఢగస్సూర్యః కేతునావాథ రాహుణా
దృష్టోయదికళత్రస్యాద్గ్రహాంపాశిరోరుజా.

శ్లో. అష్టమాధిపతౌ పాపక్షేత్రే పాపేన సంయుతే
దృష్టకళత్రాక్షిరోగస్స్యాథ పాపోర్యథపాధిభిః.

శ్లో. శుభక్షేత్రే రంధ్రనాథే శుభగ్రహసమన్వితే
శుభపాపగ్రహైర్యుక్తే దృష్టేనా రంధ్రనాయకే
బహుకాలం భవేద్రోగీపశ్చాత్ ముక్తేతయత్నతః.

22?. సూ : బుధశుక్రభ్యాంస్థౌల్యం.

పాఠాంతర సూ : బుధకేతు భ్యాం స్థౌల్యం.

ఉపపదాత్తు ద్వితీయమున బుధశుక్రు లున్నయెడల మిక్కిలి స్థూలశరీరముగల భార్యకలవాడగును. పాఠాంతరము సూత్రప్రకారము బుధకేతువు లుండవలెను. బుధశుక్రులే సరిగా నున్నట్లు అనుభవమువలన తెలియుచున్నది. దీనికి పూర్వపరాశరి

శ్లో. దారారూఢే బుధక్షేత్రే గురుక్షేత్రే ధవాయది
తత్రస్థౌ బుధశుక్రౌచేత్ స్థూలాంగీ మహిళాభవేత్.

శ్లో. దారారూఢే బుధక్షేత్రే భార్యాలంబస్తనీభవేత్
పాపక్షేత్రేథ వేశ్చైవ శుష్కలంబస్తనాన్వితా.

శ్లో. దారారూఢే శుభక్షేత్రే భౌమాంశే కేతువీక్షితే
కుజదృష్టేధవాభార్యా స్తనవ్రణతీభవేత్.

శ్లో. దారే శ్లోవాథశుక్రోవా పాపాంశస్థోయదాభవేత్
పాపై నవీక్షితశ్చేద్వా కృశదేహాభవేత్ప్రియా.

శ్లో. దారారూఢే మిథునే శనినాచనిరీక్షితే
పుత్రోత్పవాత్పరం భార్యాపాయునాబధిరాభవేత్.

227. సూ. శుభదృగ్యోగాప్న.

ఉపపదాత్తు ద్వితీయమునకు శుభగ్రహసంబంధమున్న యెడల పై యోగములకు కొంత భంగము కలుగును.

228. సూ : సప్తమాంశగ్రహేభ్యశ్చైవమ్.

జన్మలగ్నాత్తుగాని కారకాంశలగ్నాత్తు సప్తమాధిపతినిబట్టికూడ ఈ పై యోగములు చూచుకొనవలయును.

229. సూ : బుధక్షేత్రే మందారాభ్యాం నాసికారోగః.

సూ : కుజక్షేత్రే చ.

ఉపపదమునకు ద్వితీయమున శని కుజు లుండిన యెడల భార్యకు ముక్కుసంబంధమైన రోగములు కలుగును. ఈ ఉపపదాత్తు ద్వితీయము కుజక్షేత్రమయిన ఈ యోగము మరింత ప్రబలము. ఇందుకు సంగ్రహమున

శ్లో. కుజక్షేత్రే కుజాంశస్థే మందేకుజసమన్వితే
మిత్రాంశకగతేవాపిచ సత్కుశత్ర ప్రియోభవేత్.
శ్లో. కుష్ఠరోగీ కుబీరాంశే భార్గవాంశే సుపుత్రిణీ
సుగుణీ శనిజాంశస్థే జీవాంశే సుపతిప్రియా.
శ్లో. వృశ్చికాంశే సదారోగీ పతినిందా పరాభవేత్
నుర్గుణా రవిజాంశస్థే మందారాభ్యాం ఫలంవదేత్.

230. సూ : గురుశనిభ్యాం కర్ణరోగః.

ఉపపదాత్తు ద్వితీయమున గురుశనులున్న యెడల భార్యకు కర్ణరోగము కలుగును. ఇందుకు పూర్వపరాశరియందు

శ్లో. కర్ణవేధాంశగేజీవే పదేవా శనివీక్షితే
శ్రోత్రేంద్రియ శ్రుతాదీనాం భార్యాక్లేశవతీభవేత్.
శ్లో. భాగ్యాధిపే కేతుయుతే నవమే శనివీక్షితే
మందేశశిసందృష్టే భిన్నకర్ణా భవేత్ప్రియా.

231. సూ : ఉపపదే శనిరాహుభ్యాం కన్యాతులయోః
పంగుర్వాతరోగా వా.

సూ : శుభదృగ్యోగాన్న.

ఉపపదాత్తు ఏకాదశమందు గాని, వ్యయమందుగాని, శని రాహువు లుండిన యెడల భార్య వాతరోగము కలదిగాని, కుంటిది గాని యగును. ఇచ్చట కన్యాతులశబ్దములకు కొందరు వ్యాఖ్యాతలు ఉపపదాద్ద్వితీయము కన్యగాని, తులగాని యై యందు శని రాహువులున్న ఈయోగము కలుగునని వ్యాఖ్యానము చేయుచున్నారు. కాని కన్యాతులాశబ్దములకు అక్షరసంజ్ఞ చేత 11, 12, రాసులసంఖ్య యగుచున్నది. ఇది బృహస్పతికూడ ఒప్పుకొనినట్లు కనిపించుచున్నది. ఇందుకు భారహస్పత్య సంగ్రహమున

శ్లో. ఏకాదశే వ్యయేవాపి శనిరాహుస్థితే యది
స్త్రీ ప్రజావిధవా బాల్యేభవేత్పుంసాతు దుర్మతేః.

శ్లో. రంధ్రేవాత త్రికోణేవాయుదః పాపాంశసంయుతా
స్థితశ్చేద్విధవాపుత్రీ భవే దల్పాయురాత్మజాః.

అని భార్యగురించి యోగమును ఏకాదశవ్యయములకు జెప్ప బడియున్నది. వీనికి శుభగ్రహ సంబంధము కలిగినయెడల నీ యోగము చెప్పకూడదు.

232. సూ : బుధ శని శుక్రేష్వనపత్యః.

ఇకముందు ఉపపదాత్తు పంచమమునుబట్టి సంతానయోగము చెప్పబడును. ఇచ్చట జైమినిమహర్షి గ్రహములను ఇక చెప్పఁ బోవు సూత్రములనుబట్టి మూడురకములుగా విభజించినట్లు కనఁ బడుచున్నది. అందు (1) రవి, గురు రాహువులు బహుపుత్ర గ్రహము (2) చంద్రుడు ఏకపుత్రగ్రహము (3) బుధ శుక్ర శని కుజులు అనపత్య గ్రహములు అనగా గొడ్డు గ్రహములు.

ఇచ్చట నేకపుత్రగ్రహముగు చంద్రుడు బహుపుత్రగ్రహములతో గలసినప్పుడు బహుపుత్రయోగము నిచ్చును. అనపత్యగ్రహములతో కలిసినప్పుడు ఒకనికంటె యెక్కువపుత్రులు కలిగినను చిరంజీవియైనవా డొక్కకుమారుడే చివరకు మిగులును. అట్లే శని అనపత్యగ్రహములతో చెప్పబడినను కన్యాతులాలగ్నములకుమాత్రము స్వక్షేత్రవర్తియైన యెడల ఒకరిద్దరు తక్కువ కాకుండ మగసంతాన ముండును.

ఇక సూత్రార్థము: ఉపపదమునకు పంచమమున బుధ, శని, శుక్రులుండిరేని అనపత్యయోగము అనగా పుత్రసంతాన ముండ దని యర్థము; కాని. శని యొక్కడున్న యెడల స్త్రీసంతాన ముండవచ్చును. వృద్ధకారికలు ఇట్లు చెప్పును.

శ్లో. పంచమే నవమే చైవ వంధ్యాంశే చేత్తతశ్శనిః
వంధ్యా పతిస్స్యాద్వేజ్జాతః శుభాంశే పుత్రవాన్ భవేత్.

శ్లో. పుత్రలాభాంశగేమందే పంచమే నవమేధవా
కాలాంతరే మతప్రాప్తిః యద్వాదారాంతరే భవేత్.

శ్లో. పంచమాధిపతిః జీవః తథాసీ పుత్రకారకః
వంద్యాంశగశ్చే జాతస్యనస్యాత్కామారణాంప్రజా.

233. సూ : శనిమాత్రస్థితే మృతప్రజా.

234. సూ : పుత్రేషు

ఉపపదాత్తు పంచమమున శనిమాత్ర మున్నయెడల పుత్రసంతానము లేనివాడగును. లేక పుత్రసంతానము నష్టముగాని కలుగును. స్త్రీసంతానముమాత్ర ముండవచ్చును. అది కన్యాతులాలగ్నములకు వర్తించదు. ఇందుకు పరాశర్యమున,

శ్లో. విక్రమే శుభస్థానే తదీశే శుభసంయుతే
లగ్నాద్భాగ్యగతేమందే బహుపుత్రార్థభాగ్భవేత్.

శ్లో. లాభాధిపేన సహితే సుతేశే పాపసంస్థితే
సుతాయాం ధేధవా సూర్యే బహుపుత్రార్థవాన్భవేత్.

235. సూ : రవిరాహుకేతుభిః బహుపుత్రః.

ఉపపదాత్తు, లగ్నాత్తుగాని పంచమమందు రవి రాహుకేతు లున్నయెడల జాతకుడు బహుపుత్రులు కలవాడగును. దీనికి సంగ్రహమందు

శ్లో. జీవః పంచమనాథశ్చ పుత్రకారక యేవచ
స్త్రీకాలాంశేస్థితేపుత్రీపుంకాలాంశేతుపుంప్రజా.

శ్లో. అష్టమేవావ్యయేవాపిస్థితే మందోయదాభవేత్
తస్యపుత్రోభవేన్నిత్యం అమంగళ్యాచ దుఃఖభాక్.

శ్లో. రంధ్రత్రికోణే దిననాథపుత్రే లగ్నాష్టమాంశేతు బలైర్విహీనే
జాతస్యపుంసః ఋణపాతకాఖ్యాత్ దుష్టంప్రయోగః విదితపురాణైః

236. సూ : చంద్రేణైకపుత్రః

ఉపపదమునకు, జన్మలగ్నమునకు, పంచమమందు, నవమమందు చంద్రుడున్నయెడల జాతకునకు ఒక పుత్రుడుండును. వీనిలో నింకను పుత్రకారక గ్రహములు చూచినను బహుపుత్రయోగ మును కలుగును. ఇందుకు సంగ్రహమున

శ్లో. లగ్నాత్ పంచమగే చంద్రేనవమస్థానగేధవా
ఏకపుత్ర శ్చిరంజీవే దన్యేషాం మృతిర్భవేత్.

శ్లో. పంచమే నవమే చంద్రే బహుగ్రహసమన్వితే
జాతకో బహుపుత్రాస్స్యాశ్శుంభాంశకగతే సతి.

237. సూ : మంత్రేవిలంబాత్ పుత్రః.

ఉపపదాత్తు పంచమమందు కొన్ని బహుపుత్రగ్రహములు కొన్ని

అనపత్యగ్రహములు కలిసియున్న యెడల జాతకునకు పుత్రసంతాన మాలస్యము గలుగును.

238. సూ : కుజబుధాభ్యాం దత్తపుత్రః.

పాఠాంతరం సూ : కుజశనిభ్యాం దత్తపుత్రః.

ఉపపదాత్తు పంచమమునగాని. జన్మలగ్నాత్తు పంచమమునగాని కుజబుధులున్న యెడల దత్తత యోగము కలుగును. ఉపపదాత్తు పంచమమునకుగాని లగ్నాత్తు పంచమమునకుగాని శని బుధులున్నను, కుజ బుధులున్నను, శనికుజులున్నను ఈ యోగము కలుగును. ఇందుకు పరాశర్యమున

శ్లో. పుత్రస్థానే బుధక్షేత్రే మందక్షేత్రేథవాయది
మందమాందీయుతం దృష్ట్వా దత్తపుత్రధివాసకం.

సంగ్రహమున

శ్లో. శారకాబ్యాసుతేశాబ్యా పంచమే నవమేథవా
భానుతే బుధసంయుక్తే జాతన్యా దత్తపుత్రవాౕ

శ్లో. చంద్రలగ్నాష్టమేమందే చంద్రాల్లాభే చవిక్రమే
భృగుజేనయుతేదృష్టే జాతోనిస్సంతతిర్భవేత్

శ్లో. లగ్నేశ్చ చంద్రలగ్నేశ్చ నవమే పంచమేథవా
కవినాసంయుతే మందే సుఖీవంధ్యాపతిర్భవేత్.

శ్లో. జీవో లగ్నాధిపో దారనాథః పంచమనాయకః
కామత్రికోణగేమందే సంతతేర్విఘ్న మాదిశేత్.

239. సూ : ఓజే బహుపుత్రః

ఉపపదాత్తు పంచమము బేసి రాశియై యందు పుత్రకారక గ్రహములున్న యెడల నెక్కువ సంతానము కలవాడగును.

240. సూ : యుగ్మే అల్పపుత్రః

ఉపపదమునకు పంచమము సరిరాశియై అందు బహుపుత్రకా

రక గ్రహము లున్నను కొంత సంతానమునకు నష్టముకలిగి అల్ప సంతానవంతు డగును.

241. సూ : శుక్రేతదీశే పంచమాంశే గ్రహేభ్యంచైవా.

ఈ యోగములు లగ్నలగ్నాధిప పంచమాంశ గ్రహములకు పంచమస్థానములకుకూడ చూచుకొనవలయును. కాని అనుభవ మునుబట్టి చూడగా ఈ సంతాన యోగములు లగ్నాత్తుగాని ఉప పదాత్తు పంచమమునకు సరిపోవును. పంచమాత్తు పంచము మునకు భాగ్యమందున్నను ఈ గ్రహములు పైని చెప్పిన ఫలిత ముల నిచ్చెదరు.

242. సూ : భ్రాతృభ్యాం శనిరాహుభ్యాం భ్రాతృనాశః

ఉపపదా తృతీయైకాదశమములయందు శని రాహువులున్న యెడల తనకంటెముందు భ్రాతృనాశనము కలుగును. శనిమా త్రము తృతీయమందుండిన అనుభవములో జ్యేష్ఠభ్రాతృలున్నను లేకపోయినను కనిష్ఠ సోదరవృద్ధి బాగుగానున్నది. రాహువు మాత్రము సోదరక్షిమయమున చెడ్డవాడు. ఈ రాహువు కుజునితో గలసి యచ్చట నున్నయెడల చిక్కులి పాపియగును.

243. సూ : శుక్రేణ వ్యవహిత గర్భనాశః.

ఉపపదా తృతీయైకాదశములలో నెక్కడనైనను శుక్రున్న యెడల, అనగా నేకాదశమమున శుక్రుండిన జ్యేష్ఠ భ్రాతృసం బంధమైన గర్భము నష్టమగును. తృతీయమందున్న తన తరువాత గర్భము (కనిష్ఠ భ్రాతృ) నష్టమగును. లేక సూత్రార్థప్రకారం జ్యేష్ఠభ్రాతృని తరువాత జ్యేష్ఠభ్రాతృడుగాని, కనిష్ఠభ్రాతరు వాత కనిష్ఠభ్రాతృడుగాని నష్టమగును. (వ్యవహిత గర్భమనగా నిది యర్థము.)

244. సూ : పిత్రుభావే సుక్రేక్ష్మ దృష్టేపి.

ఈ యోగము లగ్నమునకుగాని, లగ్నాష్టమమునకుగాని, శుక్రుడు చూచుచుండినను కలుగును అష్టమమును జైమిని దృష్టిప్రకారము చూచును.

245. సూ : కుజ గురు చంద్ర బుధై ర్బహు భ్రాతరః.

ఉపపద తృతీయమునగాని, ఏకాదశమునగాని కుజ, గురు, చంద్ర, బుధు లున్నయెడల బహుమంది సోదరులు కలవాడగును. కుజుడుమాత్రముతప్ప ఇతరులు జన్మలగ్నమునకు 3 స్థానములయందున్నను ఈ యోగము కలుగును. కుజుడు జన్మలగ్నమునకు తృతీయమం దున్నను కనిష్టసోదరు లుండరు.

246. సూ : శన్యారాభ్యాం దృష్టే యథాస్వం భ్రాతృనాశః.

ఉపపదా తృతీయైకాదశములకు శనికుజులు చూచిన భ్రాతృనాశనము చేయుదురు.

247. సూ : శనినాస్వమాత్ర శేషశ్చ.

ఉపపదమునకు తృతీయైకాదశములు శనిచే చూడబడిన తానొక్కడై యుండును. ఇది అనుభవమునకు విరుద్ధము.

248. సూ : కేతౌ భగినీబాహుళ్యమ్.

ఉపపద తృతీయైకాదశమములయందు కేతు వుండగా అక్కచెల్లెండ్ర వృద్ధి యెక్కువ. ఈ యోగము ఒకప్పుడు దానికి వ్యతిరేక ఫలములుకూడ గలుగవచ్చును. దీనికి కారణము కేతువునకు బహుసోదర కారక గ్రహముల సంబంధము కలుగుటయే.

249. సూ : లాభేశాద్భాగ్యభే రాహౌ దంష్ట్రావాన్.

ఉపపదమునకు ద్వితీయమునగాని, సప్తమాధిపతికి ద్వితీయమునగాని, రాహువున్నయెడల పెద్దపండ్లు గలవాడుగాని, పండ్లు ఊడిపోవుటగాని అగును.

250. సూ : కేతౌ స్తబ్ధవాక్.

పైవిధముగా కేతువుండిన నత్తిమాటలుగాని, మూకత్వము గాని, స్ఫుటముగా మాట్లాడకపోవుటగాని కలుగును.

251. సూ : మందే కురూపః.

పైవిధముగా శని యున్నయెడల అందవికారమైనవాడగును.

252. సూ : స్వాంశవశాద్గౌరనీలపీతాదివర్ణః.

కారకాంశలగ్నమునుబట్టి, తదధిపతినిబట్టి రూపమును తెలుసుకోవలెను.

253. సూ : అమాత్యానుచరాద్దేవతాభక్తిః.

జాతకములో మూడవదిగా భాగలు భుక్తియైన గ్రహమునుబట్టి దేవతాభక్తి తెలుసుకొనవచ్చును.

254. సూ : స్వాంశే కేవల పాపసంబంధే పరజాతః.

కారకాంశలగ్నమునకు శుభసంబంధము బొత్తిగా లేనియెడల జారునకు బుట్టును. అనగా తండ్రి జారుడగుననుట సమంజసము.

255. సూ : శని రాహుభ్యాం ప్రసిద్ధః.

కారకాంశరాశికి శని రాహుసంబంధ మున్నయెడల నిశ్చయముగా నీ యోగము కల్గును. ఈ యోగము కొంతవరకు జన్మలగ్నముకుకూడ చూచుకొనవలెను.

256. సూ : గోపనమన్యాభ్యః.

కారకాంశమున ఈ శని రాహువులలో నెవ్వరు లేక, వారి సంబంధము లేక ఇతర నైసర్గిక పాపగ్రహము లున్నకూడ వ్యభిచారి యగును. ఈ యోగమున తండ్రి వ్యభిచారియై తల్లి కాక పోవుటయును గలదు.

257. సూ : శుభవర్గే అపవాదమాత్రం.

కారకాంశమునకు పైవిధము (అనగా 255వ సూత్రప్రకారం) కల్గి శుభసంబంధమున్న కేవల మపవాదము కల్గును.

258. సూ : ద్విగ్రహేకులముఖ్యః.

కారకాంశ రాశియందు రెండు గ్రహము లున్నయెడల తన వంశములో ముఖ్యుడగును.

గద్య

ఇది శ్రీ పార్వతీపరమేశ్వర కరుణాకటాక్షలబ్ధ మౌద్గల్యసగోత్ర
పవిత్ర శ్రీ వాడ్రేవు వంశపయః పారావార రాకాసుధా
కర శ్రీ రామ స్వామిశాస్త్రి శార్యపౌత్ర వేంకటరాజా
మాత్యపుత్ర సుకవిజనవిధేయ సూర్యనారా
యణ మూర్త్యభిధేయ ప్రణీతంబైన
వచనరూపంబగు జాతకనారాయ
ణీయమను జ్యోతిషగ్రంథంబున
ద్వితీయఖండంబునందు

జైమినీజాతక ఫలాధ్యాయము
సంపూర్ణము

# అనుబంధము APPENDIX

| | | | |
|---|---|---|---|
| 1 | సన్నిపాతజ్వరము | Typhoid fever | గురు, బుధులు |
| 2 | విషమజ్వరము | Malaria fever | శని |
| 3 | సంతతజ్వరము | Malarial Remittant fever | శని |
| 4 | అస్థిగతజ్వరము పురాణజ్వరములు | Long standing Fevers | do |
| 5 | అతిసారము | Diarrhoea and | కుజుడు ముఖ్యము |
| | గ్రహణి | Chronic diarrhoea | బుధ, శని, కేతువులు |
| 6 | అర్శస్సు మూలశంఖ | Piles | కుజుడు, రాహువు |
| 7 | రక్తార్శస్సు | Bleeding piles | |
| 8 | అగ్నిమాంద్యము | Dyspepsia | శని |
| 9 | అజీర్ణము | Indigestion | |
| 10 | కలరా | Cholera | కుజుడు |
| 11 | కామాలా(కామెర్లు) | Jaundice | గురుశుక్రులు |
| 12 | రాజయక్ష్మ | Consumption | కుజరాహువులు |
| 13 | అసాధ్యరాజయక్ష్మ | Tuberculosis | శుక్రుడు |
| 14 | తమకశ్వాసము | Asthma | శని, బుధకేతువులు |
| 15 | మహాశ్వాసము | Dyspnoea | శుక్రుడు |
| 16 | ఉన్మాదము | Insanity | చంద్ర, శని, శుక్రులు రాహువు |
| 17 | ధనుః స్తంభము | Titanus | రవిశనుల కలయిక కాక రవికుజశనుల కలయిక |
| 18 | పక్షఘాతము | Paralysis | శని |
| 19 | సర్వాంగవాతము | Diplegia | do |

| | | | |
|---|---|---|---|
| 20 | పంగు (కుంటి) వాతరోగమువలన వచ్చినది | Paraplegia | శని |
| 21 | అపతంత్రకము | Hysteria | కుజ, శనులు |
| 22 | మూకత్వము | Aphasia | బుధ, కేతువులు |
| 23 | వాతరక్తము | Gout | రవి, శుక్రులు |
| 24 | ఆమవాతము | Rheumatism | శని |
| 25 | శూల | Colic | శని, రాహువులు |
| 26 | పరిణామశూల | Gastralgokenosis | శని, కుజ రాహువులు |
| 27 | హృద్రోగము | Diseases of the Heart | శుక్రుడు |
| 28 | మూత్రకృచ్ఛ్రము | Dysuria | కుజబుధులు |
| 29 | వాతబస్తి | Retention of urine | do |
| 30 | ఉదకమేహము | Diabetes (Insipidas) | బుధుడు, గురుడు |
| 31 | ఇక్షుమేహము | Do (Mellitus) | do |
| 32 | ప్రమేహపీడిక లేక రాచకురుపు | Carbuncle | రవి |
| 33 | జలోదరము | Ascites | కేతువు, బుధుడు |
| 34 | మూత్రజవృద్ధి | Hydrocele | బుధుడు |
| 35 | రక్తజవృద్ధి | Haematocele | రవి బుధులు |
| 36 | బుడ్డగిలక | Hernia | బుధుడు |
| 37 | ఆంత్రవృద్ధి | Inguinal Hernia | డిటో |
| 38 | కుష్ఠము మరియు మహాకుష్ఠము | Leprosy & Diseases of the skin | కేతువు, శుక్రుడు చంద్రుడు |
| 39 | పామా | Eczema | శుక్ర కేతువులు |
| 40 | మశూచిక | Small Pox | బుధ కేతు, కుజులు |
| 41 | రోమాంతిక | Measles | |

| | | | |
|---|---|---|---|
| 42 | దంతరోగము | Diseases of teeth | గురుశనులు |
| 43 | బాధిర్యము | Deafness | శని |
| 44 | శుక్రమేహము | Spermatorrhoea | శని రాహుకుజులు |
| 45 | శిరఃశూలము | Headache | కుజ రాహువులు |
| 46 | శోధము | Dropsy | కేతువు |
| 47 | తువోదరము | Ulceration of the bowels | కుజుడు, శని |
| 48 | రక్తార్బుదము | Cancer | రవి, కుజులు |
| 49 | దంతవేష్టము | Pyorrhoea | గురుడు |
| 50 | కర్ణనాదము | Noises in the ear | కుజ రాహువులు (శనిగురులు) |
| 51 | కర్ణస్రావము | Otorrhoea | |
| 52 | కర్ణశూలము | Otitis, Otalgia | |
| 53 | నాసాపాకము | Postule in the nose and Suppurative Rhinites | కుజ శనులు వారికి బుధసంబంధము |
| 54 | కర్ణపాకము | Suppuration in the ear | కుజరాహువులు |
| 55 | పూతికర్ణ | Faetid discharge from the ear | డిటో |
| 56 | క్రిమికర్ణము | Worms in the ear | డిటో |
| 57 | రక్తప్రదరము | Menorrhagia | రవి కుజులు |
| 58 | శ్వేతప్రదరము | Leucorrhoea | కుజ శుక్రులు |
| 59 | వంధ్యాత్వము | Sterility | కుజ, శని, బుధ, శుక్రులు |
| 60 | గర్భస్రావము | Abortion | రవి, గురులు |
| 61 | మూఢగర్భము | Difficult Labour | స్త్రీజాతకమున పంచమాధిపతిని బట్టియు, అచ్చటనున్న పాపులనుబట్టి |
| 62 | పారిగర్భికము | Pining | |
| 63 | ఆర్తవము. | Menstruation | చంద్ర కుజులు |
| | | (Woman's Horoscope) | గురు కుజులు |

| | | | |
|---|---|---|---|
| 64 | యోనివ్యాపత్తు | Diseasee of Vagina | చంద్రకుజులు |
| 65 | | Intestinal T. B. | శని శుక్రులు కలియుటవలన |
| 66 | రక్తపోటు | Blood pressure (Tested) | శని |
| 67 | గుండె దడ | Palpitation of heart | గురుడు |

ఇచ్చట హృద్రోగమునకును, గుండె దడకును భేదము కలదు. హృద్రోగము Heart failure గా పరిణమించవచ్చును. గుండె దడ అట్లుకాదు. గుండె దడదడ కొట్టుకొనుట, నీరసముమాత్రము కలుగును. దీనికి గురుడు కారకుడగుచున్నాడు.

(This has been tested in a number of oases).

పై పట్టీలో శుక్రుడు కంటి రోగములకు కారకుడని వ్రాసినాను. ఇది మీనలగ్నమునకు శుక్రుడు ద్వితీయమందున్న యెడల ఎక్కువగా చెప్పవలెను.

జాతకములో రోగములను తెలుసుకొనుటకు జన్మలగ్నాత్తు, 3, 6 స్థానములబట్టి, ఆ స్థానాధిపతులను బట్టియును, తెలుసుకొనవలెను. కాని వరహామిహిరాదులు అష్టమస్థానమును బట్టికూడ రోగముల నిర్ణయించవలెనని చెప్పుచున్నారు. ఈ యభిప్రాయము కూడ సరియయినది. పైని చెప్పినట్టుగా 3, 6, 8 స్థానాధిపతుల అందలి గ్రహములనుబట్టియేగాక ఆయా గ్రహములకు చెప్పిన రోగములు వారివారి దశలయందుకూడ వచ్చుటకు వీలుండును. ఒకప్పుడు కొన్నిదశలలో 3, 6, 8 స్థానాధిపతులకు సంబంధము లేకనే కలుగుచుండును. ఇవి అనుభవముచేత నిర్ణయించుకొనవలెను. స్త్రీజాతకములో పుట్టినవిషయము పంచమాధిపతిని బట్టి

యును, పంచమమందున్న గ్రహములనుబట్టియును, పంచమమును చూచు గ్రహములనుబట్టియును తెలుసుకొనవలెను. ఫలము సులువుగా వచ్చునది, కష్టమెక్కువగా నుండునది లేనిది పైవిధముగా చూచుకొనవలెను.

ఒకప్పుడు రెండుమూడు గ్రహముల కలయికవలన రోగములు కూడ మార్పు కలుగవచ్చును. ఉదాహరణ :-రవి రక్తసంబంధమగు రోగములకు కారణమని ఋషుల యభిప్రాయము. శనికి నరముల (Nervous) సంబంధమగు రోగములకని చెప్పబడినది. వారిద్దరు కలసి మారకస్థానములందుండి వారి దశాంతర దశలలో మారకము జరుగవలసినప్పుడు (Titanus) వల్లగాని Paralysis వల్లగాని సాధారణముగా వచ్చుచున్నది. అట్లే శని, శుక్రుల సంబంధమువలన కేవలము Heart కు సంబంధమగు రోగముగాని లేక T. B. in Lungsవచ్చుచున్నది. ఒకప్పుడు Intestinal T. B. వచ్చుటయును కలదు. ఇదేవిధముగా గురుబుధుల దశాంతరదశలలో జ్వరము వచ్చినప్పుడు సాధారణముగా Typhoid క్రింద పెట్టుచున్నది.

